హాసం
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

74





ముఖచిత్రం
అక్కినేని నాగార్జున
స్పెషల్ ఫొటో

## హాస్యం



'సెంటర్ స్ప్రెడ్' లో



సినిమా పాటల ప్రత్యేకం



## సంగీతం



స్థలాభావం వల్ల 'చౌ చౌ చౌరాస్తా' శీర్షికను ఈ సంచికలో ప్రచురించలేకపోయాం. వచ్చే సంచికలో యథావిధిగా ఉంటుంది.
- ఎడిటర్

పాత పాటల ప్రత్యేకం
71వ పేజీ నుండి74 వ పేజీ వరకూ





'హాసం' అక్టోబరు 1-15 సంచికలో జమునగారి నా పాటలు శీర్షికలో మీరజాలగలడా, ఓ చెలికోపమా అన్న పాటలను దైతాగోపాలం, సముద్రాల వ్రాసినట్లు చెప్పారు. అది సరికాదు. ఆ పాటలను,స్థానం నరసింహారావు, డాక్టర్ దాశరథిగార్లు వ్రాసారు. ఆపాతమధురంలో వాగ్దానం 'దత్త' నవల ఆధారంగా తీసారని వ్రాసారు. అది సరికాదు. ఆ చిత్రం శరత్ 'వాగ్దత్త' నవల ఆధారంగా తీసారు.

**-దేశిరాజు భాస్కరరావు,హైద్రాబాద్.**

**(పాటల విషయంలో మీరు కరక్టు. 'దత్త' విషయం 'వాగ్దానం' సినిమా టైటిల్స్‌లో ఉన్న ప్రకారం ఇవ్వడం జరిగింది - ఎడిటర్)**

సినారెగారికి 'సీతయ్య' సినిమాలోని "ఇదిగో రాయలసీమ గడ్డ" అనే వాస్తవ చైతన్య గీతానికి నంది అవార్డు ఇచ్చి ఆ అవార్డు యొక్క గౌరవాన్ని మరింతగా పెంచారు. ముఖ్య విషయం ఏమిటంటే 'హాసం' పత్రికలో "సీతయ్య" ఆడియో రివ్యూ గురించి వ్రాస్తూ రాజాగారు కచ్చితంగా ఈ గీతానికి నందీ అవార్డు వస్తుందని, అలా ఇవ్వకపోతే మనమంతా ఆశ్చర్యపడాల్సి వుంటుందని విశ్లేషించారు. ఒక పెర్‌ఫెక్ట్ జర్నలిస్ట్ అంచనా, విశ్లేషణ, పరిశీలన, శోధన ఎలా వుండాలో ఈ సంఘటన ద్వారా నిరూపితమైంది.

**-కంట్లకుంట శరత్‌చంద్ర,మహబూబ్‌నగర్.**

'హాసం' 16-30 సెప్టెంబరు 2004 సంచికలో 'హ్యూమర్ బాక్స్' శీర్షికలో నా జోక్సు ప్రచురించి బహుమతిగా 'గౌరి' ఆడియో సిడిని పంపినందుకు మీకు, సోహన్ మ్యూజిక్ వారికి నా కృతజ్ఞతాభి వందనాలు! 'హాసం' అంటే నాకెంతో ఇష్టం మన తెలుగులో ఉన్న స్వచ్ఛమైన మంచి తెలుగు పత్రిక మా 'హాసం' అనడంలో సందేహం లేదు. ప్రతి సంచికను కవరు పేజీనుండి చివరిపేజీవరకు ఎంతో శ్రద్ధతో అద్భుతంగా తీర్చిదిద్దుతున్న మీకు అభినందన పూలమాలలు!

**-వి. స్వాతి తేజస్వీ,హైద్రాబాద్.**

ఈశాన్య భారతానికి కూడా 'హాసం' సరఫరా అయ్యేటట్లు మీరు తీసుకుంటున్న శ్రద్ధకు ఎంతో సంతోషం. నా హృదయపూర్వక ధన్యవాదములు. ప్రతీ పక్షం గౌహతి రైల్వే స్టేషన్‌కి వెళ్ళి స్వంత కాపీ తెచ్చుకుని తనివితీరా చదివి ఆస్వాదిన్తున్నాను. 16-30 సెప్టెంబరు సంచికలోని జంధ్యామారుతం లో 'వివాహభోజనంబు' చిత్రవిశేషాల వంటకం అద్భుతం. వంటవాడు, సరుకు మాస్టర్ అయిన శ్రీపులగం చిన్నారాయణగారికి, వడ్డించిన మీకు నా ప్రత్యేక ధన్యవాదములు.

**-సదాశివుని లక్ష్మణరావు, గౌహతి.**

'హాసం' సెప్టెంబరు16-30,2004 సంచికలో అర్థం చేసుకుందాం- ఆస్వాదిద్దాం శీర్షికలో తెలుగు 'ప్రేమనగర్ '(తమిళ్) 'వసంతమాళిగై ' 'ఎవరికోసం.. ఎవరికోసం.. ఈ ప్రేమ మందిరం' పాట అందించి నాకు అంతులేని ఆనందాన్ని అందించారు. అక్కినేని వారి అనితరసాధ్య అభినయం, ఘంటసాల వారి మధురగళం, ఆత్రేయగారి సాహిత్యం ప్రేక్షకులు ఎన్నటికి మరువ లేరు.

**-తాళాభక్తుల శేషబాబు, నాగాయలంక**

ముచ్చటగ మూడేళ్ళు పూర్తిచేసుకున్న 'హాసం' పత్రిక ప్రోగ్రెస్ రిపోర్టుకి 'ఎ గ్రేడ్' ఇవ్వాల్సిందే. కలగూరగంప పత్రికల్లా కాకుండా రెండే రెండు విషయాలు 'హాస్యం-సంగీతం' లకు సమపాళ్ళలో ప్రాముఖ్యం యిస్తూ 72 సంచికలు అందజేయడమన్నది సామాన్య విషయం కాదు. ఎడిటోరియల్ మాకు నచ్చింది ఎం.బి.యస్. ప్రసాద్‌గారి 'సంవీక్షణం' లో గజల్స్ గురించి చక్కగా విడమరిచి అర్థమయ్యేలా చెప్పడం మాకు ఎంతో నచ్చింది. శ్రీమతి జమునా రమణారావు గారి 'నేను నా పాటలు' శీర్షిక మాకు నచ్చింది. మరుగున పడిపోతున్న ఎన్నో మధురగీతాలు మాకు అందజేస్తున్నందుకు ధన్యవాదాలు.

**-జగత్ కుమారి, బరంపురం.**

'హాసం' పత్రికలో విలువైనవి అలనాటి పాతపాటలు, విశ్లేషణలు, కథా సంగ్రహం కలకలం దాచుకొని, ఉపయోగించుకొనేలా వున్నాయి. కొత్త సినిమా పాటల ప్రత్యేక సంపుటి మాకు ఉపయుక్తమైన కానుక. ఆ పాత(ట) మధురంలో 'వాగ్దానం' సినిమాలోని పాటలు విశ్లేషణ, 'నేను నా పాటలు' శ్రీమతి జమునా రమణారావు గారి ధారావాహిక సీరియల్ , 'జంధ్యామారుతం'లో 'రెండు రెళ్ళు ఆరు' సినిమా విశేషాలు చాలా చాలా బాగున్నాయి. మొత్తానికి పత్రిక అందంగా, ఆకర్షణీయంగా, వినోదాత్మకంగా, విజ్ఞాన దాయకంగా వుందని నా అభిప్రాయం.

**-వై.రాజానాయుడు, చిత్తూరు**

'హాసం' నాలుగో యేటి తొలి సంచిక నుండి ప్రారంభించిన "పలకరిస్తే పద్యం" అన్న శీర్షిక ఎంతగానో ఆకట్టుకుంది. సాహిత్యానికి సంబంధించి "నవ్వుటద్దాలు" లేని లోటును ఈ శీర్షిక తీర్చబోతుంది. చాలా సంతోషకరం. మాలాంటి ఎందరో సాహిత్యాభిమానులకు. ఐతే నాదో చిన్న విన్నపం. అదేటంటే - పాఠకుల నుండి పూరణలు గోరి, వాటిలో ఉత్తమమైన వాటికి (అవధానిగారిచే ఎంపిక చేయబడిన) బహుమతులు ప్రకటిస్తే బాగుంటుంది. దీని వలన పాఠకుల్లోని (సాహిత్యాభిమానులైన) సాహిత్యాభిలాష కొంతైనా తీరడంతో పాటు, పాఠకుల మెదళ్ళకు మేత పెట్టినట్టౌతుంది. పాఠకుల పూరణాలను ప్రచురించడం వలన ఎందరితో పద్యాలు ఎరుకౌతాయి. ఈ శీర్షికను వీలౌనంత కాలం కొనసాగిస్తారని, సాగించాలని నా అభ్యర్థన.

**-దేవరం సతీష్‌కుమార్, జగిత్యాల.**

1-15 అక్టోబర్ సంచికలో అన్నమయ్య కీర్తనలలోని భావాలని బాలకృష్ణప్రసాద్‌గారు తెలియజేసే శీర్షిక చాలా బాగుంది. మంచి శీర్షికను అందిస్తున్న మీకు కృతజ్ఞతలు, 'రెండు రెళ్ళు ఆరు' సినిమా గురించి తెలియజేసిన విషయాలు చాలా ఆకట్టుకున్నాయి. 'భలే తమ్ముడు'లోని పాటలు ప్రచురించునందుకు చాలా సంతోషం

**-వరదా సాయికుమార్, పర్లాకిమిడి**

1-15 అక్టోబర్ 'హాసం' సంచికలో జమున గారి 'నేనూ నా పాటలు' శీర్షికన మీరందిస్తున్న వ్యాస పరంపరలో వారి అనుభవాలు మమ్మల్ని అలరిస్తున్నాయి. 'శ్రీకృష్ణ తులాభారం' చిత్రంలోని 'మీరజాలగలడా' పాటను వ్రాసినది కీ॥శే॥స్థానం నరసింహారావు గారని నేను ఒక పుస్తకంలో చదివినట్టుగా గుర్తు. మరి మీరేమో దైతా గోపాలం అని ఇచ్చినారు. మరి ఇద్దరిలో ఎవరో వివరిస్తే మాలాంటి వారికున్న అనుమానం తొలగిపోతుంది. 'లలిత సంగీతం' శీర్షికన శ్రీచిత్తరంజన్ గారందిస్తున్న గీతాలు బాగుంటున్నాయి. శ్రీమతి ఆదూరి సత్యవతీ దేవి గారి 'అదిగదిగో మా తల్లి అందాల వల్లి' గీతాన్ని మాకుటుంబ సభ్యులం నేర్చుకుంటున్నాము. శ్రీగరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్ గారు యీ సంచికలో అందించిన అన్నమాచార్యుల 'వినరో భాగ్యము విష్ణుకథ' మన హాసానికే హైలైట్. ప్రతి పక్షం మేము ఈ శీర్షిక కోసం ఎదురు చూస్తుంటాం. 'జంధ్యామారుతం'లో 'రెండు రెళ్ళు ఆరు' వివరణ సంపూర్ణంగా వుంది. సినిమాలో ప్రజాదరణ పొందిన డైలాగ్స్ బాగున్నాయి. ఇక 'మృణాళిని' గారి రఫీ వ్యాస పరంపరలో ఇచ్చిన 4 పాటలను భద్రపరుచుకున్నాను. నేను ఎన్నిరోజులనుండో ఎదురు చూస్తున్న 'బ్రహ్మచారి' సినిమాలోని 'దిల్ కే ఝరోంకే మే' పాట ఇచ్చినందుకు కృతజ్ఞతలు. 'పలకరిస్తే పద్యం' శీర్షికన డా॥గరికపాటి నరసింహారావుగారు ప్రారంభించిన పద్యములు, కీ॥శే॥ ఆచార్య తిరుమల గారు లేని లోటును కొంతవరకు తీర్చుతాయని ఆశిస్తాను.

**-ఏలూరు అశోక్ కుమార్ రావు, గుర్రంపోడ్**

సంపుటి: 4 సంచిక:02

**16 - 31 అక్టోబరు 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా॥ కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**

మేనేజర్
**పి.గిరి**
చీఫ్ లే-అవుట్ డిజైనర్
**జి.రాజేష్**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82



The one and only Magazine devoted to Humour & Music




# హాసం

హాస్య - సంగీత పత్రిక

74

మనం చూసేవరకూ, అనుభవించేవరకూ ప్రతీదీ కొత్తదే! ఆ కొత్తదనం కలిగించే పరవశం, అనుభూతి ఎంతో గొప్పవి. హిమాలయాలు యుగాలుగా అక్కడే వుండవచ్చు. కానీ తొలిసారిగా వాటిని చూసినపుడు మనసు ఉరకలు వేయకతప్పదు. చిన్నపిల్లవాడు ఓ బంతిని చూసి పరవశించి గంతులేస్తూంటే మనకు ఆశ్చర్యంగా తోచవచ్చు. కానీ గతంలోకి తొంగిచూస్తే మనమూ మొదటిసారి బంతిని చూసినపుడు అలాగే గంతులు వేసివుంటాం. ఇది హృదయస్పందన!

తాజ్‌మహల్ చూడగానే 'అబ్బ! ఎంత బాగుందో' అని అనిపించడం సహజం. కానీ కొంతమంది అక్కడితో ఆగరు. హృదయానికంటె బుద్ధికి ఎక్కువ పనిచెప్తారు. 'ఇదేమిటి? ఇలా కట్టారు? కాస్త అటుతిప్పి కట్టాల్సింది. పాలరాయితో కాకుండా గ్రెనేట్‌తో కట్టాల్సింది' అనుకుని 'నేనైతేనా?' అని ఆలోచించి, వినేవారుంటే సలహాలు ఇవ్వబోతారు. ఆ కట్టినవాళ్లు ఇవన్నీ ఊహించి, సాధ్యాసాధ్యాలు విచారించి, పర్యవసానాలు అనుభవించి చివరకు ఈ మార్గం పట్టారేమో!

'హాసం' క్రమంగా విస్తరిస్తోంది కాబట్టి, ప్రతిరోజూ ఎవరో ఒక కొత్త వ్యక్తికి 'హాసం' గురించి తెలుస్తూ ఉంటుంది. తొలిసారి చూడగానే కలిగే ఉత్సాహం, ఉత్తేజం దశ గడిచాక, వారిలో కొందరు పైన చెప్పిన విధంగా ఆలోచిస్తున్నారని వారి ఉత్తరాలవల్ల తెలుస్తోంది. అప్పటికి లభించిన ఓ నాలుగు సంచికలు తిరగేసి, త్వరపడి ఓ నిర్ణయానికి వచ్చేసి, 'ఫలానా విధంగా చేయవచ్చుగా, ఫలానావారి గురించి వ్రాయవచ్చుగా' అంటూ సలహాలు ఇస్తున్నారు. వీరందరికీ మా విన్నపం ఒకటే! 'పాత సంచికలు అందుబాటులో ఉంచుతున్నాం. మేం ఏ దిశగా ఎంత కృషి చేశామో చూసి,ఒక అంచనాకు రండి, ఆ పైన ఒక అభిప్రాయానికి రండి' అని.

పెద్దలు ఎప్పుడో చెప్పారు. దేనికైనా పూర్వాపరాలు ఆలోచించాలని. పూర్వగాథ తెలుసుకుంటేనే ప్రస్తుతం గురించి వ్యాఖ్యానించగలం. అలాగే పూర్వంలో పాతుకుపోకుండా తర్వాత జరుగుతున్న విశేషాలు కూడా గమనించాలి. ' నా తర్వాత ప్రళయమే' అన్న ఫ్రెంచి చక్రవర్తిలా 'నేను వినడం మానేసిన తర్వాత వచ్చిన అన్ని పాటలూ చెత్తే' అని తీర్మానించేస్తారు కొందరు! 'కొత్తపాటల్లో ఏముందండీ! ఎందుకూ వాటిగురించి వ్రాసి పేజీలు పేజీలు వేష్టు చేస్తారు?' అని సుద్దులు చెప్తారు.

ఏడాదికి సుమారు 500 కొత్తపాటలు వస్తూంటే వాటిలో కనీసం పదిశాతమైనా మంచి పాటలుండి వుంటాయన్నది సాధారణతర్కం! ఫలానావారు వినడం మానేశారు కదాని కవులు, సంగీతకారులు, గాయకులు తమ తమ ప్రతిభలను మూటగట్టి అటకపై పడవేయరు కదా! తన తరానికి ముందుతరంలో ఉన్న పాటలూ వినాలి, తర్వాతి తరం పాటలూ వినాలి. అప్పుడే సమ్యక్‌దృష్టి అలవడుతుంది. తర్వాతి తరం వాటిని ఎందుకు ఆదరిస్తోందో విశ్లేషించాలన్న ఆసక్తి కలుగుతుంది.

'హాసం' అన్నిరకాల శ్రోతలను దృష్టిలో పెట్టుకుని రూపొందిన పత్రిక. ఫలానా కాలంలో వచ్చినవన్నీ మంచిపాటలనీ, ముందూ వెనుకా వచ్చినవన్నీ చెత్త అనీ అనుకునేవారితో మమేకం కాదు. సంగీతం పరిణామక్రమాన్ని పరిశీలిస్తూ, చరిత్రబద్ధం చేస్తూ, విశ్లేషిస్తూ, వివరిస్తూ, చెడును విస్మరిస్తూ, మంచిని చాటిచెప్తూ ఒక వ్యాఖ్యాతగా తన బాధ్యతను నెరవేరుస్తూనే ఉంటుంది. ఒక పాట జనరంజకం అయినపుడు దానిలో ఏ అంశం ప్రజలకు నచ్చిందో, ఆ బాట ఏ మేరకు ఇతరులకు అనుసరణీయమో తన శక్తిమేరకు విశదీకరిస్తుంది. ఎవరో కొంతమందిని సంతృప్తి పరిచేందుకు ఓ కాలానికో, ఓ కళాకారుడికో గిరి గీసుకుని ఉండటం జరగదు. ప్రతి రచనకూ, ప్రతి పాటకు ఎవరో ఒక అభిమాని ఉంటూనే ఉంటాడు. అందరినీ కలుపుకుని పోతూ, హాస్య, సంగీతాలు సాధనంగా అందర్నీ దగ్గరకు చేర్చాలన్నదే 'హాసం' లక్ష్యం.



మా ఆశయాలను గుర్తించి మాపై విశ్వాసముంచితే చాలు, ఏ అపోహలూ ఉండవని మా నమ్మకం.




# చాట్ మాటు సరదాలు

**-దుర్గమహంతి మోహనరావు**

**'మ**మ్మీ, నేను నెట్ సెంటర్ కెళ్తున్నాను'

'ఎందుకే ?'

'చాట్ చేసుకోవాలి'

'ఇంట్లో వుంటే నోరు చాట్ బండార్, బయటికెల్తే చాట్! ఇంకేం పనిలేదా ? ఇంట్లోనే వుండి నోట్స్ రాసుకోవచ్చుకదా'

'ఇప్పుడే వచ్చేస్తా ఈలోగా టీవీ సీరియల్స్ చూస్తూండమ్మా'

'ఏంటో జీవితం ! నీకేమో వెబ్, మీ నాన్నకేమో పబ్, నాకేమో ఈ టీవి, మా చిన్నప్పటి రోజుల్లో ఫేమిలీ మెంబర్సంతా కల్సి యే పార్కుకో, పిక్‌నిక్‌కో, ఫ్రెండ్స్ ఇంటికో వెళ్ళేవాళ్ళం.

బంధువర్గం అంతా 'బంద్' వర్గంగా మారిపోయిన రోజులివి. ఈ స్పీడ్ యుగంలో ఎవరింటి కెళ్ళినా కళ్ళన్నీ టివీకే అప్పచెప్పేస్తారు, పిల్లలేమో హోమ్ వర్క్‌ల పేరుతో రూం తలుపులేసుకుంటారు. ఆయనొచ్చేవరకు బతుకు టీవీకి బుక్కైపోవలసిందే. ఆయనొచ్చాక మాత్రం ఏముంటుంది.. తిన్నాక పేపర్లో తల దూరుస్తారు, నిద్రొస్తే తలగడలో తల దూరుస్తారు.' అంటూ లంకంత కొంపలో సుందరమ్మ ఒక్కతే కూర్చొని వాపోయింది.

సుందరమ్మ మొగుడు కార్పొరేట్ ఆఫీసులో లీగల్ మేనేజర్. పెద్దబ్బాయి జస్ట్ ఇంజనీరింగ్ కంప్లీట్ చేసి అమెరికా ఫ్లైట్ ఎక్కటాన్కి రెడీగా వున్నాడు. తర్వాతది వసుధ. ఫైనలీయర్ ఇంజనీరింగ్ వెలగబెడుతోంది. ఆ తర్వాత వాడు వాసు. ట్రిబుల్‌ఈలో మిగిలిపోయిన ఇంజనీరింగ్ సీటు పేమెంట్లో సంపాదించి, బతుకు పేవ్‌మెంట్ మీద పడకుండా బయటపడ్డాడు. అయిన కాలేజి నుంచి వచ్చాక బయట కాస్త 'పిల్ల' గాలి పీల్చుకోలేక వుండలేడు. ఎల్ కేజీ నుండి ఎమ్‌సెట్ వరకు అమ్మనాన్న చెప్పినట్లే పుస్తకాలు మోసి ట్యూషన్లకి పోయి చివరికి ఓ ఇంజనీరింగ్ కాలేజివాడయ్యాడు.

వసుధకి చిన్నప్పటినుండి ఆడమగ తేడా లేకుండా ఆటపట్టించడమే పని. 'ఇంజనీరింగు చదువుతూ కూడా నీకిదేం బుద్ధే పిల్లా' అని తల్లి ఎన్నిసార్లు క్లాసు పీకినా పుట్టకతో వచ్చే బుద్ధి పుడకల్తో గానీ పోదు అన్నట్టు 'లైఫ్ ఈజ్ కామెడీ మేకిట్ థ్రిల్' అంటూంటుంది వసుధ.

రోజులాగే వసుధ సైబర్‌కేఫ్ కెళ్ళి చాటింగ్ ఓపెన్ చేసింది, యే బకరా గాడు దొరుకుతాడాని! అరగంట తర్వాత దొరికాడు 'మాధవ్'అనే

చాటింగ్ బాయ్. ఒకప్పుడు కౌబాయ్ ఫిల్మ్‌కున్న గిరాకుంది, ప్రస్తుతం ఇంటర్‌నెట్ మార్కెట్‌లో చాటింగ్‌చేసే బాయ్స్‌కి, గాళ్స్‌కి.

'హలో .. మాధవ్.... హౌఆర్‌యూ?..నాపేరు ప్రియా' మాధవ్‌కి అడ్రస్ చేస్తూ చాటింగ్ మొదలెట్టింది వసుధ ఉర్ఫ్ ప్రియ.

'ఫైన్.. థాంక్యూ, ఫర్ కైండ్ చాటింగ్ ప్రియ గారు!' రిప్లై ఇచ్చాడు మాధవ్.

'మీరేం చేస్తుంటారు'

'ఎడ్యుకేషన్.. ఫస్టియర్ ఇంజనీరింగ్ స్టడీస్... ట్రిపుల్ ఇ '

'ఫైన్ నేను కూడా ఫైనలియర్ ఐటి'

'మీ పేరెంట్స్?'

'వున్నారు'

'వున్నారా.. పోయారా అని నేనడగటం లేదు మేడమ్. ఏం చేస్తుంటారు అని'.

'బిజినెస్! నన్ను మేడమ్ అనవసరంలేదు, ప్రియా అని పిలవండి చాలు'.

'థాంక్యూ... బిజినెస్ అంటే ?'

'పల్లీలమ్ముతారు'

'హోల్ సేలా?'

'కాదు, థియేటర్ దగ్గర.. హైటెక్ సిటీ నడి వీధుల్లో'

'జోక్ చేస్తున్నారా..... '

'జోక్ కాదు నిజం! నన్ను గారు -మీరు -నీరు అని సంబోధించ నవసరం లేదు, కనుక 'రు' భాష మానేయ్యండి'

'ఓకె. ఇంకోసారి 'రు' వాడను.. ప్రామిస్..'

'ఒట్టేసి చెప్పనవసరం లేదు. మీ హాబీస్ ఏమిటి?'.

'బేబీస్‌ని చూట్టం'

'అంటే పార్ట్‌టైం బేబీ క్రెచ్ రన్ చేస్తుంటారా?'

'బేబీస్ అంటే మీ లాంటి బేబీస్‌ని అని అర్థం..'

'నా హాబీ ఏంటో తెల్సా? మీ లాంటి వాళ్ళని కేపాల్‌కి పంపించటం'

'నేపాల్,భూపాల్, టినోపాల్ అంటే తెల్సుకాని ఈ కేపాల్ యేమిటీ?'

'అదొక బోన్ సెట్టింగ్ సెంటర్. డి-లింక్ అయిన బోన్స్‌ని లింక్ అప్ చేస్తారు'

'యూ... ఫన్నీ గాళ్'

'లైఫ్ ఈజ్ ఫన్ .. ఓ.కె.. బై..వుంటాను. (చి) లిపి కబుర్లతో ముగించింది వసుధ.

* * *

'మమ్మీ నేను నెట్ సెంటర్‌కెళ్తున్నాను.వెబ్‌సైట్ చూడాలి.' రోజూ లాగానే తల్లికి బై చెప్పి వెళ్ళిపోయింది వసుధ.

'నీ సైట్ ఏవిటో ! నాకర్థం కావటం లేదు. నాకేమో టీవీ చూసి- చూసీ -చూసీ సైటొచ్చేసింది. ఇంతకీ ఆ వాసుగాడేడి? వాడే సైట్‌లో తిరుగుతున్నాడో?! ఈ లంకంత కొంపలో నేనొక్కదాన్నే బల్లిలా ఈ బుల్లి తెరకి అతుక్కు పోవలసిందే' గొణుక్కుంటూ తలుపేసుకుంది సుందరమ్మ.

'హలో.. ప్రియా.. ఈ నెల రోజుల చాటింగ్ నువ్ నాకెంతో దగ్గరైనట్టనిపిస్తుంది. నా హార్ట్ - డిస్క్‌ని నీ మెమోరీస్‌తో నింపేసుకున్నావ్ ' చాటింగ్ స్టార్ట్ చేశాడు మాధవ్.

'లగ్నం అంత దగ్గరయ్యామా!' రిప్లైయిచ్చింది ప్రియ.

'లగ్నం వరకు వచ్చేంత 'సీను'ందా ?'

'లగ్నం అంటే పెళ్ళి లగ్నం కాదు, తూర్పున భూమ్యాకాశాలు కల్సినట్లు కనిపించే ప్రదేశాన్ని 'లగ్నం' అంటారు'.

'అయితే ఖగోళ శాస్త్రంలో కూడా పరిజ్ఞానం వుందన్న మాట అంచేత మన కలయిక ఎప్పుడో చెప్పొచ్చు కదా? స్వయంగా చూడాలని వుంది... ఎన్ని రోజులీ 'విండోస్' లుక్స్?'

'కనిపించే అమ్మాయిలందరికి ఇలానే ఐ-లింక్ తో కలిపి లైనేస్తున్నావా'?

'ఈ అబ్బాయి చాలా మంచోడు, కనిపించని అమ్మాయిలతోనే ఈ చాటింగ్'

'అందుకే నువ్ నాకు నచ్చావ్'

'ఐతే.. మరి మనం ఎన్టీఆర్ గార్డెన్‌లో కల్సుకుందామా, రేపు నేను ఎల్లో టీషర్ట్ వేసుకొస్తాను'.

'ఇదేమైనా టిడిపి పార్టీ మీటింగా, పసుపు చొక్కాతో రావటానికి'

'అబ్బా ! మీ లేడీస్ ఎప్పుడు ఇంతే! రంగులు బాగా గుర్తు పెట్టేసుకుంటారు. ప్రియా, నిన్ను ఇంత తొందర్లో కలుస్తానని అనుకోలేదు. డోంట్ బీ లేట్'

'లేట్ అంటే 'కీర్తిశేషులు' అని అర్థం కాదుకదా! ఓ.కె. ఇన్-టైమ్ కే వస్తాను' అంటూ ఫైల్ క్లోజ్ చేసింది ప్రియ.

'యాహూ(`..అంటూ ఆనందంతో కీ బోర్డ్ విరగొట్టేంతటి పనిచేశాడు మాధవ్.

* * *

ఎన్టీఆర్ గార్డెన్ టూరిస్టులతో, కొత్తగా పెళ్ళైన జంటలతో, కాలేజి స్టూడెంట్స్‌తో, లవర్స్‌తో కోలాహలంగా పెళ్ళిపందిరిలా కళకళలాడి పోతూంది. అప్పుడే అడుగుపెట్టిన వసుధ పసుపుపచ్చ చొక్కా కోసం కలయచూడ సాగింది. గార్డెన్ రెస్టారెంటులో పాతకారు మోడల్లో ఫోర్‌చైర్స్ సీటింగ్ ఎకామడేషన్ చివరగా వాసు కూర్చున్నాడు ఎల్లో టీషర్ట్‌తో. వడివడిగా అతనిదగ్గర కెళ్ళింది .

'హాయ్ !...వాసు ఏంట్రా హీరోలా ఎవరి కోసం బీటు కొడుతున్నావ్'

'హాయ్ ! అక్కా !...నువ్వు.. ఇక్కడ కొచ్చావేంటి?'

'అఁ..ఏం లేదురా మాధవ్ అని నా ఇంటర్‌నెట్ ఫ్రెండ్ ఎల్లో టీషర్ట్‌తో వస్తానన్నాడు. నిను చూసి అతనేమో అనుకున్నాను'

'అక్కా..నువ్ నన్ను ఫూల్ చెయ్యడానికి ఈ రోజు ఏప్రిల్ ఫస్ట్ కాదు కదా! నాకెందుకీ 'అగ్ని పరీక్ష?' అక్కను చూసిన 'భగ్న' హృదయంతో అడిగాడు వాసు.

'అగ్నిపరీక్షలు ఫైర్ సర్వీసు వాళ్ళకుంటాయి నీక్కాదు. నీలాంటి వాళ్ళు రోజా ఫూల్స్ కాకుండా వుండాలని, నెలరోజులనుండి నిను ఫాలో అవుతున్నాను. ఒకరోజు నీ డైరీ కూడా చదివాను. మాధవ్ అంటే నా తమ్ముడివేనని కన్‌ఫర్మ్ చేసుకున్నాను. నాన్నగారు లీగల్ మేనేజర్ కదా అని నువ్ ఇల్లీగల్‌గా బిహేవ్ చెయ్యొచ్చను కుంటున్నావా? బోలెడు డబ్బుపోసి పేమెంట్ సీటు కొని వాళ్లు చదివించేది నువ్వొక ఇంజినీర్ కావాలని.

'వాసూ, బ్రెయిన్ యొక్క నేచురల్ బిహేవియర్ చదువుకున్నవాడికి, లేనివాడికి ఒకేలా వుంటుంది. కాని నీకంటూ ఒక లక్ష్యం (ఆబ్జెక్టివ్), ..ఐమీన్ గోల్ వుంది, దట్ ఈజ్ ఎడ్యుకేషన్! ప్రస్తుతం నీకది టాప్ ప్రయారిటీ, అది కంప్లీట్ చెయ్యటానికి నాలుగేళ్ల డెడ్‌లైన్ కూడా వుంది. వీటిని బ్రెన్ సాఫ్ట్‌వేర్‌లో ఒ.పి.డి. అంటారు. అంటే ఆబ్జెక్టివిస్, డెడ్‌లైన్ , ప్రియారిటీస్!

'మనలో ప్రతి ఒక్కరి బ్రెన్ ఆటోమేటిక్ థింకింగ్ మోడ్‌లోనే (ఎ.టి.ఎమ్.) పనిచేస్తుంది. అంటే బ్రెన్ తనకు అలవాటుపడ్డ, తెలిసిన సులువైన, మార్గంలోనే ఆలోచిస్తుంది. దాన్ని డెలిబిరేట్ థింకింగ్‌మోడ్ లో (డి.టి.ఎమ్.) పనిచేయించాలి. ఎప్పుడూ ఆర్గనైజ్డ్ థింకింగ్ చెయ్యాలి. సెల్ఫ్ డిసిప్లిన్‌తో పెరిగినప్పుడు నువ్వొక మహోన్నత వ్యక్తిగా మారుతావు. అంతే కాని ఇలా వెబ్‌లోచిట్-చాట్ చేసుకుంటూ గాళ్ ఫ్రెండ్స్‌తో సినిమాలకి, షికార్లకి తిరగటానికి కాదు. కెరియర్ గురించి ఆలోచించు. పిచ్చివేషాలెయ్యకు. మన పేరెంట్స్ మన కోసం ఎంత కష్టపడుతున్నారో అర్థం చేసుకో'' అక్క హృదయంతో మందలించింది వసుధ.

'సారీ .. అక్కా... ఇంకెప్పుడూ మిస్‌బిహేవ్ చెయ్యను, ప్రామిస్' ఆమె చేతిలో చెయ్యివేశాడు.

'వెరీగుడ్! మనిద్దరి 'భేటీ' లో చివరిది 'టీ' తీసుకుందాం పద' అంది. ఆమె కళ్ళు ఆనందంతో మెరిశాయి.

'వద్దక్కా చాట్‌బండార్ కెళ్ళి నీ కిష్టమైన చాట్ తిందాం' పకపక నవ్వేశాడు వాసు. శృతి కలిపింది వసుధ.

అక్టోబరు 15, 2004 నుండి జరిగే తిరుమలేశుని బ్రహ్మోత్సవాల సందర్భంగా....

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## శ్రీ శేషాచలవాసా

ప॥ శ్రీ శేషాచలవాసా
దయ చూపరా వేంకటేశా
ఆశ్రితజన దీనరక్షా - దేవా
అమర వినుత శేషశయనా ॥శ్రీశేషాచలవాసా॥

చ॥ కలియుగ వైకుంఠవాసా
కరుణచూడు మందహాసా
కామిత ఫలదాత భక్తపోషా
కమలనయన తిరుమలేశా ॥శ్రీశేషాచలవాసా॥

చ॥ మనసిజ సుందవేషా - మ
మ్మేలుము శ్రీనివాసా
మానిత సజ్జన సురమౌని పోషా
మధుర మధుర మృదుహాసా ॥శ్రీశేషాచలవాసా॥

**రచన** : శ్రీమతి జొన్నవాడ రాఘవమ్మ
**గానం** : శ్రీమతి విజయలక్ష్మీ దేశికన్
**సంగీతం** : ఎం. చిత్తరంజన్
**రాగం** : లతాంగి -63 వ మేళ కర్త
**తాళం** : ఆది (కర్ణాటక సం॥)
కహరువా (హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : స రి గ మ ప ద ని స
**అవరోహణ** : స ని ద ప మ గ రి స

షడ్జము, చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, ప్రతిమధ్యమం, పంచమం, శుద్ధదైవతం, కాకలి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

లతాంగి కర్ణాటక సంగీతంలోని 63వ మేళ కర్త రాగం. ఇది అంతగా ప్రాచుర్యాన్ని పొందిన రాగం కాదు. వాగ్గేయకారులు కొందరు రచించిన కీర్తనలు యీ రాగంలోనివి మచ్చుకు కొన్ని దినమే సుదినము (త్యాగరాజస్వామి), సాధుజన వినుతం గురుగుహం (దీక్షితర్), అపరాధము లన్నియు మన్నించి ఆదరించవయ్యా (పట్నం సుబ్రహ్మణ్యఅయ్యర్) ,మరివేరే దిక్కెవ్వరు (పట్నం సుబ్రహ్మణ్యఅయ్యర్), తామ్రలోచని లతాంగి (బాలమురళీకృష్ణ).

హిందుస్తాని సంగీతంలో యీరాగం లేదు. అయితే హిందూస్తాని విద్వాంసులు కొంతమంది కర్ణాటక రాగాలను స్వీకరించి వారి పద్ధతిలో పాడడము, వాయిద్యాలపై వాయించటము చాలా కాలంగా జరుగుతున్నదే. సరస్వతి, చారుకేశి మొదలగు రాగాలను పండిత్ రవిశంకర్, రామ్‌నారాయణ్ వంటి వారు సభలలో వాయించారు. ఉస్తాద్ అబ్దుల్ హలీమ్ జాఫర్ ఖాన్ సితార్‌పై అకాశవాణి కార్యక్రమంలో లతాంగి రాగం వాయించి పలువురి ప్రశంసలు పొందాడు. లలిత సంగీతంలో కూడా యీ రాగాం



అంతగా ప్రాచుర్యాన్ని పొందలేదు. నేను కొన్ని లలిత గీతాలకు యీ రాగాన్ని ఉపయోగించి ఆకాశవాణిలో గాయనీ గాయకుల చేత పాడించాను.

'కలౌవేంకటనాయకః' అని స్తుతించబడే కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీవేంకటేశ్వర స్వామి తెలుగువారి ఇలవేలువు. తిరువతి మహాక్షేత్రంలోని తిరుమల కొండపై వెలసియున్న శ్రీ మహావిష్ణువు యొక్క అవతారమైన వేంకటేశ్వర స్వామి వారికి ప్రతినంవత్సరమూ బ్రహ్మోత్సవాలను అంగరంగ వైభవంగా తిరుమల తిరుపతి దేవస్థానం, వారు నిర్వహిస్తూంటారు. ఈ ఉత్సవాలను స్వయంగా బ్రహ్మదేవుడు జరిపించాడని పెద్దలు చెబుతారు. శ్రవణ నక్షత్రం శ్రీనివాసుని జన్మనక్షత్రం. సౌరమానం ప్రకారం కన్యా సంక్రమణంలోను, చాంద్రమానం ప్రకారం ఆశ్వయుజ మాసంలోను వచ్చే శ్రవణ నక్షత్రం నాడు శ్రీవారి జన్మదినం. దీనికి తొమ్మిది రోజుల ముందు నుండి బ్రహ్మోత్సవాలు జరుపుట ఆనవాయితి. చాంద్రమానంలోని అధికమాసం కారణంగా యీ బ్రహ్మోత్సవాలు 3సంవత్సరముల కొకసారి ఏడాదిలో రెండుసార్లు జరుగుతాయి. ఈ సంవత్సరం సెప్టెంబరు,2004 లో (కన్యాసంక్రమణం) బ్రహ్మోత్సవాలు జరిగినవి. తిరిగి అక్టోబరు, 2004లో (ఆశ్వయుజం) జరుగనున్నాయి. విష్వక్సేనపూజ, ధ్వజారోహణంతో ప్రారంభమైన యీ ఉత్సవాలు అవబృధ స్నానం, ధ్వజావరోహణంతో ముగుస్తాయి. స్వామి వారిని ప్రతిదినమూ పెద్ద శేషవాహనం, చిన్న శేషవాహనం, హనుమంతువాహనం, గరుడవాహనం మొ॥లగు వాహనాలపై తిరుమాడ వీధులలో ఊరేగిస్తారు. బాలకృష్ణుడు, కాళీయమర్దనకృష్ణుడు, జగన్మోహిని, సరస్వతి, యిత్యాది అలంకారాలతో నయనానందకరంగా శ్రీనివాసుడు భక్తజనులను అనుగ్రహిస్తాడు. దేశం నలుమూలల నుండి భక్త బృందాలు వచ్చి తమ నృత్య, గీత, భజనలతో ఊరేగింపులో పాల్గొంటూ స్వామిని సేవించు కుంటారు. కలియుగ వైకుంఠమైన తిరుమలలో





బ్రహ్మోత్సవాలలో ప్రత్యేకంగా గరుడోత్సవం, రథోత్సవం దర్శించినవారికి పునర్జన్మ వుండదని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

'వేంకటాద్రి సమంస్థానం బ్రహ్మాండే నాస్తికించన

వేంకటేశ నవెూదేవో నభూతో నభవిష్యతి'

అని అన్నమాచార్యులు మొదలుగా ఎంతో మంది భక్తులు వేంకటేశ్వర స్వామిని వేతీరుల స్తుతించారు.

"శ్రీశేషాచలవాసా దయా చూపరా వేంకటేశా" అనే గీతాన్ని శ్రీమతి జొన్నవాడ రాఘవమ్మ హృద్యంగా రచించగా నా సంగీత దర్శకత్వంలో శ్రీమతి విజయలక్ష్మి దేశికన్ ఎంతో భావయుక్తంగా ఆకాశవాణిలో గానం చేసింది.

**(లతాంగి అపూర్వ రాగం కనుక ఆ రాగంలో చిత్ర గీతాలుండవు)**

## హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు

### 1965

తన రెండో చిత్రం 'భూత్ బంగ్లా' ద్వారా రాహుల్ దేవ్ బర్మన్ సంగీత దర్శకునిగా పేరు తెచ్చుకున్నాడు. తర్వాతి కాలంలో వందలాది పాటలు పాడించుకున్న కిశోర్‌కుమార్‌తో రాహుల్ శ్రీకారం చుట్టినది ఈ సినిమాతోనే! నటుడుగా (చిన్న హాస్యపాత్ర వేశాడు), గాయకుడిగా ('మై భూఖాఁ హూ తుఝే ఖావూంగా' పాటలో మెహమూద్, సురేష్‌లతో తన గొంతు కలిపాడు) కూడా దీనితోనే నాంది!



**రాహుల్ దేవ్ బర్మన్**

ఈ సినిమాలో 'జాగో సోనే వాలో సునో మేరీ కహానీ...'(కిశోర్) , 'ఆవో ట్విస్ట్ కరేఁ' 'ప్యార్ కరతా జా' (మన్నాదే), 'ఓ మేరే ప్యార్ ఆజా' (లతా) పాటలు ఆర్.డి. కెరీర్‌కు శుభశకునాలుగా నిలిచాయి. గీతరచయిత ఆనంద్‌బక్షీతో, ఆర్.డి. అనుబంధం చాలాకాలం సాగింది. దానికి బీజం పడినది ఈ ఏడాదిలోనే! కానీ వారి తొలిచిత్రం 'తీస్‌రా కౌన్' ఫెయిలయింది.

శంకర్ - జైకిషన్‌లకు పోటీదారులుగా క్రమంగా ఎదుగుతున్న లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ జంటఈ సంవత్సరం కొన్ని మంచిపాటలిచ్చారు. వారి 'బాక్సర్' అనే స్టంట్ చిత్రం పాటల్లో ఒక విశేషం - పాటలన్నీ గాయనీమణులే పాడడం! ఇదే కాదు, ఉత్తరోత్రా లక్ష్మీ-ప్యారే సంగీతం ఇచ్చిన బహారోం కి మంజిల్, షరాఫత్, కచ్చే ధాగే, పగ్లీ, సేవక్, థీఫ్ ఆఫ్ బాగ్దాద్ చిత్రాలు గాయకుడి అవసరం లేకుండానే రూపొందాయి.

తొలినాళ్లలో కిశోర్, లక్ష్మీ-ప్యారేల కాంబినేషన్‌లో ముత్యంగా మూడు సినిమాలు వచ్చాయి - 'మిస్టర్ ఎక్స్ ఇన్ బొంబై' 'హమ్ సబ్ ఉస్తాద్ హైఁ', 'శ్రీమాన్ ఫంటూష్' ! మొదటిది 1964లో విడుదల కాగా తక్కిన రెండూ ఈ ఏడాది రిలీజయ్యాయి. 'హమ్ సబ్ ఉస్తాద్ హైఁ' చిత్రంలోని 'అజ్‌నబీ తుమ్ జానేన్ పెహచానే సే లగ్‌తే హో...' మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబేలోని 'మేరే మెహబూబ్' అంత హిట్టయ్యింది. అటువంటిదే 'శ్రీమాన్ ఫంటూష్' లోని 'యహ్ దర్ద్ భరా అఫ్సానా సున్ లే ...'. ఆ సినిమాలోని 'సుల్తానా సుల్తానా తూ న ఘబ్‌రానా...'(కిశోర్, లతా) సరదాయైన యుగళం కాగా, 'హమ్ సబ్..'లోని 'ప్యార్ బాంట్‌తే చలో'(కిశోర్) మంచి ప్రబోధగీతం!



'మిస్టర్ ఎక్స్ ఇన్ బొంబో' లో కిశోర్‌కుమార్

'లుటేరా' చిత్రంలో లతా పాడిన 'రాత్ సే కహో రుకే జరా, మేరీ జవానీ కా ఖాస్..', 'నీంద్ నిగాహోం కి ఖో జాతీ హై..' పాటలు హిట్ అయి లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ జంట డజనుకు పైగా నిర్మాతలతో చిరకాల బంధం ఏర్పడటానికి మార్గం సుగమం చేసినాయి. ఇప్పుడే రాజ్‌కుమార్ కోహ్లీతో ప్రారంభమైన లక్ష్మీ-ప్యారే అనుబంధం 25 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా సాగింది. వీరి కాంబినేషన్‌లో అఖరి చిత్రం 'పతీ పత్నీ ఔర్ తవాయిఫ్'

**-(వచ్చేసంచికలో మరికొంత)**

# పెళ్ళిపుస్తకం

**దర్శకత్వం : బాపు**

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**15**

**జరిగిన కథ**

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్ళవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. శనాదివారాలు కృష్ణమూర్తి దగ్గర ఆర్టు నేర్చుకుంటానని చెప్పి అతని గదికి వస్తుంది. ఆమె తన భర్తను ఎగరేసుకుని పోతుందని భామ భయపడుతుంది కానీ కృష్ణమూర్తి ధైర్యం చెప్తాడు. వాళ్ళిద్దరి అన్యోన్యతను గమనించిన శ్రీధరం బావమరిది గిరి, భామను బ్లాక్‌మెయిల్ చేసి గెస్ట్‌హౌస్‌కు రమ్మంటాడు. ఇటు వసుంధర విదేశాలనుండి వచ్చిన బావను తనకు కాబోయే భర్తగా కృష్ణమూర్తికి పరిచయం చేస్తుంది. **-(ఇక చదవండి)**

అందరూ నవ్వారు. "యూ నాటీ... " అన్నాడు శేషు గట్టిగా.

'కే.కే... చూడు కే.కే..చూశావా ఎంత జెలసీయో.. ముందసలు అమెరికానుంచి రానంటే రానన్నాడు. మా అమ్మే కోప్పడి డొక్క చేరేస్తానని మళ్ళీ ఇండియాకు ఇంపోర్ట్ చేసింది. వీడంటే చిన్నప్పటినుంచీ చాలా ఇష్టం. వీడు రానంటే కోపం వచ్చి నిన్ను ఓకే చేశాను. దాంతో భయపడి పరుగెత్తుకొచ్చేశాడు" పక పక నవ్వింది వసుంధర.

కృష్ణమూర్తి టెన్షన్ వదిలిపోయింది. ఇన్నాళ్ళ నుంచీ వసుంధర చిలిపితనాన్ని అపార్థం చేసుకున్నాడు. భామ కూడా వసుంధర అతి చనువును అపార్థం చేసుకుంది. కానీ వసుంధరకు అలాంటి దురుద్దేశ్యాలు ఏవీలేవని తెలిసిన తర్వాత మనసు తేలిక పడింది కేకే కి.



"నా తండ్రే నా బాబే నా దేవుడే.. థాంక్యూ.... థాంక్యూ.. థాంక్యూ మీ ఫస్ట్ వైఫ్ ప్రాణాలు తోడేస్తున్నదండీ, నన్ను పెళ్ళాడుతానంది. సరే చూద్దాం అన్నాను. నా డబ్బు కోసం నన్ను పెళ్ళిచేసుకుని నన్నుదోచుకునే దొంగవేమో అంది... అవును. దొంగనే వదిలేయ్ తల్లీ అన్నాను. నేను దొంగ అని అన్నవాడు నిజంగా చాలా మంచివాడు నువ్వే నా మొగుడు అంది. రాక్షసి..రాక్షసి.. హ..హ..హ.." విరడబడినవ్వాడు కృష్ణమూర్తి.

శేషు కూడా నవ్వుతూ "పెళ్ళవగానే రాక్షసిలోని 'క్ష' వత్తుని అరగదీసి పారేస్తాను లెండి" అన్నాడు.

'చూద్దాంగా' అన్నది వసుంధర నవ్వి.



వసుంధర గోడకు తగిలించి ఉన్న అద్దం మీద 'మెర్రీ క్రిస్మస్...హ్యాపీ న్యూ ఇయర్' అని రాసింది.

కృష్ణమూర్తి వైపు తిరిగి "ఆ... కమాన్ కే.కే... ఇవాళ మా తోటలో క్రిస్మస్ పార్టీ. తెల్లారే వరకూ మనదే రాజ్యం.

సింగ్ ..డాన్స్..... లాఫ్.... " శేషును పట్టుకుని బయటకు నడుస్తూ చెప్పింది వసుంధర.

సరేనంటూ వారిననుసరించాడు కృష్ణమూర్తి.

* * *

రాత్రి పదిన్నర గంటలు. శ్రీధరంగారి గెస్ట్ హౌస్. అందులో ఒక భాగంలో ప్రస్తుతం సత్యభామ ఉంటున్నది.

అంతానిర్మానుష్యంగా ఉంది. మినుకు మినుకు మంటున్న ఒకటి రెండు ట్యూబ్‌లైట్లకాంతి తప్ప దాదాపు మసక చీకటి ఆవరించి ఉంది.

పరస్త్రీ వ్యామోహపీడితుడు, పరకాంతల అవసరాలను, బలహీనతలు పసిగట్టి తన కామవాంఛలకు వాడుకునే, కలియుగ కీచకుడు గిరి అయిన నెత్తిమీద దుప్పటి ముసుగు వేసుకుని మెల్లగా ద్వారాన్ని సమీపించాడు.

'కామాతురాణం నభయం నలజ్జ' అని ఊరికే అనలేదు కదా ఆర్యులు! అతి బలశాలి, మహావీరుడు, సామ్రాట్టు అనిపించుకున్న కీచకుడు అపత్సమయంలో తమను ఆశ్రయించుకుని జీవిస్తున్న ద్రౌపదిని చెరపట్టబోయి కడకు ప్రాణాలనే పోగొట్టుకున్నాడు. మహాత్మన మానురాలైన పాంచాలిని నిండుసభలో



అవమానించిన దుర్యోధునుడు చివరకి తనతో పాటు తన వంశాన్ని కూడా నిర్మూలనం గావించుకున్నాడు. ఇలాంటి దృష్టాంతాలెన్నో చూపించి నీతిగా బతకమని బోధించినా,రీతి తప్పిన వాళ్ల తమ అవలక్షణాలను వదులుకుంటారా?

ప్రస్తుతం గిరి పరిస్థితి కూడా అంతే. ఎన్నాళ్ళనుంచో సత్యభామపై కన్నువేసి బలవంతపెడుతూ, చివరకు బ్లాక్‌మెయిలింగ్‌కు కూడా పాల్పడి, నమస్కరించవలసిన స్త్రీ మూర్తి జీవితాన్ని నాశనం చెయ్యడానికి నిర్ణయించుకుని అందుకు నడిరేయి ముహూర్తాన్నెంచుకుని తన వినాశానానికి తానే లగ్నం నిర్ణయించుకున్నాడు. ఎవరైనా గమనిస్తున్నారేమోనని పరిసరాలను పరికిస్తూ మెల్లగా తలుపు తట్టాడు.



"తీసుంది" అంటూ స్త్రీ కంఠం వినిపించింది సన్నగా.

''థాంక్యు'' పిల్లిలా లోపలకు ప్రవేశించాడు గిరి. బెడ్‌లాంప్ మసక వెలుతురు మాత్రమే ఉంది గదిలో. తన నెత్తిమీదున్న దుప్పటి ముసుగును నిర్లక్ష్యంగా అవతల పడేశాడు .

పట్టెమంచం మీద చీర ముసుగులో ఒక స్త్రీ కూర్చునుంది. ఆమెను చూడగానే గిరి ముఖం వెలిగిపోయింది.

"విప్పబోయే చీర కట్టుకోనేలరా విశ్వదాభిరామ వినురవేమా అని.....హ...హ.. హ...హ..రెడీగా కూర్చున్నావా? అందులో కొంత శృంగారం ఉంది. వలిచిన అరటి పండుకు, వలుచుకు తినే అరటి పండుకు తేడా లేదూ? ఆ....." అంటూ ఆ స్త్రీ ముసుగును తొలగించ బోయాడు



అంతలో ఆ స్త్రీ తన ముసుగును తానే తొలగించుకుని గిరిని చూసింది. అంతే! గిరి అరికాళ్ళ క్రింద భూమి కంపించింది. నిలువెల్లా నరాలు వీణ నుంచి తెగిన తీగల్లా వణికి పోయాయి. దేహమంతా చెమటలు దిగ్గారి పోయాయి. మిడిగుడ్లు పడ్డాయి.

ఆ ఎదురుగా కనిపించింది తను ఊహించుకుంటున్న సత్యభామ దివ్య మంగళ విగ్రహం కాదు! తన తోడబుట్టిన మంగళది! ఉగ్రరూపంతో ఝాన్సీ లక్ష్మీలా తీక్షణంగా చూస్తున్నది. ఆ దృక్కుల ధాటికి తను శలభంలా భస్మం కాక తప్పదు!

గడగడలాడుతూ అక్క పాదాలను పట్టుకో బోయాడు. వెనక్కు జరిగింది మంగళ. పట్టుకోవలసింది 'తన పాదాలు కాదు. ఆ పాదాలను' అన్నట్లు సైగచేసింది. ఆ సైగ కొరడా దెబ్బలా తగిలింది గిరికి. అమాంతరం సత్యభామ పాదాల మీద పడ్డాడు.

"అక్కగారు...ఎప్పుడూ ఇలాంటి తప్పు చెయ్యలేదు. ఉత్తినే.... పగటి కలల్లా అనుకున్నాను. ఇంకెప్పుడూ చెయ్యను క్షమించండి" అంటూ ఏడవసాగాడు.

ఈ సమయంలో సత్యభామ పాదం మీద అందమైన పుట్టుమచ్చ కనిపించడంలేదు గిరికి తనను పాతాళానికి తొక్కుతున్న వామనుడి పాదమే కనిపిస్తున్నది. ఆ పాదం తన నెత్తిన పడిందా..... తన జీవితం పాతాళానికి జారిపోతుంది. పాదం పక్కకు జరిగిందా..తను ప్రాణాలతో బయట పడతాడు.



భామ దూరంగా జరిగింది. గిరి వెంటనే బయటకు పారిపోయాడు. గిరి దుష్టపన్నాగాన్ని సత్యభామ తన యజమానురాలికి విన్నవించి సాయం కోరిందని, శీలానికి ఎంతో విలువనిచ్చే ఆ ఉత్తమ సాధ్వి తప్పు చేస్తే తమ్ముడినైనా అసహ్యించుకుంటుందనే వాస్తవం గమనించక పోవడమే గిరి చేసిన పొరబాటు. ఏమైతేనేం ఓ సబల మరో అబల మానాన్ని కాపాడింది.



అయితే పగబట్టిన పాము వంటి గిరి నైజాన్ని శంకించిన సత్యభామ ఏడుస్తూ''నేను వెళ్ళిపోతానండీ'' అన్నది మంగళతో

"ఇప్పుడా? ఇంత రాత్రివేళా?" భామను ఓదార్చడానికి ప్రయత్నించింది మంగళ.

"ఇక్కడ ఇంకొక్క క్షణం కూడా ఉండలేను" చెప్పింది సత్యభామ కళ్ళు తుడుచుకుంటూ.

"దింపటానికి డ్రైవర్లు కూడా లేరమ్మా" నిస్సహాయంగా చూస్తూ అన్నది మంగళ.

"ఫర్వాలేదు, దేవుడున్నాడు. క్షమించండి " గబ గబ బయటకొచ్చింది భామ.

వెళ్ళిపోతున్న భామ వంక బాధగా చూసింది మంగళ. తమ ఆశ్రయంలో ఉన్న ఓ అనాథ స్త్రీ ఇలాంటి అత్యాచారానికి గురికావడం, అది సాక్షాత్తు తన సోదరుడి వల్లనే జరగడం ఆమెను మరింత బాధిస్తున్నది. సమయానికి తాను అడ్డుపడినా ఎల్లవేళలా సాధ్యం కాదుకదా!

భామ రోడ్డుమీదికొచ్చింది. జోరున వర్షం కురుస్తున్నది. ఏదో ఆటో వచ్చింది. దాన్ని ఆపి ఎక్కింది. పదినిముషాలలో ఇల్లు చేరింది. తలుపు తట్టింది. "ఏవండీ...ఏవండీ.."భర్తను పిలిచింది .

''అబ్బా ...ఎవరదీ... మనిషొచ్చేలోగా ఏమిటా బాదటం" అంటూ తలుపు తీసింది కాంతమ్మ. ఎదురుగా కూతురును చూసి ఆశ్చర్య పోయింది."నువ్వా తల్లీ.. ఏమిటీ అపరాత్రి వేళ? " అన్నది.



లోపలికొచ్చి తలుపేసింది భామ. "ఆయన పడుకున్నారా?" అడిగింది.

''లేరుగా'' బదులిచ్చింది కాంతమ్మ. ''ఆ ఢాణీ వచ్చి ఎగరేసుకుపోయిందిగా.....

ఆవిడే.. మీ పాలిట యువరాణీగారు. కనీవినీ ఎరుగవమ్మా ఈ విడ్డూరం" అన్నది .

అర్థం కాలేదు సత్యభామకు. "సినిమాకెళ్ళారా?" అడిగింది.

"సినిమాకా నా బొందా? వాళ్ళ తోటలో క్రిస్టమసీ పార్టీ ఉందటగా... దానికి లాక్కుపోయింది" ఎకసెక్కంగా అన్నది కాంతమ్మ.

భామ అద్దంలో ముఖం చూసుకుంటూ ఏడుస్తున్నది. అక్కడ జరిగిన అవమానానికి తోడు అర్ధరాత్రి ఇంటి కొస్తే భర్త ఇంట్లో లేకపోవడం, తల్లి సూటిపోటి బాణాలు విసురుతుండటంతో ఆగ్రహం దుఃఖం రూపంలో తన్ను కొస్తున్నది. తన మానసిక ఆందోళనను ఉపశమింప చేసుకోవడానికి దిక్కులేని రోదన నాశ్రయించింది.



-(ఇంకావుంది)

# గౌడ డిండిమ భట్టు వాగ్గేయకారుడా!




"దీనార టంకాల తీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పగుల గొట్టించి తుద్భట వివాద ప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క....."

అన్న కవిసార్వభౌముడు శ్రీనాథుడి పద్యం వింటే

ఏ తెలుగు హృదయం పులకించి పోదు....?

ప్రౌఢదేవరాయల ఆస్థానం !

గౌడడిండిముడూ- శ్రీనాథుడూ ఇద్దరి మధ్య వివాదం-

శ్రీనాథుడు గెల్చినట్టు సభ హర్షధ్వానం -

భళ్ళున బద్దలైన అరుణ గిరినాథుడి 'డిండిమం'

చెదిరిపోయిన అలంకారం, విరిగిపోయిన అహంకారంతో ప్రశాంతచిత్తుడై....

శ్రీనాథుని మనస్ఫూర్తిగా ఆశీర్వదిస్తున్న అరుణగిరినాథుడు.....

సినిమాల్లోనూ.. నాటకాల్లోనూ.....నవలల్లోనూ.. శ్రీనాథుణ్ణి పైకి లేపడానికి గౌడడిండిమభట్టుని మరీ నీచుడిగానూ, దురంహంకారిగానూ చూపిస్తారు... గానీ చరిత్రకారులనేది మాత్రం.... అతనికి ఉన్నది 'ధిషణాహంకారమే'!

ఆ మాటకొస్తే ఆమాత్రం శ్రీనాథుడికీ ఉంది!...

కాకపోతే !.. ఎక్కడా లేని విధంగా 'ఢక్క' పెట్టుకుని తిరిగాడూ - అంచేతే 'ఢక్క' బద్దలు చేశాడు శ్రీనాథుడూ అన్నారు.

మనకా గొడవలక్కర్లేదు!...

కావల్సిందల్లా... 'డిండిమభట్టు' అనే బిరుదనామం ధరించిన అరుణగిరినాథుడు సాహిత్యంలోనే కాకుండా సంగీతంలో కూడా పండితుడూ.. స్వయంగా చాలా కృతులు రచించి గానం చేసిన వాగ్గేయకారుడూ అని...

అరుణగిరి నాథుడు క్రీ.శ.1375 సంవత్సరంలో జన్మించాడు.... గౌడ దేశం నించి తమిళ దేశానికి వలస వచ్చిన శ్రోత్రియ కుటుంబంలో!

తల్లి ముత్తమ్మాళ్, తండ్రి అష్టభాషా కవిత సామ్రాజ్య పట్టాభిషిక్తుడు.. ఇద్దరూ తాతలూ బహుభాషా కోవిదులు..

బాల్యంలోనే తల్లి పోతే తిలకావతి అనే అక్కగారి పెంపకంలో పెరిగాడు! ...ఎంతయినా తల్లి లేని పిల్లాడు, దుష్టజన సాంగత్యం-

దురభ్యాసాలకి లోనయి.. పిత్రార్జితం అంతా తగలేశాడు!...

భోగభాగ్యాల్లో... మునిగి తేలుతూ - అత్యంత విలాసవంతమైన జీవితం గడిపి .. ఒక్కసారి ఐశ్వర్యం హరించుకుపోయీ... అప్పుల పాలై పోయాక .. జీవితం ఎంత అంధకారబంధురమో.. అరుణగిరినాథుడికి అప్పుడు తెలిసింది!.... ఆకులు పట్టుకున్నా లాభం లేకపోయింది.. అప్పటికే చేతులు కాలి బొబ్బలెక్కాయ్!!

విరక్తితో తిరువణ్ణామలై (అరుణాచలం) గుడిగోపురం పైకెక్కి అక్కణ్ణించి దూకి ఆత్మహత్య చేసుకునేలోగా ఉత్తరగోపురం - వక్కనున్న కుమారస్వామి ఆలయంలోంచి ఆకాశవాణి వినపడింది!

స్వామి ప్రత్యక్షమై... అతణ్ణి రక్షించీ, నాలుకపై షడాక్షరమంత్రం (శరవణభవ)రానీ అంతర్థానమైనాడట!....

అంతే !..అక్కణ్ణించి ధారాప్రవాహంగా మంత్రశక్తి కలిగీ ద్రావిడ భాషలో- 'తిరుప్పుగళ్' అనే దివ్య సంకీర్తనల రచనకు పూనుకున్నాడు.

అటు సంస్కృతం -ఇటు తమిళం కలగలిసి- పడుగు పేకల్లాగా అరుణగిరి నాథుడు 16,000 వేల కీర్తనలు రచించాడట..

విశేషం ఏమిటంటే - శ్రీనాథుడు కూడా -

అరుణగిరి నాథుడు పుట్టిన 1375లో పుట్టడం.

తిరుప్పుగళ్ అంటే - తిరు = పవిత్రమైన, పుగళ్= పొగడ్త, ఆ రాగ సంకీర్తనం.

ఆళ్వారులూ - నాయనార్లూ దేవుణ్ణి కొలిచే రీతికి ఆకర్షితుడైన అరుణగిరి నాథుడు అదేశైలిని ఆవాహన చేసుకునీ తిరుప్పుగళ్ రాశాడు.....

అచ్చంగా సంస్కృతం కాకుండా అచ్చం తమిళం కాకుండా సంస్కృత వాణి -తమిళ బాణీ కలిపి- కొత్త ఫణితి మొదలెట్టాడు..

అరుణగిరి నాథుని కవితా పద్ధతికి 'చిత్తిర కవితై' (చిత్ర కవిత్వం) అని పేరూ.. దానికి ఆయనే ఆరంభకుడూ అన్న ఖ్యాతి లభించాయ్. అంచేత ద్రవిడ విద్వాంసులు ఆయనకి 'చందస్ పవళప్పెరుమాన్' (ఛంద ప్రవాళ మహిమాన్విత) అనే బిరుదిచ్చారు..

ఈయన పద్ధతిని 'తొంగల్ పద్ధతి' అంటారు. ఈ విధానమే అన్నమాచార్యుల సంకీర్తనలల్లో లీలగా తొంగిచూస్తోందేమోనని అని సంగీత శాస్త్రజ్ఞుల అనుమానం.

మచ్చుకి రెండు 'తిరుపుగళ్'

కైచ్చదియన - ముఱైలిదిత్త దముర్చటల్
చచ్చపుట,చచపుట, చత్రిత పుత్రికా
కందచ్చ మ్మతి ప్పద మంబళే
కంచపుంచ కట్టుల మంబడి!!

కల మరద వరళి శిఖండికై
పల శికామర మాన విపంచికై
గౌడ భైరవి లలిత కైశికై
ఘన వరళి అరుంపట మంజరి
తన ధనసి విడంబదు - పంచమి
కైచ్చుతవుకొన్ ముఱై విదితై రగల్తు డైవిల్

ఉచ్చుమిదు సాదికం ఎడుత్తు మేల్ ఎట్టువన్
కనక జనకం నట్రె శిరంజికం
రిండిప్పన్ కురిత్తి యూష్టె యెండువా!!



సంస్కృత -ద్రావిడ , ఆంధ్ర భాషల్లో పండితుడై... ఈశ్వరార్చన కళాశీలుడై.. అరుణాచల నాథానుగ్రహ పాత్రుడై... ప్రౌఢదేవరాయల ఆస్థాన విద్వాంసుడై...సకల కవితా సనాథుడు శ్రీనాథుణ్ణి ఎదుర్కొన్నవాడై!.. చారిత్రక దృష్టిలేని కొంత మంది.... కాల్పనికుల వల్ల.. పెద్దవిలనై పోయి - వేళాకోళమై పోయి చరిత్ర హీనుడైపోయిన గౌడడిండిమభట్టు బిరుదాంకితుడైన అరుణగిరి నాథుడికి ఆంధ్ర జాతి తరపున క్షమాపణలు చెప్పుకుంటూ..

'శ్రీబాలాంత్రపు రజనీకాంతరావుగారి ఆంధ్ర వాగ్గేయ కార చరిత్రకు ఈ వ్యాసానికి ఆలంబన-

- తనికెళ్ల భరణి

పాఠకులకి.....నమస్కారం..

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే.... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 49... మరొక వ్యాసం ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెట్టాను.

సరే...ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన...

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ... మా దగ్గర వారికి సంబంధించినవీ ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువున ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, వారు వాడిన వస్తువుల యొక్క ఫోటోలు ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఆదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి, హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మనుసారి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి, పొరుపల్లి రామక్రిష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరుణాళ్,అల్లారఖా, భీమ్‌సేన్ జోషి, నారాయణ తీర్థులు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి, క్షైరం భూమగౌడు, కృష్ణమయ్య, భక్త రామదాసు

వీర్ని గురించిన వివరాలను మీరు పంపవలసిన చిరునామా :

**తనికెళ్ల భరణి,**
**కేరాఫ్ 'హాసం,'**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**మోతీనగర్,**
**బాలాజీస్వర్ణపురికాలనీ,**
**హైదరాబాద్-500 018**

నన్నింతవరకూ ప్రోత్సహించినట్టే, లభించిన వివరాలను రాసి పంపి ఆశీర్వదిస్తారు కదూ..

మీ **తనికెళ్ల భరణి**




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



### "రావు - కొండలరావూ"

రావుగోపాలరావు - రావికొండలరావు అన్నపేర్లకి దగ్గర సంబంధం లేదు. 'రావు -రావి' అంతే! అయినా సినిమా వాళ్లకే కాకుండా బయట వాళ్లకి కూడా ఆ పేర్లు గందరగోళంగానే వినిపించేవి. అప్పట్లో గోపాలరావుగారి టెలిఫోన్లు నాకు, నా టెలిఫోన్లు ఆయనకీ వెళ్లేవి.

ఇద్దరమూ కలిసి నటించిన సినిమాల్లో అయితే, ఒకరి డేట్స్ -ఇంకోరికి ఇచ్చేసేవారు. షూటింగులో ఇద్దరం షాటు కోసం కూచుంటే - "సార్, షాట్ రెడీ, రమ్మంటున్నారు" అని గోపాలరావుని తీసుకెళ్లేవారు. ఒక్కనిమిషం ఆయన తిరిగొచ్చి "అయ్యా తమరెళ్లండయ్యా - తమకే షాటు, పొరపాటుబడ్డారు" అనేవారు. అసిస్టెంటుడైరెక్టరు పిలిచినప్పుడల్లా "ఆయనా? నేనా? సరిగ్గా తేల్చుకొండి బాబూ!" అని గోపాలరావు - నిర్ధారణ చేసుకురమ్మని పంపేసేవారు. విశాఖపట్నంలో ఒకసారి గొప్ప "జోక్" పేలింది. మా బృందం ఒక నాటకం వెయ్యడానికి విశాఖపట్నం వెళ్ళాం. నాటకం వేసిన మర్నాడు ఒక ప్రముఖుడు, ఆయన ఇంటికి నన్ను ఫాస్ట్ - బ్రేక్ చెయ్యమని పిలిచాడు. కొంతమంది మిత్రుల్ని ఆహ్వానించాడు. అప్పటికి "ముత్యాలముగ్గు" విడుదలై విజయం సాధించడంతో రావుగోపాలరావు పేరు మారుమోగుతోంది.


రావుగోపాలరావు

నేను, మా బృందంతో బ్రేక్‌ఫాస్ట్‌కి వెళ్లేసరికి, నన్ను ఎరిగున్న మిత్రుడొకడు "ఏంరా కొండల్రావు ఏమిటిలా వచ్చావు? ఎప్పుడొచ్చావు?" అన్నట్టుగా పలకరించాడు. "అదేమిట్రా- ఈ సమావేశం నా కోసమే కదా" అన్నాను. అతను ఉలిక్కిపడి, జేబులోంచి చిన్న నోటీస్ లాంటిది తీసి చూపించాడు. "టు మీట్ రావుగోపాలరావు ఎట్ బ్రేక్ ఫాస్ట్..." అన్నట్టుగా వుంది ఆ టైపడ్ లెటర్‌లో! అక్కడికొచ్చినా వారంతా రావుగోపాలరావుని మీటవుదామని వచ్చిన వాళ్లేగాని, నా కోసం రాలేదన్నమాట!

బ్రేక్‌ఫాస్ట్ హోస్ట్ "సారీ సారీ సర్.... మీ పేరు చెప్పి లెటర్స్ టైపు చెయ్యమంటే మావాడు గోపాలరావు అని చేసేశాడు. నేనూ చూసుకోలేదు'' అని నాతోనూ వచ్చిన మిత్రులతోనూ సంజాయిషీలు, క్షమాపణలూ చెప్పుకున్నాడు పాపం! అటు తర్వాత -

అదే విశాఖపట్నంలో - మేఘాలయ హోటల్లో ఓ మీటింగు. నేను ముఖ్య అతిథిని. అప్పటికి గోపాలరావుగారు దివంగతుల యినారు! ఆహ్వాన పత్రికలో నా పేరే వేసినా, వేదిక మీదికి ఆహ్వానించినాయన- "ఈనాడు మన ముఖ్యఅతిథిగా విచ్చేసిన రావుగోపాలరావు గారిని, వేదికనలంకరించవలసిందిగా కోరుతున్నాను" అన్నాడు. నేను నాకెందుకని నోరుమూసుకుని కదల్లేదు. ప్రేక్షకుల్లో కొందరు ఆయన చేసిన తప్పుని సరిదిద్దినా, ఆయన మాత్రం నన్ను చూసి, "అయ్యా గోపాలరావు గారూ, దయచెయ్యండి" అన్నాడు.

నేను పైకి చూస్తూ వుండిపోయాను, "సార్ మిమ్మల్నే''అన్నాడాయన మళ్లీ, "నన్నా! గోపాలరావుగారు దిగివస్తారేమోనని పైకి చూస్తున్నానే" అన్నాను. అప్పటికి గాని, ఆ పిలిచినాయనకి అర్థం కాలేదు. అందరూ నవ్వుతూ వుండగా, నాలిక్కరిచేసుకుని, చేతివేళ్లు కొట్టేసుకుంటూ ఇంగ్లీషులో వున్న ఆ రెండక్షరాలూ రెండుసార్లు (రెండు సారీలు) పలికాడు! పలికి "పొరపాటు. 'రావు' కొండలరావు గారిని ఆహ్వానిస్తున్నాను" అన్నాడు - ఆయన లాగానే 'రావి' ని 'రావు' చేసి పిలిచేవాళ్లూ వున్నారు!

❖ ❖ ❖

### పొరపాట్లు తెచ్చే పాట్లు

రావు గోపాలరావు - భమిడిపాటి రాధాకృష్ణగారి 'కీర్తిశేషులు' నాటకం ద్వారా ప్రసిద్ధుడు. ఆయనకి అందులోని మురారి పాత్ర మంచిపేరు తెచ్చింది. "కీర్తి శేషులు" నాటకానికి గొప్ప పేరుంది. ఆ నాటకాన్ని పరిషత్తు పోటీల్లో ప్రదర్శిస్తే రాధాకృష్ణగారికి 'ఉత్తమ రచయిత' బహుమతి వచ్చింది.

అంత వరకూ సంతోషమే కాని, ఒక పత్రికలో ఆయన ఫొటో వేసి కింద "కీర్తి శేషులు రచయిత భమిడిపాటి రాధాకృష్ణ" అని వెయ్యడమే పెద్ద ముప్పు తెచ్చింది. నాటకం విషయం తెలియని కొందరు మిత్రులు, రాధాకృష్ణగారింటికి సంతాప లేఖలు పంపించారు!

"అంత కంటె గొప్ప విషయం- ఒక వూళ్లో ఏకంగా నా ఫొటో పెట్టి -సంతాప సభే నడిపించేశారు" అని చెప్పారు రాధాకృష్ణ - నవ్వుతూ, ఆ విషయం గుర్తొచ్చినప్పుడు.

ఇలాంటివి సీరియస్ మేటర్లే అయినా,




జోక్‌లాగా అనిపించి, నవ్వు తెప్పిస్తాయి. నెల్లూరు కాంతారావు (చాలా సినిమాల్లో దుష్టపాత్రధారి) చనిపోయినపుడు- ఒక ప్రముఖ పత్రికలో హీరో టి.ఎల్.కాంతారావుగారి ఫొటో వేసి, కింద "కాంతారావు డెడ్" అని రాసి, మేటరు మాత్రం నెల్లూరు కాంతారావు గారిదే వేశారు! అది చూసి ముందుగా దిగ్భ్రమనిపోయినవాళ్లు మేటరు చదివి "ఆహా!" అని "అరె" అనీ అనుకున్నా పత్రిక తెలివి తక్కువతనానికి తిట్టుకున్నా - "అయ్యో" అని నవ్వుకున్నారు కూడా, మేటరు సీరియస్సయినా.

❖ ❖ ❖

## "ఒరేయ్ రిక్షా"!

సినిమా పేరు గుర్తు రావడంలేదు గాని, రేలంగి నరసింహారావుగారి దర్శకత్వం. షూటింగు రాజమండ్రిలో. అక్కడ షూటింగు జరుగుతూనే ఉంది. - ఒక రోజు ఉదయమే నేను దిగాను. ఆ రోజే నా షూటింగు . కథేమిటి- కాకరకాయేమిటి అని కనుక్కున్నాను - కథ మాటకేం గాని కాకరకాయే! ఆ సినిమాలో నేను రకరకాలవేషాలు వేసుకుంటూ తిరుగుతుంటాను. అవాళ, రిక్షా వాడి వేషం. రిక్షా తొక్కుకుంటూ వెళ్ళాలిట!. నా వొంట్లో వున్న రక్తం లోపల్లోపలే చిమ్మింది . "రిక్షా తొక్కటం మాటలు కాదు, నాకు రాదు" అన్నాను. "అదేమిటిసార్, రిక్షా తొక్కడం రాదా?" అని అడిగారు రేలంగి నరసింహారావు ' జోక్యులర్‌గా అడిగారో, నిజంగానే అడిగారో'.

"అంటే నేను రిక్షాలు త్రొక్కుకుని సినిమాల్లోకి వచ్చానా - ఇక్కడికొచ్చి రిక్షా తొక్కుకుంటున్నాననా?" అన్నా నేను. దర్శకుడు నవ్వేశారు.

"రిక్షా తొక్కడం మాటలు కాదు. మనుషులు లేకుండా తొక్కితే ఓ పక్కకి లాగుతుంది" అన్నాను. మళ్లీ రేలంగిగారు నవ్వి - "అదిగో, మళ్లీ తెలిసినట్టే మాట్లాడుతున్నారు" అన్నారు.

"పోనీ -లాగుతుంది'ట'! మనుషుల్ని ఎక్కించుకుని తొక్కినా బాలన్స్ చెయ్యడం కష్టం'ట'. నేర్చుకోవాలి. ఇవాళ నాకు షూటింగ్ పెట్టకండి. రేపు పెట్టండి. ఇవాళ నేర్చుకుంటాను" అన్నాను. డైరెక్టరు ఒప్పుకున్నారు. అర్ట్ ఆసిస్టెంటుని నాకు వప్పజెప్పారు. అతను రిక్షా మాట్లాడి నాతో కూడా వుండి, అతనూ ఈ రిక్షాధికారీ కలిసి నాకు తొక్కడం నేర్పిస్తారు.

ఆ ఇద్దరూ చెరోపక్కా భరత,శతృఘ్ను ల్లాగా నించుని వుండగా నేను శ్రీరామచంద్రుడిలా రథారూఢుణ్ణయి -రిక్షా తొక్కుట.. మరీ వీధుల్లో కాకుండా సందుల్లో నేర్చుకుందాం అని ప్రాక్టీస్ చేస్తూంటే చూసే జనం వదల్రే ! కొద్దిగా నేర్చుకున్నాక, భరతశతృఘ్నుల్ని వదిలేసి నేనే నెమ్మదిగా తొక్కుతూ వుంటే -పక్కనుంచి వచ్చిన ఒకావిడ "బాబూ ! రిక్షా ! అవు... దానవాయిపేట వస్తావా?" అనడిగింది. బ్రేక్ కొట్టి ఆపి, చూశాను. ఆవిడ నన్ను చూసింది.



ఇది 'హాసం' చేసిన ట్రిక్కు ఫోటో అని గమనించ ప్రార్థన

"మీరు ..." అంది గుర్తుపట్టినట్టు ఆశ్చర్యపోతూ. "అవును తల్లీ షూటింగు.... కోసం నేర్చుకుంటున్నాను.. హి హి హి హి ..." అన్నాను. ఆవిడ 'హి హిహిః' అని కిసుక్కున నవ్వింది, చేత్తో నోరు కప్పుకుంటూ. ఇంతలో కుడి,ఎడమ భుజాలు వచ్చేశారు.." సార్ ...కొంతవరకూ తొక్కుతున్నారు ...ఇవుడు వేమిద్దరం కూచుంటాం. తొక్కండి. బాలెన్స్ తెలిసిపోతుంది" అన్నారు -టీచర్లు. సరే అన్నాను. ఇద్దరూ ఎక్కికూచున్నారు. నెమ్మదిగా తొక్కాను. కొద్ది కొద్దిగా విసుర్తోంది. వాళ్లు చెబుతున్నారు... "నిదానంగానే వెళ్లండి సార్ -వచ్చేసినట్టే" అన్నాడు ఆర్టు అసిస్టెంటు- కాస్త ఆనందంగా.

"పర్వాలేదా ? పనికొస్తానా? పనేం లేకపోతే ఈ పని చేసుకుని బతికేయొచ్చన్నమాట" అన్నాను జోక్ చేస్తూ అంతే ! ఎదురుగా వస్తున్న ఒకాయన-ఎగాదిగా చూసి-"మీరు రావి కొండలరావు కదూ... సినిమా యాక్టరు? ఇదేమిటిసార్, ఈ స్థితి కొచ్చేశారు? సినిమాలు లేకపోతే మాత్రం.. " అనబోతుంటే -నేను కెవ్వుమని కేకపెట్టి ఆయన ధోరణికి ఆనకట్ట కట్టి, విషయం వివరిస్తేగాని - నమ్మలేదు.

"బాబూ! ఇంక చాలు.. ఈ తొక్కుడు ఆపి, రూముకి పోదాం" అని అలిసిపోతూ, ఆ రిక్షాలోనే - అతను తొక్కగా రూముకి పయనించాను. మర్నాడు రిక్షా వాడి వేషం వేసుకుని షూటింగ్‌కి వెళుతుంటే- నరసింహారావుగారూ, తక్కినవాళ్లూ గొల్లున నవ్వుతున్నారు. పక్కనే ఆర్ట్ అసిస్టెంటు నిలబడి వున్నాడు గనక -వాళ్ల నవ్వుకి అర్థం తెలిసిపోయింది. నిన్న రోడ్డుమీద జరిగిన విషయాలు చెప్పేశాడన్నమాట!

"అనుభవాలు చిత్ర విచిత్రం సార్ - ఇలాంటివి మీకే జరుగుతాయి అదేమిటో గాని" అని మళ్లీ నవ్వారు రేలంగి నరసింహారావు....

## సం'గీతా రహస్యం'

✷ సంగీత రసరాజేశ్వరరావు ఒక సినిమాలో రావికొండలరావుకి ప్లేబ్యాక్ పాడారు! ఆశ్చర్యంగా వుందా! అవును. ఆ సినిమా ఏదో చెప్పుకోగలరా? చెప్పుకోలేకపోతే వినండి. 'అమాయకురాలు' - అన్నపూర్ణా వారిది. అందులో నాయిక శారదకి సంగీతం నేర్పే సన్నివేశం వుంది. గురువు రావికొండలరావు. 'వాతాపిగణపతిం భజే' స్వరంతో సహా, సంగీత దర్శకుడు రాజేశ్వరరావు పాడి రికార్డు చేశారు. దానికి రావికొండలరావు నటించే భాగ్యం కలిగింది. ఆ మాటే అతను రాజే 'స్వర' రావు గారితో అన్నాడు.' "మీ మధుర కంఠంతో పాడే మహత్తర అవకాశం నాకు లభించినది" అని. దానికి 'అప్పటికి ఆ పాత్ర ఎవరు వేస్తారో అనుకోలేదు. ఎవరిచేతనో పాడించడం ఎందుకని, నన్నే పాడమన్నారు మధుసూధనరావుగారు. పాడాను. తర్వాత తెలిసింది - ఆ గురువు పాత్ర మీరని. నా అదృష్టం. ఎప్పుడో నాగయ్య గారికి పాడాను. మీక్కూడా పాడాను" అన్నారు వినయా నందాలతో - ఆ సంగీత సామ్రాట్ సాలూరు రాజేశ్వరరావు.



✷ 1943లో తమిళనాడ టాకీస్ వారు 'చెంచులక్ష్మి' తీశారు. సి.హెచ్. నారాయణరావు, కమలా కోట్నీస్‌లతో అద్భుతమైన సంగీత చిత్రంగా ప్రఖ్యాతి పొందిన ఆ చిత్రానికి సంగీత దర్శకులు కొత్తవారు. హెచ్.ఎమ్.వి. లో ఆర్కెస్ట్రాలో పనిచేస్తున్న చిన్నయ్య, సుబ్బరామన్‌లను లను ఆ సంస్థ తీసుకుంది. చిన్నయ్యే సంగీత దర్శకుడు. సి.ఆర్.సుబ్బరామన్ అసిస్టెంటు , కొన్ని పాటలు స్వరపరిచిన తర్వాత, చిన్నయ్య మరణిస్తే -రాజేశ్వరరావుని నియమించారు నిర్మాతలు. ఇతే, రాజేశ్వరరావు రెండు పాటలు మాత్రమే చేసి, విరమించుకున్నారు. అపుడు సుబ్బరామన్ తక్కిన పాటలు పూర్తిచేశారు. ఆ చిత్రానికి సంగీత దర్శకుడిగా అతని పేరు వేశారు. రాజేశ్వరరావు చేసిన రెండు పాటల రహస్యం ఎవరికీ తెలియలేదు.

నేనొక సందర్భంలో ఆయన్ని అడిగితే -"అవును 'చెంచులక్ష్మి' లో చేశాను. ఏ రెండు పాటలో నాకు గుర్తులేదు. అప్పుడే మరిచిపోయాను. అన్నిపాటలూ విని, వాటిలో ఏ రెండు పాటలు, నా శైలిలో వున్నాయని మీ కనిపిస్తే - ఆ పాటలే నేను చేసినవి!" అని నవ్వుతూ సమాధానం ఇచ్చారు రాజేశ్వరరావు.

- ఆర్కే

# ఇతర భాషల్లో రాజేశ్వరరావు

తెలుగుసంగీతానికి ఎస్.రాజేశ్వరరావు చేసిన సేవ గురించి వేరే చెప్పనవసరం లేదు. అయితే ఆయన ప్రతిభ తెలుగుసీమకు పరిమితం కాలేదు. అసలు రాజేశ్వరావు బహుముఖ ప్రజ్ఞను దేశమంతా చాటిచెప్పిన 'చంద్రలేఖ' తమిళనాట తయారయినదే! తమిళం, తెలుగు, హిందీలలో ఒకేసారి జెమినీస్టూడియో ద్వారా నిర్మితమైన ఆ సినిమా సంగీతం అతి విస్తృతమైనది. ఇటు కర్ణాటక సంగీతం నుండి అటు జిప్సీ డాన్సుల వరకూ ఆ సినిమాలో వినబడని సంగీతం, వాయిద్యం లేదంటే అతిశయోక్తి కాదు. ఆ సినిమాకి సంగీతం సమకూర్చేనాటికి రాజేశ్వరరావుకు 26 యేళ్లే అయినా ఆయన కుటుంబ నేపథ్యం, అనుభవాల కారణంగా అసాధ్యమైన ఆ కార్యాన్ని సుసాధ్యం చేయగలిగారాయన.

సంగీతదర్శకుడిగా రాజేశ్వరరావు ప్రస్థానం ఓ తమిళ సినిమాతోనే ప్రారంభమయింది! 13 యేళ్లకే ఓపక్క హచ్చిన్స్ వారికై 'భగవద్గీత' ఆలపించి గాయకుడిగా, మరోపక్క 'శ్రీ కృష్ణలీలలు'లో బాలనటుడిగా వినుతి కెక్కినా సంగీతదర్శకత్వం వహించాలన్నదే ఆయన జీవితలక్ష్యం. 1938లో కలకత్తా నుండి తిరిగివచ్చాక స్వంతంగా ఓ ట్రూప్ తయారుచేసుకుని జయరామయ్యర్ అనే ఆయనకు అసిస్టెంటుగా రాజా శాండో తీసిన 'విష్ణులీల' అనే తమిళ సినిమాకు సంగీతాన్నందించారు. కలకత్తాలో ఉండగా ఓ ఏడాదిపాటు సైగల్ వద్ద హిందూస్తానీ సంగీతం నేర్చుకున్నారు. సితార, సుర్‌బహార్, తబ్లా, ఢోలక్, మృదంగం తనంతట తనే నేర్చుకున్నారు. తర్వాతికాలంలో పియానో, హార్మోనియం, మాండొలిన్, ఎలక్ట్రిక్ గిటార్ నేర్చుకుని ఆర్కెస్ట్రేషన్‌లో అందె వేసిన చేయి అయ్యారు. అదే 'చంద్రలేఖ'కు ఉపకరించింది.

60 సంవత్సరాల కెరియర్‌లో ఆయన అసిస్టెంటుగా పనిచేసిన సినిమా 'విష్ణులీల' ఒక్కటే! ఆ తర్వాతి సంవత్సరమే 'వసంతసేన' అనే కన్నడసినిమాకి ఆర్.సుదర్శనం సంగీతదర్శకత్వం వహించగా రాజేశ్వరరావు కొన్ని పాటలకు ట్యూన్‌లు అందించారు. అదే సంవత్సరంలో 'జయప్రద' (పురూరవ చక్రవర్తి) అనే తెలుగు సినిమాతో పూర్తి స్థాయి సంగీతదర్శకుడు అయిపోయారు. ఆ తరువాతే వచ్చింది గూడవల్లి రామబ్రహ్మం గారి 'ఇల్లాలు'కి సంగీతం అందించే ఛాన్సు!

ముందులో రామబ్రహ్మం గారికి రాజేశ్వరరావుకి మ్యూజిక్ డైరక్షన్ ఛాన్సు ఇవ్వాలని లేదు. 'వేషం ఇచ్చాను, పాట పాడమంటున్నాను. 18 యేళ్ల కుర్రాడివి, మ్యూజిక్ డైరక్షన్ ఎందుకు నీకు? పైగా మాకు మా ఆస్థాన సంగీతదర్శకుడు బి.యన్.ఆర్. ఉన్నారుగా!' అన్నారు.

'వేషం ఇవ్వక్కరలేదు గానీ ఈ అవకాశం ఇవ్వండి చాలు' అన్నారు రాజేశ్వరరావు. బి.యన్.ఆర్. అనబడే భీమవరపు నరసింహారావు 'పోనీ కుర్రాడు ముచ్చటపడుతున్నాడు, ఓ ఛాన్సు ఇచ్చి చూడండి' అన్నారు. ఓ జోలపాట ఇచ్చి ట్యూన్ కట్టమన్నారు. బ్రహ్మాండంగా కుదిరింది. రాజేశ్వరరావు ఆశ తీరింది. ఇక యాక్టింగ్ జోలికి పోలేదు. 'ఇల్లాలు'యే నటుడిగా ఆయన ఆఖరి చిత్రం!

1940లో జెమిని స్టూడియోలో 600 రూ॥ల నెల జీతానికి చేరేనాటికి ఆయన వయసు 19 యేళ్లు. 'చంద్రలేఖ' తయారయ్యేనాటికి అది 1500 రూ॥లకు పెరిగింది. చంద్రలేఖ మ్యూజిక్ తయారయేందుకు ఒక ఏడాది పట్టింది. డ్రమ్‌లపై డాన్సు దృశ్యానికే చాలా టైము తినేసింది. అటు డాన్సర్లు డాన్సు చేయడం, ఇటు వీళ్లు దానికి తగ్గట్టు మ్యూజిక్ ఇస్తూ రిహార్సిల్సు చేయడం. ఆఫ్రికన్ వార్ ట్రూప్‌ను ఓ దాన్ని పట్టుకుని అనేక రకాల డ్రమ్స్ తెప్పించుకున్నారు. వాటిల్లో ఆఫ్రికావి, ఈజిప్టువి, పెర్షియన్‌వి అన్నీ ఉన్నాయి. పియానో, పది డబుల్ బాస్ వయోలిన్స్, డ్రమ్స్ పెట్టుకుని వందవాయిద్యాల పెట్టు సంగీతాన్ని సృష్టించారు రాజేశ్వరరావు.

జెమినీలో ఉండగానే 'జీవన్‌ముక్తి' 'బాలనాగమ్మ' 'మంగమ్మా శబదం' 'చంద్రలేఖ' వంటి అనేక భారీ చిత్రాలకు సంగీతం ఇచ్చాడాయన. 'అపూర్వ సహోదరగళ్' (1950) జెమినీలో ఉండగా ఆయన చేసిన ఆఖరి సినిమా.



'మల్లీశ్వరి' (1951)నుండి తెలుగు తెరపై ఆయనకు ఎదురులేకపోయింది. అప్పటినుండి ఎక్కువగా తెలుగుసినిమాలకే ఆయన ఎక్కువ సమయం కేటాయించారు.

అయినా ఆయన ఖాతాలో ఎన్నో ఇతరభాషా చిత్రాలు ఉన్నాయి. తమిళసినిమాలలో 'నందనార్' 'దాసి అపరంజి' 'కణ్ణమ్మా ఎన్ కాదలి' 'విక్రమాదిత్యన్', 'ప్రేమపాశం' 'పానై పిడిదవిల్ బాగ్యశాలి', 'అమరదేవి' 'ఇరు సహోదరగళ్' 'అవళ్ యార్' ఉన్నాయి. తెలుగు-తమిళం ద్విభాషా చిత్రాలలో 'అల్లాద్దీన్ అద్భుతదీపం' 'మిస్సియమ్మ' 'చక్రధారి' ఉన్నాయి. కన్నడంలో 'అమరశిల్పి జక్కణాచారి' (1964), 'ఒందు హెణ్ణు ఆరు కణ్ణు' (1980) ఉన్నాయి. హిందీలో 'చంద్రలేఖ'తో బాటు 'నిషాన్' కూడా ఉంది.

'మిస్సమ్మ'ను 'మిస్ మేరీ'గా తీసినప్పుడు ఎవిఎమ్ వారు హేమంత్‌కుమార్‌ను సంగీతదర్శకుడిగా పెట్టుకున్నారు. ఆయన అన్ని పాటల ట్యూన్లూ మార్చేశాడు కానీ రాజేశ్వరరావు అనుమతి తీసుకుని 'బృందావనమది' మాత్రం ట్యూన్ ని మాత్రం వాడుకున్నాడు. ఆయనకా పాట అంతబాగా నచ్చింది. రాజేశ్వరరావు ప్రజ్ఞకు సాటి మేటి సంగీతదర్శకుడు అర్పించిన నివాళి అది!

-కమ్యూనికేటర్ ఫీచర్స్



# ఎస్.రాజేశ్వరరావు హిట్స్

రచన : సాలూరి సన్యాసిరాజు
గానం : ఎస్.రాజేశ్వరరావు, రావుబాలసరస్వతీదేవి

తుమ్మెదా!
తుమ్మెదా ఒకసారి
మోమెత్తి చూడమని
చెప్పవే నామాట రాచిలుక తోడ
రమ్మనవే తుమ్మెదా
గండుకోకిల నిపుడు
పాడుటకు మా ఇంటి పడక గదికీ ॥పాడుటకు॥
ఏలనే తమ్మెదా
పొదలు మాకిపుడెల్ల గదులుగా మారెను
ఇందు రమ్మనవే...
మగవారి వలపులూ
ఎరుగవే తుమ్మెదా ॥మగవారి॥
మగువ దొరికిన దాక
వలపు చూపెదరూ ॥మగువ॥
మదనతాపమూ అధికమాయెనూ
మాటలేల ఇక రమ్మనవే
మారుడు నన్నూ మాటలాడుమని
మందలించు చున్నాడు కదే
ఇకపోవే, తుమ్మెదా!
మరి పోవే, తుమ్మెదా!
మా జోలి నీకు ఇకనేల? తుమ్మెదా!

చిత్రం : విప్రనారాయణ    రచన : జయదేవుడు
గానం : పి.భానుమతి

విరహే... తవ... దీనా....
సా విరహే తవ దీనా రాధా
సా విరహే తవ దీనా... రాధా
సా విరహే తవ దీనా రాధా
సా విరహే తవ దీనా రాధా
సా విరహే తవ దీనా....
నిందతి చందన మిందు కిరణమను
నిందతి ఖేదమధీరమ్
వ్యాళనిలయమిళ నేన గరళమివ ॥వ్యాళ॥
కలయతి మలయ సమీరం ॥సా విరహే॥
కుసుమ విశిఖర తల్పమనల్ప
విలాసకళా కమనీయమ్
వ్రతమివ తవపరి రంభసుఖాయ ॥వ్రతమివ॥
కరోతి కుసుమ శయనీయం ॥సా విరహే॥
ప్రతిపదమిదమపి నిగదతి మాధవ
నిగదతి మాధవ నిగదతి మాధవ
తవ చరణే పతి తాహం
త్వయివిముఖేమయి
సపది సుధానిధి
రపితనుతే తనుదాహం ॥సా విరహే॥
కృష్ణా... తవ విరహే... దీనా...

చిత్రం : చెంచులక్ష్మి    రచన : సదాశివబ్రహ్మం
గానం : పి.సుశీల

పాలకడలిపై శేషతల్పమున
పవళించేవా దేవా
పాలకడలిపై శేషతల్పమున
పవళించేవా దేవా
బాలుని నను దయపాలించుటకై
కనుపించేవ మహానుభావా
బాలుని నను దయపాలించుటకై
కనుపించేవ మహానుభావా ॥పాల॥
అలకలు అల్లలనాడుచు ముసరగ ॥అల॥
నెలనవ్వులు తులకించే మోము ॥నెల॥
తెలికన్నుల కరుణారస వృష్టి ॥తెలి॥
తిలకించిన మై పులకించె స్వామి ॥పాల॥
ఆదిలక్ష్మి నీ పాదము లొత్తగ
వేద మంత్రములు విరించి చదువ ॥ఆది॥
నారదాది మునిముఖ్యులు చేరి... ॥నార॥
మోదమలర నిను గానము సేయగ ॥పాల॥

చిత్రం : డాక్టర్ చక్రవర్తి    రచన : శ్రీశ్రీ
గానం : ఘంటసాల

మనసున మనసై... బ్రతుకున బ్రతుకై...
మనసున మనసై బ్రతుకున బ్రతుకై
తోడొకరుండిన అదే భాగ్యము - అదే స్వర్గము ॥మన॥
ఆశలు తీరని ఆవేశములో ఆశయాలలో ఆవేదనలో
చీకటి మూసిన ఏకాంతములో -
తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గము...
నిన్ను నిన్నుగా ప్రేమించుటకు
నీ కోసమె కన్నీరునించుటకు
నిన్ను నిన్నుగా ప్రేమించుటకు
నీ కోసమె కన్నీరునించుటకు
నే నున్నానని నిండుగ పలికే -
తోడొకరుండిన అదే భాగ్యము - అదే స్వర్గము ॥మన॥
చెలిమియె కరువై వలపే అరుదై
చెదరిన హృదయమె శిలయైపోగా
నీ వ్యధ తెలిసి నీడగ నిలిచే -
తోడొకరుండిన అదే భాగ్యము, అదే స్వర్గము
మనసున మనసై బ్రతుకున బ్రతుకై
తోడొకరుండిన అదే భాగ్యము - అదే స్వర్గము

చిత్రం : పూలరంగడు    రచన : సి.నారాయణరెడ్డి
గానం : పి.సుశీల, కె.బి.కె.మోహనరాజు

ఆ: చిగురుల వేసిన కలలన్నీ సిగలో పూలుగ మారినవి
ఆ: మనసున పొంగిన అలలన్నీ మమతల తీరం చేరినవి!
ఆ: సన్న జాజి తీగెలాగ నిన్ను చేరుకున్నాను
అ: నిండు మనసు పందిరికాగా
నిన్ను అందుకున్నాను నిన్నే నందుకున్నాను ॥చిగురు॥
అ: దాగలేని రాగాలేవో దాచినావు ఆనాడు
ఆ: నా తనువు అణువణువు నీదే నీదే
ఏనాడు నీదే నీదే ఏనాడు ॥చిగురు॥
ఆ: నీటిలోని కలువను కోరి నింగి దిగిన జాబిలి నీవే
అ: పరిమళాల తరగలలోనే పవళించిన చెలియవు నీవే
పవళించిన చెలియవు నీవే ॥చిగురు॥

## 'సరిగపదమని-26

**జవాబులు**

అడ్డం: 1.దేవదా 3.వీరకంకణం 6.నీ 9.నరహరి 10 .రారోయి 12.బంగారు 13.వద్దు 15.వారు 16.రాక 17.మది 18.అన్నా 19.నా

నిలువు:2.వర 4.రమ్మంటే 5 కమ్ 7.కనరా 8.హోయి 10.రాజా 11.ఏరువాక 12.బండి 13.వగలు 14.వరాల

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

ఏ.కామేశ్వరరావు- విద్యానగర్, జయలక్ష్మి గన్నవరపు- హైదరాబాద్, కె.రఘునాథాచార్లు- కడప, జి.పి.శర్మ- హైదరాబాద్, యు.యు.యు- ఎమ్మిగనూరు, యం.అనుపమ్‌కుమార్- అనకాపల్లి, అనప్పిండి సత్యనారాయణ- సికింద్రాబాద్, కతారి చంద్రమోహన్- హైదరాబాద్, భోగరాజు సుబ్బారావు- విశాఖపట్నం, పి.నాగేశ్వరరావు- బెంగుళూరు, వేమూవ సుభాష్‌చంద్రబోస్- శ్రీకాకుళంటౌన్, సుబ్బలక్ష్మి చెన్నమరాజు- కర్నూలు, యస్.వేణుగోపాల్- హైదరాబాద్, సి.ఛాయదేవి- విజయవాడ, బిహారా శేషశాయి- సత్తెనపల్లి, వి.సునీల్‌రెడ్డి- విశాఖపట్నం, సహారె ఈరణ్ణ- ఆదోని, శ్రీదేవి రమేష్- హన్మకొండ, గోపాల వ్యాఘ్రేశ్వరరావు- రాజమండ్రి, ఎ.టి.శ్రీనివాసన్- అనంతపూర్, తాడి రంగారావు- రాజమండ్రి, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి (ఒరిస్సా), కొంపెల్ల పద్మజారాణి- విశాఖపట్నం, పి.సాహిరావు- విశాఖపట్నం, ఇప్పగుంట వెంకటశ్రీనివాసరావు- హైదరాబాద్, ఎమ్.వి.ఎస్.ఎన్.శాస్త్రి- విజయవాడ, ముప్పిరాల వెంకటరమణ- హైదరాబాద్, ఎ.మంగప్రణవి- హైదరాబాద్, ఉప్పాల మోహన్‌బాబు- అవనిగడ్డ (కృష్ణా), యు.శ్రీదేవి- హైదరాబాద్, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), ఎస్.సోమశేఖరయ్య- కర్నూలు, యం.రమణమ్మ- విజయనగరం, జి.విజయలక్ష్మి- విశాఖపట్నం, ఎ.సరోజాదేవి- రాజమండ్రి, పి.మధు- విజయనగరం, బి.చెన్నకృష్ణమాచారి- చెన్నై, ఆర్.రఘువీరారెడ్డి- చినవెమిల (నల్గొండ), ఎం.మాధురిరంగారావు- నల్గొండ, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, రాయచోటి కృష్ణమూర్తి- డోంబివిలి (మహారాష్ట్ర), పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి, విద్యరాజేశ్వరరావు- హైదరాబాద్.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

కె.కృష్ణ- జగన్నాథపూర్ (మహబూబ్‌నగర్), మంత్రిప్రగడ శేషాబాయి- సికింద్రాబాద్, బి.మురళీధర్‌రావు- దుండిగల్ (రంగారెడ్డి), కె.ఎల్.నంసింహరావు- విజయవాడ, ఎమ్.వి.రాఘవమూర్తి- రాజమండ్రి, వై.మందిర- విశాఖపట్నం, ఎ.జయపాల్- మదనపల్లి (చిత్తూరు), రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- హైదరాబాద్, చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, భావరాజు నీరజ- న్యూఢిల్లీ, అత్మూరి అన్నపూర్ణ- విశాఖపట్నం, ఎన్.వి.శివరామకృష్ణ- హైదరాబాద్, ఎస్.చౌహన్- ఎమ్.హెచ్.కంప్టి(మహారాష్ట్ర), కె.వి.గంగధరరావు- సికింద్రాబాద్, శ్రీపాదశివాని- హైదరాబాద్, రాచర్ల రోహిణి- హైదరాబాద్, టి.వింధ్యారాణి- నల్గొండ, పి.విజయలక్ష్మి- కాకినాడ, బి.వి.వి.సత్యవాణి- హైదరాబాద్, కర్రి సీతారామగిరి- కాకినాడ, మేడామస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, మేడా పద్మావతి- విశాఖపట్నం, ఎన్.సి.అరుణ- నెల్లూరు, రోహిణి అయ్యంగార్- హైదరాబాద్, ఈ.రాధిక- హైదరాబాద్, భగవంతం- కొత్తగూడేం (ఖమ్మం), ఎస్.అప్పారావు- ధవళేశ్వరం (తూ॥గో॥జిల్లా), టి.శ్యామలమూర్తి- హైదరాబాద్, కోవల్లె శ్రీనాథ్- హైదరాబాద్, పింగళి అశ్వత్థనారాయణ- ఒంగోలు, వై.యశోద- వైజాగ్, నిర్మల.కె- శివరెడ్డిపేట్ (రంగారెడ్డి), ఎమ్.అంజిరెడ్డి- ఒంగోలు, పప్పుఅప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), మారేమండ సత్యవాణి- పాతపట్నం (శ్రీకాకుళం), పవ్వాల జగన్నాధదాసు- బరంపురం, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, ఒ.ఎల్.కామేశ్వరి- విశాఖపట్నం, దాసరి సుప్రియ- కారంపూడి (గుంటూరు), వి.రమాకుమారి- హైదరాబాద్, రామ్‌ప్రసాద్- గార్ల (ఖమ్మం), పి.క్రాంతి శ్రీలత- చీరాల (ప్రకాశం), పి.రంగనాయకులు- మార్కాపురం (ప్రకాశం), చివుకుల చిరంజీవి- ఒంగోలు, ఆర్.వి.వి.కృష్ణ- హైదరాబాద్, కొణిదెన శార్వాణి- గుంటూరు, జొన్నలగడ్డ అన్నపూర్ణ- విజయవాడ. పి.వి.ఎస్.ఎన్.శర్మ- హైదరాబాద్.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

జి.వీరఘుశేషు- హాసన్(కర్ణాటక), చిలుకూరి శ్రీనివాసశర్మ- విజయవాడ, వారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, టి.కె.లక్ష్మి- అత్రేయపురం, జి.జాన్‌కెనడి- హైదరాబాద్, సాజిదా ఖాదర్- హైదరాబాద్, బి.సూర్యనారాయణ- కురపల్లి (విశాఖజిల్లా), నందూరి రామానుజాచార్యులు- జగ్గయ్యపేట (కృష్ణ), ఉదాలి పద్మావతి- చెన్నై, మైసూరు కీర్తన- మదనపల్లి, ఎస్.వెంకటేశ్వరరావు- ఒంగోలు, వి.శ్రీనావాసరావు- హైదరాబాద్, షేక్ గౌస్‌మొహిద్దీన్- కడప, అద్దంకి సీతాదేవి- హైదరాబాద్, అద్దంకి శ్రీరామచంద్రమూర్తి- హైదరాబాద్, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి (గుంటూరు), ఎ.రాధిక రావు- అమలాపురం, వి.వి.ఎల్.ఎన్.శాస్త్రి- కాకినాడ, ఇ.తేజస్విని- చిత్తూరు.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

ఏలూరు అశోక్‌కుమార్‌రావు- గుర్రంపోడ్ (నల్గొండ), జి.కిరణ్‌కుమార్- విశాఖపట్నం, పార్నంది వెంకటసూర్యసుబ్రహ్మణ్యమూర్తి- విశాఖటపన్నం, సి.హెచ్.రామ్మోహనరావు- విశాఖపట్నం, గంగిశెట్టి భారతి- నెల్లూరు, బి.కవిత- తిరుపతి, కె.రామరావు- హైదరాబాద్, శ్రీనివాస్‌పవార్- ఆర్మూర్ (నిజామాబాద్), లంబూరు లక్ష్మీదేవి- హైదరాబాద్, జూపూడి రూపవతిదేవి- గుంటూరు.

## 'సరిగపదమని-27

**జవాబులు**

అడ్డం: 1.నిలువవే 3.పచ్చగడ్డి 5.లేని 6.వారి 8 .నా 10.నీ 11.కారులో 12.నవ్వుతూ 15.బడిలో 17.పిల్ల 18.నల్లని 22.తేట 23. కలబడితే

నిలువు:1.నిను 2.వయ్యారీ 3.పని 4.గట్టు 5.లేదు 7.జోరుగా 9.మనసున 13.కుడి 14.తెల్లచీర 16.లోకం 19.నిను 20.కల 21. వాడి

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

అయ్యగారి రాజశేఖర్- రాజోలు(తూ.గో.జిల్లా), అనురాధ జనార్దన్.బి.- రాజ్‌కోట్ (గుజరాత్), పేరూరి లావణ్య- కాకినాడ, బి.మంజుల- నెల్లూరు, పి.చక్రి- ఏలూరు, బొజ్జ హరికృష్ణ- మద్రాసు, తెలికిచెర్ల రాజేశ్వరరావు- నరసన్నపేట (శ్రీకాకుళం), కె.నాగేశ్వరి- బళ్ళారి, జి.సాంబశివరావు- తెనాలి, కె.వి.దుర్గామోహనరావు- నల్గొండ, మేడవరపు బ్రహ్మన్న- కోలంక(తూ.గో.జిల్లా), కె. అనుసూయ- హైద్రాబాద్, యం.బిందుమాధవి- హైద్రాబాద్, కె.శ్రీనివాసులు- పోలకల్లు (కర్నూలు), రమేష్ సాంసాళె- ఎమ్మిగనూరు, జి.జాన్‌కెనడి- హైద్రాబాద్, ఎ.టి.శ్రీనివాస్- అనంతపురం, మహ్మద్ లతీఫ్- నాచారము, యన్.సూర్యకాంతం- కుందన్‌పల్లి, సాలా దేవీరాహుల్- విశాఖపట్నం, వాద్రేవు మాధురి- కోరుకొండ (విజయనగం), ఆర్.శ్రీదేవి-తిరుపతి, ఏ.బి.వి.ఎన్.రమేశ్- నెల్లూరు, మానస- తిరుపతి, బి.వి.వి.సత్యవాణి- హైద్రాబాద్, టి.కె.లక్ష్మి- అత్రేయపురం, పి.దేవశేన- పలమనేరు, యస్.నాగారాజు-రమవరప్పడు (కృష్ణ),, పి.స్వరూప్‌రాణి- హైద్రాబాద్, శ్రీపతి పూర్ణకుమారి- ఒంగోలు, వి.మహాలక్ష్మి- శ్రీకాకుళం, యల్.వి.వి.యస్.భగవాన్‌శాస్త్రి- గండిపాళెం(నెల్లూరు), కె.వసంతకుమార్- దేవరకొండ, మద్దాలి సువర్చలా శ్రీనివాస్- హైద్రాబాద్, కె.లక్ష్మీ దీప్తి- హైద్రాబాద్, కె.రమాదేవి- మణుగురు (ఖమ్మం), కె.వాణిమూర్తి- హైద్రాబాద్, కతారి చంద్రమోహన్- హైద్రాబాద్, అద్దాల రాంబాబు- హైదరాబాద్, బి.వి.చలపతిరావు- న్యూఢిల్లీ, అడిదం శారద- విజయనగరం, కోకా సరయు- ఏలూరు, మయూరిరఘు- హైద్రాబాద్, టి.గోపీనాథ్- హైద్రాబాద్, ఉదయ భాస్కర్ & విజయ- రాజమండ్రి, కె.సురేంద్రనాథ్- కాకినాడ, పి.యల్.యల్.తేజస్వి- వైజాగ్, బి.ప్రవీణ్‌కుమార్- మెదక్, దార్నాల లక్ష్మి- కరీంనగర్, శ్రీపాద శారదాదేవి- రాజమండ్రి, పి.వి.భార్గవి- శ్రీకాళహస్తి, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, వి.రామలింగేశ్వరరావు- హైద్రాబాద్, వి.సునీల్‌రెడ్డి- విశాఖపట్నం, కె.వి.గంగాధరరావు- సికింద్రాబాద్, కల్లు సీతారామగిరి- కాకినాడ, యన్.భారతిరాజు- వైజాగ్, పి.వి.మురళికిషోర్- సత్తెనపల్లి (గుంటూరు), ఏ.కామేశ్వరరావు- విద్యానగర్, జి.శిరిష- హైద్రాబాద్, ముష్టి కామేశ్వరరావు- రాజమండ్రి, కె.కె.విశ్వనాథం- హైద్రాబాద్, బిహారా శేషశాయి- సత్తెనపల్లి (గుంటూరు), తత్త్వాది కళ్యాణి- వేములవాడ (కరీంనగర్), నందూరి రామానుజాచార్యులు- జగ్గయ్యపేట, యన్.జ్యోతిర్మయి- హైద్రాబాద్, యం.అనిరుధ్ కుమార్- అనకాపల్లి, ప్రయాగ రాఘవన్- గుంటూరు, పి.శర్వాణి- హైద్రాబాద్, డా॥ఉప్పల వెంకటరమణయ్య- కడప, బి.వి.ఫణికుమార్- గుంటూరు, రాచర్లరోహిణి- హైద్రాబాద్, ఉదాలి జ్ఞానప్రసూన- చెన్నై, జి.వి.లక్ష్మి- హైద్రాబాద్, అల్లూరి రామారాజు- విజయవాడ, గుడ్లూరు ప్రభావతి- న్యూఢిల్లీ, ఎన్.రాధాకామేశ్వరి- హైద్రాబాద్, పి.హిమబిందు- బట్టిలంక (తూ॥గో॥జిల్లా), కె.కృష్ణశాస్త్రి- రాజమండ్రి, సామంచి సుధాకర్- విశాఖపట్నం, పి.తనుజ- రాజమండ్రి, డి.శైలజ- నందిగామ(కృష్ణా), సరస్వతుల చైతన్య- హైద్రాబాద్, పి.రఘుప్రసాద్- విశాఖపట్నం, గడ్డం గిరిబాబు- హోస్‌పేట (కర్నాటక), కొండుపర్తి వేంకట జగన్నాథదాసు- సికింద్రాబాద్, డా॥యు.ఎస్.వి.ప్రసాద్- హైద్రాబాద్, పి.జగన్నాథరావు- విశాఖపట్నం, మంగళగిరి జ్యోత్స- పర్చిపట్నం(విశాఖపట్నం), పి.శ్రీనివాస్‌రెడ్డి- హైద్రాబాద్, వేముగంటి లక్ష్మీతులసి- కాకినాడ, కె.వి.సరస్వతి- హైద్రాబాద్, జి.రంగనాయకులు- హైద్రాబాద్, బి.నాగేష్- తిరుపతి, యం.రమేష్‌బాబు- రాజమండ్రి, అత్మూరి వెంకటశరత్‌కృష్ణ- హైద్రాబాద్, కె.వి.యల్. నరసింహశాస్త్రి- హైద్రాబాద్, కె.సుజాత- విజయవాడ, గోపాల వ్యాఘ్రేశ్వరరావు- రాజమండ్రి, మారోజు సురేష్‌కుమార్- జగ్గయ్యపేట(కృష్ణా), ఆర్.యస్.సత్యవాణి- సికింద్రాబాద్, ఎమ్.మాధూరిరంగారావు- నల్గొండ, ఆర్.సూర్యాదేవి- విశాఖపట్నం, యం.సూర్యప్రభ- హన్మకొండ, బి.మురళీధర్‌రావు- రంగారెడ్డి, పార్నంది వెంకటసూర్యసుబ్రహ్మణ్యమూర్తి- విశాఖపట్నం, లక్ష్మి- కాకినాడ, ఆర్.సత్యరాజన్- కరీంనగర్, టి.వేదవతి- చిత్తూరు, కేతవరపు-ఈశ్వరసాయి- సత్తెనపల్లి, యస్.శ్రీశోభిత- తిరుపతి, యన్.సి.యస్.శర్మ- హైద్రాబాద్, ఆర్.ఉష- బెంగూళూరు, జి.ఆశాజ్యోతి- వినుకొండ, ఆర్ ఫణిబాల- ధవళేశ్వరము, సిహెచ్.రామ్మోహన్‌రావు- విశాఖపట్నం, అరవ పద్మావతి- రాజమండ్రి, గొంటూరు శ్యామల- బాపట్ల, చిలుకూరి శ్రీనివాసశర్మ- విజయవాడ, కె.అమీర్- కోసిరి (కర్నూలు), యస్. సత్యం- బొబ్బిలి (విజయనగరం), ఏలూరు శిల్ప- గుడివాడ, బి.సూర్యనారాయణ రాజు- చిట్టివలస (విశాఖజిల్లా), ఎ.విజయ భాస్కర్- మార్కాపురం (ప్రకాశం), బంకూరు శ్రీను- విజయనగరం, యం.కల్పవల్లి- పూణె, మైసూరు కీర్తన- మదనపల్లి, ఆర్.పుల్లాయమ్మ- తెనాలి, సిహెచ్.దేవి- జోగిపేట (మెదక్), ఆర్.వి.సుబ్బారావు- రాజమండ్రి, కె.వి.రామారావు- రాజమండ్రి, యస్.ఇందిరాకుమారి- హైద్రాబాద్, రాయచోటి కృష్ణమూర్తి- డొంబివిలి (మహారాష్ట్ర), ఆలాకృష్ణమూర్తి- ఒంగోలు, రాజ్‌కుమార్ ముగ్గళ్ళ- హైదరాబాద్, సుసర్ల అవంతి- విజయనగరం, గుడిమెల్ల శ్రీనివాస్- హైద్రాబాద్, యస్.శివప్రసాద్- విశాఖపట్నం, యం.కోటేశ్వరరావు- కాశీపూర్ (ఉత్తరాంచల్), టి.వింధ్యారాణి- నల్గొండ, యం.మాధవరావు- బెంగూళూరు, జి.పాండురంగశర్మ- హైద్రాబాద్, ఒ.యల్.కామేశ్వరి- విశాఖపట్నం, ఎస్.వెంకటేశ్వరరావు- ఒంగోలు, ఎస్.ఎల్.రావు- గౌహతి, సిహెచ్.కళ్యాణి చక్రవర్తి- బెర్హంపుర్(ఒరిస్సా), పి.మోహన్‌రావు- జింకిభద్ర (శ్రీకాకుళం), సుజాత- సికింద్రాబాద్, సర్వావాసుదేవరావు- దేవరకొండ (నల్గొండ), టి.చంచలరావు- హైద్రాబాద్, ఎ.మక్బుల్‌బాషా- కోడుమూరు (కర్నూలు), యు.పి.యస్.ఆదిత్యా- హైద్రాబాద్, ఎస్.శారదా- విశాఖపట్నం, ఈ.నటరాజ పిళ్ళై- చిత్తూరు, కె.క్రిష్ణ- జగన్నాథపూర్ (మహబూబ్‌నగర్), పి.శిరీష్‌కుమార్- రాజమండ్రి, జి.గౌతమి గణేశ్వరరావు- హైద్రాబాద్, పువ్వుల హరిబాబు- విజయవాడ, పి.ఉషాబాల- నూజివీడు (క్రిష్ణా), యం.వి.యస్.యన్.శాస్త్రి- విజయవాడ, గొరికృష్ణమాచార్యులు- చెన్నై, డి.శ్రీహరిరామం- శక్కర్‌నగర్ (నిజామాబాద్), టి.శ్రీనివాసరావు-గురజాల, గెల్లి క్రిష్ణమూర్తి- చీరాల (ప్రకాశం), పి.మధు- విజయనగరం, పి.సాహిరావు- విశాఖపట్నం, ఎ.సరోజిని దేవి- రాజమండ్రి, కె.యస్.గోపాల్‌క్రిష్ణ- హోసూర్ (తమిళనాడు), ఆర్.వి.వి.క్రిష్ణ-హైద్రాబాద్, ఆరవల్లి అరవింద శ్రీవేంకటేశ్వర్లు- విశాఖపట్నం, వి.లక్ష్మికుమారి- ఒంగోలు, యడ్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, పింగళి అశ్వత్థనారాయణ- ఒంగోలు, పక్కి చక్రవర్తి- గరివిడి (విజయనగరం), పి.మణిభూషణాచారి- హైద్రాబాద్, యస్.నాగేశ్వరరావు- విజయవాడ, ఆర్.జి.ప్రసూన- విజయవాడ, కె.వి.రమణారెడ్డి- హైద్రాబాద్, సామంచి అరుణ్‌కిశోర్- విజయవాడ, కె.సంపూర్ణ- సికింద్రాబాద్, వానపల్లినారాయణరావు- సాలురు (విజయనగరం), అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి(ఒరిస్సా), అరిగ నరశింహారావు- మార్కాపురం (ప్రకాశం), మంథాసుధాకర్- విశాఖపట్నం, ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ (క్రిష్ణా), అవసరాల ప్రసన్నకుమార్- విశాఖపట్నం, తాతిరాజు జగం- బరంపురం (ఒరిస్సా), పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), జి.విజయలక్ష్మి- హైద్రాబాద్, దాసరి నాగభూషణం- కడంపెద్దూర్ (ఆదిలాబాద్), కొండదాడి సుగుణకరరావు- విశాఖపట్నం, విశా అనుషా- గార్ల (ఖమ్మం), ఎ.నవీన్- ద్రోణచలం (కర్నూలు), వి.జి.కె.మూర్తి- నరకొడూరు (గుంటూరు), కె.వి.ఎన్.ఎస్.భగవాన్- రాజమండ్రి, ఆరాధ్యుల సుందరరావు- విశాఖపట్నం, సౌమిత్రి రమణాచార్య- హైద్రారాబాద్, డా॥ పురుషోత్తమాచార్య- నల్గొండ, కొమండూరి బాలాజీ-పామూరు (ప్రకాశం), వై.వి.యస్.యస్.అన్నపూర్ణ- సికింద్రాబాద్, వాస్తు రామచంద్ర- నెల్లూరు, టి.యస్.వత్సల-సాయినాథ్‌పురం (రంగారెడ్డి), కోవల్లెశ్రీనాథ్- హైద్రాబాద్, మార్తాండరాఘవన్- హైద్రాబాద్, ఎన్.సి.సంపత్‌కుమార్- అనంతపురం, జ్యోతి- కోడంగల్ (మహబూబ్‌నగర్), కె.రామారావు- హైద్రాబాద్, భువనగిరి ప్రభాకర్- హైద్రాబాద్, యం.అంజిరెడ్డి- ఒంగోలు, గల్లా చిట్టిబాబు- వైజాగ్, గట్టినేని సదాశివరావు- గుంటూరు, కె. వేణుగోపాల్‌రెడ్డి- హైద్రాబాద్, హర్ష కొతుసాహి- కాశీబుగ్గ (శ్రీకాకుళం), వేదగిరి లక్ష్మీప్రసాద్- సికింద్రాబాద్, పేరాల శ్రీనివాస్- వైజాగ్, వి.సాయిహేమచంద్ర- కర్నూలు, జొన్నలగడ్డ అన్నపూర్ణ- విజయవాడ, పి.విజయలక్ష్మి- న్యూఢిల్లీ, మామిడి మహేంద్ర- పూణె, కెసిరాజు శ్రీగోపాల్‌కృష్ణ- సికింద్రాబాద్, కె.శంకరనారాయణ- హైద్రాబాద్, టి.వి.నాగమణి- విజయనగరం, కె.వి.నిఖాల్‌కుమార్- నెల్లూరు, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, ఆర్.సరోజిని- చిలకలూరిపేట (గుంటూరు), యం.చంద్రకుమారి- విశాఖపట్నం, యం.సత్యవాణి- పాతపట్నం (శ్రీకాకుళం), అద్దంకి శ్రీరామచంద్రమూర్తి- హైద్రాబాద్, అద్దంకి సీతాదేవి- హైద్రాబాద్.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

అనంద్ జోషి- హైద్రాబాద్, బాచరాజు ప్రభాకరశాస్త్రి- హైద్రాబాద్, గాది సువర్చలాదేవి- గుంటూరు, పి.సాయికుమార్- హైద్రాబాద్, బాసరాజు యాదగిరి- నల్గొండ, వి.అనురాధ- సికింద్రాబాద్, లుంబూరు లక్ష్మీదేవి- హైద్రాబాద్, పరిమి సాంబశివరావు-విజయనగరం, కె.వి.యస్.రావు- హైద్రాబాద్, వారోజుశంకరాచార్యులు- చిలుకానగర్, యం.వి.యస్.లక్ష్మి- కాకినాడ, కొండ సువర్ణ- నిజామాబాద్, నీహారికా- బరంపురం (ఒరిస్సా), చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, నిర్మల క్రిష్ణ- తిరుపతి, కె.రఘునాథాచార్లు- కడప, నందిరాజు వెంకటచలపతిరావు- హైద్రాబాద్, రంగనాయకి- హైద్రాబాద్, సహారే ఇందిర- కళ్యాణ్ (మహారాష్ట్ర), సహారె ఈరణ్ణ- ఆదోని, ఉప్పలూరి సుబ్బారావు- మొగలికుదురు, యస్.కె. నాగూర్ మీరావలి- పీతాపురం(గుంటూరు), పి.శైలజ- సికింద్రాబాద్, డి.సాయివెదిత- విశాఖపట్నం, చల్లా మురళియాదవ్- చల్లవారిపల్లె (చిత్తూరు), ఆర్.వి.హెచ్.శాస్త్రి- ముంబాయి, రామకూరు నాగేశ్వరరావు- శ్రీకాకుళం, యం.జ్యోతి క్రిష్ణ- సికింద్రాబాద్, పి.యస్.యన్.రాజు- అచ్చంపేట (మహబూబ్‌నగర్), బి.శివశంకర్‌రావు- తాడెపల్లి (గుంటూరు), వై.యశోద- వైజాగ్, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, యం.హరికుమారి- రెల్లివలస (విజయనగరం), వి.ఝాన్సీలక్ష్మి- హైద్రాబాద్, కె.మదుచారి- హైద్రాబాద్, యజ్జల జగన్నాథం- పాతపట్నం (శ్రీకాకుళం), ఆర్.భక్తవత్సలం- తిరుపతి, ఓలేటి దక్షిణామూర్తి- చింతలూరు, ఎస్.విజయలక్ష్మి- హైద్రాబాద్, యల్లోజి తిరుపతి- హైద్రాబాద్, .

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

జీ. సదాశివరావు- హన్మకొండ, ఆర్.సంధ్యారాణి-హైద్రాబాద్, చిమ్మపూడి మురళీకృష్ణ- హైద్రాబాద్, బి.శ్రీనివాసరావు- హైద్రాబాద్, ఆర్.సుష్మాశకుంతల- తణుకు, యం. దుర్గప్రసాద్- వరంగల్, ఎ.ఎన్.మూర్తి- వైజాగ్, యం. నరసింహ- మహబూబ్‌నగర్, యం.రమణి- విశాఖపట్నం, డి.జై.కుమారి- బెర్హంపూర్ (ఒరిస్సా), బి.పద్మలత- తాడెపల్లిగూడెం, బండి శ్రీనివాసులరెడ్డి- ఇదుపూర్ (ప్రకాశం), పి.ఆదిలక్ష్మి- ఖమ్మం, వై. సుధా- సామర్లకోట, యం.లక్ష్మీనమ్రత- కాకినాడ, షణ్ముఖ వశిష్ఠరామ్- హైద్రాబాద్, ఎ.శ్రీనివాస్- మహబూబ్‌నగర్, యస్.చిన్నా-కోల్‌కటా, శ్రీనివాస్ పవార్- ఆర్మూర్ (నిజామాబాద్), వరయోగి రామ్‌మోహన- సికింద్రాబాద్, పుండమాటి ఆదిలక్ష్మి- కాకినాడ, కృష్ణవేణి- హైద్రాబాద్.

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

యస్.యస్.చంద్రబోస్- శ్రీకాకుళం, బి.సాయిబాబా- సికింద్రాబాద్, వై.సూర్యాకుమారి- అముదలవలస (శ్రీకాకుళం), యస్. రజిత- కుందన్‌పల్లి (రంగారెడి), పుణ్యాల లక్ష్మి- సత్తెనపల్లి, వి.వి.యల్.యస్.శాస్త్రి- కాకినాడ, ప్రణవ, శోభిత- హైద్రాబాద్, ఎ.కె.విషా- చిత్తూరు.



**బా**పు ముఖచిత్రం, శ్రీరమణ పీఠిక చూడగానే ఇదేదో మామూలు స్థాయి కార్టూన్ల పుస్తకం కాదు సుమా అనిపిస్తుంది. నాలుగుపేజీలు తిరగేస్తే అవునుకదూ అనిపిస్తుంది. గీతలు అందంగా అనిపించకపోయినా, రాతలు తెలివిగా ఉండి ఆలోచింపజేసి నవ్వు పుట్టిస్తాయి.

అందుకే ఆయనెవరో తెలియకుండానే బాపుగారు 1998 లో ఆంధ్రప్రభకు రాశారు -"మీ పత్రికలో 'సరసి' అన్నతను (లేక ఆమె) వేస్తున్న కార్టూన్లు చాలా బావుంటున్నాయి. తెలుగు కార్టూనిస్టులలో ఆ మాత్రం తెలివైనవానిని ఇంతవరకూ చూడలేదు." అని. ఇది మరీ ఉత్ప్రేక్షలా అనిపిస్తే కొన్ని తెలివైన కార్టూన్లు రుచి చూడండి -

సాధారణంగా పురాణాలపై కార్టూన్లు అనగానే వినాయకుడి ఉండ్రాళ్ల గురించో, దీపావళి పటాసులు స్వర్గానికి వెళ్లడం గురించో ఉంటూ ఉంటాయి. కానీ ఇవి చూడండి

సముద్రాన్ని దాటడానికి హనుమంతుడు శరీరం పెంచినప్పుడు ఎదురయిన ప్రాక్టికల్ ప్రాబ్లెమ్ గురించి




మ్యాచ్ చూడ్డానికి స్టేడియం కెళ్లినవాళ్లు అసలైన మ్యాచ్ చూడడానికి బదులు స్టేడియంలో ఏర్పాటు చేసిన క్లోజ్‌డ్ సర్క్యూట్ టీవీలపైనే దృష్టిపెట్టడం గమనిస్తూనే ఉంటాం. ఎందుకంటే వాటిల్లో క్లోజప్‌లు, జూమ్‌లు ఉంటాయి. వాస్తవజీవితంలో అవేమీ ఉండవు కదా! అలాగే నిజం కృష్ణుడు ప్రత్యక్షమైనా టీవీలో కృష్ణుడంత రంగుల్లో, గ్లామరస్‌గా ఉండడేమో!అన్న ఆలోచనపై రూపుదిద్దుకున్న కార్టూన్!




సరసిగారికి ఫేవరేట్ సబ్జెక్ట్ ఋషులు అనిపిస్తుంది. తపసు ఫలించేదాకా వాళ్లూ మామూలు మనుషులే (ఎటొచ్చీ దైవమార్గం పట్టారు) కాబట్టి మనలో ఉంటే ఈర్ష్యా, అసూయా, లోభత్వం వారిలోనూ ఉన్నాయని చూపించారు. తండ్రి సంపాదించిన ఆస్తికి వారసత్వం ఆశించినప్పుడు తపఫలం గురించి వర్రీకావడం, అది ఎవరికీ కాకుండా పోతుందేమో, మనకే దక్కించుకుంటే నష్టం ఏముంది? పైగా అవతలిమనిషి బాల్చీ తన్నేసి (మరీ నొచ్చుకోకుండా కాలధర్మం అనే పదాన్ని ప్రయోగించినా) అది ముదనష్టంగా అయిపోకుండా జాగ్రత్త పడడం తప్పేముంది? అన్న ఆలోచన వస్తుంది ఈ కార్టూన్ చూస్తే!




సరసి కార్టూన్లు
250 కార్టూన్లు, 50 రూ॥లు
ప్రతులకు - విశాలాంధ్ర




తపస్సు చేయటం మొదలుపెట్టాక దేవుడు ప్రత్యక్షం కాకపోయినా కనీసం చెడగొట్టడానికి రంభ వచ్చినా చూసి తరించవచ్చన్న ఆశ ఉండడం సహజం! ఓ చోట పదిమంది కూచుని తపస్సు చేసుకునేటప్పుడు జంగిల్‌మేట్స్‌లో ఎవరైనా మిస్‌బిహేవ్ చేయడం వల్ల రంభాదర్శనం మిస్ అయ్యే ప్రమాదం వచ్చినప్పుడు అతన్ని మందలించడం తప్పేముంది?




పదిమంది కూచుని తపస్సు చేసేచోటికి రంభ దిగివస్తే కోలాహలం కాకుండా ఉంటుందా? దేవుడి దేముంది? ప్రసన్నుడై ప్రత్యక్షమయ్యాక ఎక్కడికి పోతాడు? భక్తుడిపై అంత ఆదరణ లేకుండా పోతుందాన్న ధీమా కూడా అప్పుడప్పుడు ఉంటుంది. కానీ రంభ అలాక్కాదుగా... తపోభంగం అయిన మరుక్షణం మాయమయిపోతుంది. అందుకే అంత హడావుడి!




(వచ్చేసారి మరికొన్ని)

- ఎమ్బీయస్ ప్రసాద్

అక్టోబరు 22 సాహిర్ లుధియాన్వీ వర్థంతినీ, అక్టోబర్ 31 ఎస్.డి.బర్మన్ వర్థంతినీ పురస్కరించుకుని...



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం





**చిత్రం : ప్యాసా**

**రచన: సాహిర్ లుధియాన్వి**

**సంగీతం : ఎస్.డి.బర్మన్**

**గానం : గీతాదత్**

**అ**బ్దుల్ హాయే అంటే ఎవరికీ తెలీదు. సాహిర్ లుధియాన్వీ అంటే

జిందగీ కా సాథ్ నిభాతా చలాగయా' అంటూ జీవిత వేదాంతాన్ని కాచి

వహీదాది ఇందులో వేశ్య పాత్ర. విటుణ్ణి ఆకర్షించడానికి వీధిలో వెళ్తూ, గురుదత్‌ని చూసి, అతన్ని ఆకట్టుకోడానికి ఈ పాట పాడుతుందామె. సాయం సంధ్య. వహీదా ముందు నడుస్తూ, వెనక్కి తిరిగిచూస్తూ, సిగ్గు నటినయిస్తూ పోవడం, గురుదత్ ఆమె వెంటే, సందులు గొందుల్లో వెళ్ళడం -అదీ దృశ్యం. ఇక పాట.

జానే క్యా తూనే కహీ
జానే క్యా మైనే సునీ
బాత్ కుచ్ బన్హీ గయీ ॥జానేక్యా॥
సన్‌సనాహట్ సీ హుయీ
థర్‌థరాహట్ సీ హుయీ ॥ సన్‌సనా॥
జాగ్ ఉఠీ ఖాబ్ కయీ - బాత్ కుఛ్ బన్‌హీ గయీ ॥జానే క్యా॥
నైన్ ఝుక్ ఝుక్ కే ఉఠే
పావ్ రుక్ రుక్ కే ఉఠే ॥నైన్ ఝుక్॥
ఆగయీ చాల్ నయీ - బాత్ కుఛ్ బన్ హీ గయీ ॥జానేక్యా॥
జుల్ఫ్ శానే పే ఉడే
ఏక్ ఖుశ్‌బూ సీ ఉడే ॥ జుల్ఫ్॥
ఖుల్ గయే రాజ్ కయీ - బాత్ కుఛ్ బన్ హీ గయీ ॥జానేక్యా॥

పల్లవి : కహీ అంటే చెప్పడం, సునీ అంటే వినడం, బాత్ కుఛ్ బన్ హీ గయీ అంటే మొత్తానికి ఏదో కావలసినది జరగనే జరిగిందనే అర్థం. (బాత్ బన్ గయీ అన్నది హిందీలో జాతీయం లాంటిది. వాచ్యార్థం పొసగదు)

నువ్వేమన్నావో తెలీదు
నేనేం విన్నానో తెలీదు....కానీ
జరగవలసిందేదో జరిగినట్టే ఉంది

సన్ సనాహట్ అంటే గగుర్పాటు వంటిది. థర్ థరాహట్ అంటే వణుకు పుట్టడం (పారవశ్యంతో). జాగ్ ఉఠే అంటే నిదురలేచాయి; ఖాబ్ అంటే స్వప్నం

మేను గగుర్పొడుస్తోంది
వివశత్వం వణుకు పుట్టిస్తోంది
కలలెన్నో మేల్కొంటున్నాయి ॥జరగవలసింది॥

ఝుక్ అంటే వాలిపోవడం, ఉఠే అంటే పైకి లేవడం, పావ్ అంటే అడుగులు, పాదాలు, రుక్‌నా అంటే ఆగడం. చాల్ అంటే నడక.

కనురెప్పలు వాలి మళ్ళీ లేస్తున్నాయి
పాదాలు ఆగి ఆగి ముందుకు సాగుతున్నాయి
నడకలు కొత్త అందాల్ని సంతరించుకుంటున్నాయి॥జరగవలసింది॥

జుల్ఫ్ అంటే జుత్తు; షానే పే ఉడే అంటే నుదుటి మీద ఎగరడం, ఖుష్‌బూ అంటే సుగంధం; ఖుల్ గయే రాజ్ అంటే రహస్యం బహిర్గతం అవుతోంది.

ముంగురులు నుదుటి మీద ఎగురుతున్నాయి
పరిమళమేదో ఆవరిస్తోంది
ఎన్నో రహస్యాలు విచ్చుకుంటున్నాయి ॥జరగవలసింది॥

మామూలుగా వేశ్యలు విటులను ఆకర్షిస్తున్నపుడు రాసే పాట వంటిది కాదిది. ఈ గేయంలోనే కథాసూచన ఉంది. ఈ ఇద్దరు వ్యక్తుల మధ్య ఒక మౌనరాగం, ఒక విలక్షణమైన అనుబంధం వికసిస్తున్నాయని సూచించే పాట ఇది. అందుకే తమ ప్రయేయం, ప్రయత్నం లేకుండానే జరగాల్సింది జరుగుతోందని అనే మాటల్ని కవి ఎంతో భావస్ఫోరకంగా ప్రయోగించాడు. ఆమె నడకలో తొట్రుపాటు, కళ్ళు సిగ్గుతో వాలిపోవడం, మనసులో దాగిన రహస్యమేదో ఇన్నాళ్ళకి బయటపడడం- ఇవన్నీ ఒక వేశ్యలో సాధారణంగా కనిపించని మానసిక స్థితిని అద్భుతంగా ఆవిష్కరించిన పదాలు.









పాట ప్రారంభంలోనే అన్నట్లు, అతను (గురుదత్) ప్రత్యేకించి ఆమెతో ప్రేమ సంభాషణలు జరపడు. ఆమె కూడ అంతే. చూపులు, చేతల ద్వారానే అతని పట్ల తన ప్రేమను వ్యక్తం చేస్తుంది. అనవలసింది, వినవలసింది ఏమీ లేకున్నా తమ మధ్య ఒక గాఢబంధం ఏర్పడబోతోంది అన్న భావి కథార్థసూచన పల్లవిలోనే గొప్పగా చేశాడు సాహిర్.

కేవలం ఆ దృశ్యాన్ని రక్తి కట్టించడం కోసం రాసే కవులు చాలా మందే ఉన్నారు. కానీ చిన్న చిన్న మాటల ద్వారా ఆ పాత్రల స్వభావాన్ని, కథాగతిని కూడ ధ్వనింప జేయడం మహాకవులకే సాధ్యం. సాహిర్ ఏ రకంగా చూసినా మహాకవే!

ఇక గీతాదత్ పాడిన పద్ధతి. పాడుతున్నది వేశ్య అయినా, పాడుతున్న సన్నివేశం వేశ్యకు సరికొత్త అనుభవం. ఆమె యాంత్రికంగా చేస్తున్న పని కాదు. బహుశా మొదటిసారి మనసారా అనుభూతి చెంది అతన్ని ఆహ్వానిస్తోంది.

అందుకే కాస్త చిలిపితనం, కాస్త అమాయకత్వం, కాస్త అర్థంకానితనం, కాస్త పారవశ్యం... అన్నీ రంగరించి, తను గాఢమైన అనుభూతిని చెందుతూ, శ్రోతలను కూడ ఒక రస జగత్తులోకి తీసుకువెళ్లే మాధుర్యాన్ని గీతా ఈపాట ద్వారా అందించింది.

సాహిత్యంలో ఎంత లోతు ఉందో, గీతా స్వరంలో ఎంత భావం ఉందో, బర్మన్ బాణీలో అంత నిరాడంబరత, అంత సృజనాత్మకత ఉన్నాయి. అతి తక్కువ వాద్యాలతో, గీతాదత్ స్వరకంపనలు పూర్తిగా అభివ్యక్తమయ్యేలా, ఏకకాలంలో సరళంగానూ, మార్మికతతోనూ ధ్వనించే బాణీని ఆయన సమకూర్చారు.

ఇన్నీ ఇంత అద్భుతంగా అమరాయి కనకనే 'ప్యాసా' తరతరాలకూ గుర్తుంచుకునే 'క్లాసిక్' అయింది.

- మృణాళిని



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...



బాల్యపు లేతదనం మళ్ళీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం

పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బియస్ ప్రసాద్

2వ భాగం

చిత్ర పరిచయం 4

సమన్వయం
మంజీర

## జరిగినకథ

జంతువైద్యుడిగా కూడా దేశదేశాలా ఖ్యాతి గడించిన డా॥ జాన్ డూలిటిల్ పారిస్ ట్రిప్‌నుండి అతని పెద్దకూతురు షెరెజ్ 16 వ పుట్టినరోజున తిరిగి వచ్చాడు. షెరెజ్ పిజ్జాబాయ్‌తో డేటింగుకి వెళుతోందని తెలిసి కుదరదని గట్టిగా చెప్పి ఇంట్లోనే డిన్నర్‌పార్టీ ఏర్పాటు చేస్తాడు. ఆంబోతు అనే జంతువుల అండర్‌వరల్డ్ డాన్‌నుండి జాన్‌కు కబుర్లు వస్తూంటాయి.

- ఇక చదవండి



**త**లతిప్పి చూసిన జాన్‌ను చిన్న సైజు నక్కలాంటి ఓ జంతువు పలకరించి "కాస్త బయటకు రండి." అంది.

అందరికీ సారీ చెప్పి జాన్ బయటకు వచ్చాడు. వచ్చి "సంగతేమిటో త్వరగా చెప్పండి" అన్నాడు కోపంగా.

వచ్చిన జంతువు కంగారుపడలేదు. "నాపేరు కుడికాలు. మా ఆంబోతు బాస్‌కి అతి ముఖ్య అనుచరుణ్ణి. మీ మనుషుల్లో కుడిభుజం అంటారే అలాంటివాణ్ణన్నమాట! అన్నిటికంటె ముందు మీ కుమార్తె పుట్టినరోజు సందర్భంగా మా ఆంబోతుబాస్ మీకు శుభాకాంక్షలు తెలుపమన్నాడు.." అని మొదలుపెట్టింది.

"మంచిది, థ్యాంక్స్, నో మెన్షన్,.. అన్నీనూ. ఇక దయచేయ్. వెళ్లి మీ ఆంబోతుకు చెప్పు - ఇలా ప్రతినిమిషం డిస్టర్బ్ చేసి నా సహనానికి పరీక్ష పెట్టవద్దను."

కుడికాలు కూడా అంతే ఫోర్స్‌గా సమాధాన మిచ్చింది - "ఏమిటీ పెద్ద అంత ఇదయిపోతున్నావ్! ఒక్క ఐదు నిమిషాలు మాట్లాడితే చాలంటున్నాడు కదా మా బాస్!" అని.



"ఐదు నిమిషాలు కాదు, అర నిమిషం కూడా కుదరదంటే!?"

"నువ్వు మళ్లీ ఆ దారిలో వెళ్లడం కష్టమేమో, ఒక్కసారి ఆలోచించు బ్రదర్"

జాన్ కుడికాలుతో మాట్లాడుతూండగానే లీసా లోపలకి వచ్చేయమని సైగ చేసింది. ఏదో ఒకటి పంపకపోతే ఈ గొడవ వదిలేట్టు లేదని "సర్లే, మీ ఆంబోతును రేప్పొద్దున 8 గంటలకు మా క్లినిక్‌కు రమ్మనమను." అని వెనుదిరిగాడు.

కానీ వచ్చినది అసాధ్యపుజీవి. "మా బాస్ దేవుడు దిగి వచ్చినా తన పీఠం నుండి కదిలిరాడు. నువ్వు చాలా బిజీమనిషివని బాస్‌కు తెలుసు. అయినా నిన్ను తనవద్దకు రమ్మన్నాడంటే ఇది జీవన్మరణ సమస్య అని తెలుసుకోవాలి. నీ ఉపకారాన్ని బాస్ ఎప్పటికీ మర్చిపోడు."

ఈ బాస్ నామస్మరణ వినడంకంటె ఓ సారి వెళ్లివస్తేనే మంచిదనిపించింది జాన్‌కు. "ఈ సోది ఆపు. పొద్దున్న ఏడుగంటలకి తయారయివుంటాను. వచ్చి తీసుకెళ్లు. ప్రస్తుతానికి వదిలిపెట్టు." అన్నాడు చేతులు జోడించి.

"హే, గుడ్‌న్యూస్. బాస్‌కు గుడ్‌న్యూస్‌లంటే ఇష్టం." అంది కుడికాలు చేతులు చరుస్తూ.

"మళ్లీ మొదలెట్టకు, నువ్వూ, నీ బాసూ.." అనుకుంటూ జాన్ లోపలికి వెళ్లాడు.



లోపల అంతా రెడీగా ఉంది, బల్లమీద కేక్‌తో సహా! జాన్ రాగానే "హేపీ బర్త్‌డే టూ

యూ' అంటూ అందరూ పాడారు. "ఇక ఆలస్యం దేనికి? కొవ్వొత్తులు ఊదేసి, నీ బర్త్‌డే విష్ ఏదో చెప్పేసేయి." అన్నాడు జాన్ కూతురితో.

మొహం చిట్లించుకునే షెరెజ్ కొవ్వొత్తులు ఊదేసింది. కొవ్వొత్తులు ఆరాయో లేదో కేక్‌లోంచి రెండు ఎలుకలు 'హేయ్, సర్‌ప్రైజ్' అంటూ బయటకు ఉరికాయి.

తిని, పదిమందికి పంచవలసిన కేక్‌లోనుండి ఎలుకలు వెలువడడంతో కొందరు భయంతో, అసహ్యంతో హాహాకారాలు చేయగా మరికొందరు బిగుసుకుపోయారు. ఎలుకలు మాత్రం మహా హుషారుగా ఉన్నాయి. తలుపు వెనక్కాలనుండి 'బొయ్' మని అరిచి చెల్లెళ్ళి హడలేసిన అన్నయ్యంత ఆనందంగా 'మీరెవరూ ఊహించలేదు కదూ' అంటూ గంతులేసాయి. గంతులేయడం అయ్యాక కేక్ చివర్లకు చేరి కొరికి రుచిచూస్తూ 'ఇట్స్ యువర్ బర్త్‌డే, ఇట్స్ యువర్ బర్త్‌డే ఓ లేడీ' అంటూ యుగళగీతం అందుకున్నాయి.



విశ్వవ్యాప్తంగా ఏ జంతువు ఏ కొంటెపని చేసినా సంజాయిషీ చెప్పుకోవలసిన స్థితిలో పడ్డ జాన్ షెరెజ్ కేసి చూసి, " ఐ యామ్ సారీ" అన్నాడు.

"ఈ తుంటరి ఎలుకనేగా నువ్వు ఆపరేషన్ చేసి బతికించింది!" అని గుర్తుచేసింది షెరెజ్.

"ఇంత దారుణంగా తయారవుతాయని నాకేం తెలుసు, ఉండు వాటి పని చెప్తా" అంటూ ఎలుకలు రెండింటి పీకలనీ చెరో చేత్తో పట్టుకుని బయటకు పారేయడానికి ఉద్యుక్తుడయ్యాడు.

"ఇదిగో డాక్టర్! జాగ్రత్తసుమా, నీ వేళ్లమధ్య పడి మా బొచ్చు నలిగిపోతోంది. కాస్త చూసుకో. అయినా మీ అమ్మాయి పుట్టినరోజు కదాని మేం ఏదో చిన్న తమాషా చేయబోతే నీకింత కోపం దేనికి? ఓ పెట్టెలోంచి బుజ్జి పిల్లిపిల్ల ముద్దుగా బయటకు ఉరికిందనుకో, మీకు బలే థ్రిల్లింగ్‌గా ఉండదూ!?అలాగే..."

"ముందు మీరిద్దరూ తెలుసుకోవలసినది, మీరు బుజ్జి పిల్లిపిల్లలు కారు, రోతపుట్టించే ఎలకపిల్లలు. పిలకల్లాటి తోకలేసుకుని, మా అమ్మాయి బర్త్‌డే కేక్‌ను ధ్వంసం చేసిన బ్లడీ రాట్స్.."

"జువాలజీ ప్రొఫెసర్లా మరీ అంత టెక్నికల్‌గా మాట్లాడితే ఇంకేమంటాం? అవును, ఎలుకలవే..! కానీ ఓ విషయం గమనించావా? 'రాట్స్ స్పెల్లింగు తిరగేసి చూడు.. స్టార్స్" అందో ఎలుక.



"కరక్ట్ నేనూ, మా ఫ్రెండూ స్టార్స్! హా, హా" అంది దాని తోటి ఎలుక.

"ఏం తెలివి! సరే 'హా' స్పెల్లింగు తిరగేస్తే ఏమొస్తుందో తెలుసా?" అడిగాడు జాన్ కసిగా.

"ఏమొస్తుంది?"

"ఇప్పుడే తెలుస్తుంది." అంటూ జాన్ ఆ రెండు ఎలకలను కిటికీలోంచి కిందకి జారవిడిచాడు. రెండు "ఆహ్" అని అరుస్తూ కిందపడసాగాయి.

"చూశారా, కరక్ట్‌గా చెప్పారు" అని విజయగర్వంతో జాన్ వెనుదిరిగాడు. రెండు ఎలుకలూ వెళ్లి చెత్తడబ్బాలో పడ్డాయి.

జాన్‌లాగానే జంతువులను ప్రేమించే చిన్నకూతురు మాయా కుక్కపిల్ల లక్కీని కూచోబెట్టుకుని పాఠాలు నేర్పుతోంది. ముందుగా దానిచేత తన పేరు పిలిపించుకోవాలని ఆ అమ్మాయి ఉబలాటం. 'మాయా.. ఏదీ..మా..యా.. అను" అంటోంది. లక్కీ తన భాషలో 'మాయాయే కదా, సర్లే తర్వాతది చెప్పు' అంటోంది.



ఆ గోడు అర్థంకాని మాయా మళ్లీ 'మాయా, మాయా' అంటూ వల్లె వేస్తోంది. ఇంతలో షెరెజ్ లోపలకి వచ్చింది - 'ఏయ్, మాయా, నువ్వెంత పిచ్చిపని చేస్తున్నావో తెలుస్తోందా? అదేమైనా చిలుకా నీ మాటలు తిరిగి ఒప్పచెప్పడానికి?'' అని మందలించింది.

"ఉండక్కా, లక్కీ ఏదో చెప్దామనుకుంటోంది. దానికి మాటలు నేర్పించాననుకో.."

"..నేర్పించక్కరలేదు, ఇప్పుడే చెబుతా, విను. వెళ్లి నాకో ఫస్ట్‌క్లాసయిన బొమికె పట్రా!' అంది లక్కీ మాయా కళ్లలోకి సూటిగా చూస్తూ, గొంతు అదోలా పెట్టి ! అలా కళ్లలోకి చూసి. ఇలా లోతుగా మాట్లాడితే అవతలివాళ్లు మెస్మరైజ్ అయిపోతారనీ, తనకు కావలసివన్నీ సప్లయ్ చేస్తారనీ హిప్నాటిస్టు క్లినిక్‌లో కొంతకాలం పెరిగిన లక్కీ నమ్మకం.



పనిలో పనిగా ఊసరవెల్లి కూడా తనవంతు హిప్నాటిజమ్ తనూ చేసింది - "దానితోబాటు కొన్ని ఈగలు కూడా.." అని.

లక్కీ ఏకాగ్రచిత్తంతో మాయా చూపు మరల్చనివ్వకుండా "బొమికె ఒకటే కాదు, మాంచి చికెన్ లెగ్గూ, చేపల కట్‌లెట్టూ.."

ఈ లిస్టు ఎంతవరకూ సాగేదో కానీ లక్కీ దురదృష్టం కొద్దీ షెరెజ్ 'ఏయ్,

లక్కీ బయటకు ఫో' అంటూ ఒక్క కేక పెట్టింది. దెబ్బకు లక్కీ కనికట్టు మాయలోంచి మాయా బయటకు పడింది.

అంతలోనే జాన్ గదిలోకి వచ్చాడు. "ఇదిగో మాయా, నువ్వు కాస్త బయటకు వెళ్లు. షెరెజ్‌తో కాస్త మాట్లాడాలి." అన్నాడు.

సరేనంటూ మాయా బయటకు వెళ్లింది. బర్త్‌డే పార్టీ, బర్త్‌డే కేక్ నాశనం అయినందుకు జాన్ గిల్టీగా ఫీలవుతూ "షెరెజ్, ఇవాళ రాత్రి జరిగినదానికి సారీ. నేనసలు ఇంటిపట్టున ఉండకుండా దేశాలు పట్టి తిరగడం వల్లనే ఇన్ని అనర్థాలు. ఇకపై నేను మీ అందరితో ఎక్కువ సమయం గడుపుతానని మాట ఇస్తున్నాను." అన్నాడు షెరెజ్‌ను ఓదారుస్తూ.



షెరెజ్ ఏమీ కరగలేదు. "అంటే ఇంటినిండా మరిన్ని పశువులు, జంతువులు, పక్షులూ వచ్చి చేరతాయన్నమాట" అంది ఎకసక్కెంగా.

షెరెజ్ మాటల్లో వాస్తవం లేకపోలేదని తెలిసిన జాన్ ఏమీ అనలేకపోయాడు. కాస్సేపాగి, "పోనీ ఓ పని చేద్దాం. మనం ఇంట్లో ఉంటేనే కదా ఈ గొడవంతా! మనం అందరం కలిసి చక్కగా వెకేషన్‌కు వెళదాం. యూరోప్ వెళదాం. లండన్, పారిస్ అన్నీ చూసొద్దాం."

"తమాషాకి చెప్తున్నావా? నీరియస్‌గానా?" అడిగింది షెరెజ్.



"చచ్చేటంత సీరియస్‌గా చెప్తున్నాను. నువ్వెప్పుడూ అంటూ ఉండేదానివి. నేను పట్టించుకోలేదు. ఇప్పుడు చెబుతున్నాను. లండన్, పారిసే కాదు, రోమ్, గ్రీస్.. " అంటున్నాడు జాన్ నిజాయితీగా ధ్వనిస్తూండగా.

అతన్ని మధ్యలోనే ఆపింది షెరెజ్ - "అంటే.. ఇది లంచమా?"

కూతురు అంత పచ్చిగా అడిగేయడంతో పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టనిపించింది జాన్‌కి. ఇంత పక్కాగా మాట్లాడేవాళ్లతో నిజాన్ని ఒప్పుకోవడం మంచిదనిపించింది. నీళ్లు నములుతూనే "ఒకలా లంచమే

"అయితే అది పనిచేస్తోంది." అంది.

కూతురు ఏ ఆదర్శాలు వల్లిస్తుందోనని భయపడిన జాన్ నిట్టూరుస్తూ, గుండె తేలికపడినందుకు ఆనందిస్తూ తనూ ఓ చిరునవ్వు చిందించాడు.

ఇంతలో కుడికాలు మళ్లీ కిటికీ ఎక్కి "డాక్టర్, ఇంకో విషయం..." అంటూ చెప్పబోయింది.

"రేపన్నానా!?" అని ఒక్క ఉరుము ఉరిమాడు జాన్.

అటు తిరిగి ఉండడంవల్ల ఈ తతంగమంతా తెలియని షెరెజ్ ఉలిక్కిపడింది.

జాన్ సర్దుకుని ఆంబోతు వ్యవహారం కూతురికి తెలియకూడదని "అదే మన యూరోప్ ప్రయాణం రేపని అన్నానుగా" అంటూ ఓ వెర్రినవ్వు నవ్వాడు.

* * *

మర్నాడు జాన్ కారు హైవే మీద పోతోంది. పక్కసీటులో కుడికాలు, వెనుక సీటులో మరొక బంటు ఉన్నారు! కాస్సేపు కారుని మెచ్చుకోవడం జరిగాక తన బాస్ ముందు ఎలా ప్రవర్తించాలో కొన్ని రూల్సు వల్లించాడు కుడికాలు-



"మొదటిది నువ్వు సడన్‌గా కదలకూడదు. నో సడన్ మూవ్‌మెంట్స్. రెండోది, బాస్ పళ్లకేసి చూడక. నా ఉద్దేశ్యం ప్రకారం తను పళ్లకు క్లిప్ పెట్టిస్తే మంచిదని, కానీ నేను డెంటిస్టును కాదు కదా! మూడోది, నువ్వు అతనిపట్ల గౌరవంగా ప్రవర్తించాలి."

"నువ్వు ఆంబోతు బాస్ గురించేనా మాట్లాడుతున్నది! లేకపోతే ఎవరైనా మహాత్ముడి గురించి మనం మాట్లాడుకుంటున్నామా?" అడిగాడు జాన్ ఒళ్లుమండి.

"మా బాస్ ఏ మహాత్ముడికీ తక్కువ కాదని తమరు గుర్తించాలి" అన్నాడు కుడికాలు వెటకారంగా.

కారు క్రమంగా అడవుల్లోకి పయనించింది. జంతువుల సంచారం పెరిగింది. కారులో బంట్ల హడావుడి పెరిగింది. "కాస్త తప్పుకోలేరూ, పెద్దాయన వస్తున్నారన్న స్పృహే లేదు." అని తిట్టడం మొదలెట్టింది కుడికాలు. "మర్యాదా మప్పితం లేనివాళ్లకు చెప్పి ఉపయోగం లేదంటాడు బాస్" అంది మరో బంటు.



అడవిలోని జంతువుల మధ్య గుసగుసలు జోరుగా సాగాయి - 'కుడికాలు తక్కువ్వాడు కాదు. ఏకంగా డాక్టరు గార్నే తీసుకొచ్చేశాడు. ఈ డాక్టరుగారు మహత్తులు తెలిసినవాడట!' అంటూ.

కాస్సేపటికి కారు ఆగింది. పరిసరాలు గమనిస్తూ జాన్ దిగాడు. కుడికాలు ముందుగా లోపలకి వెళ్లివచ్చి "మా బాస్ నీ గురించి వెయిట్ చేస్తున్నాడు. నీకోసం ప్రత్యేకంగా చేపలు పడుతున్నాడు" అంది.

ఆంబోతులు చేపలు పట్టడమా? జాన్ కేమీ అర్థం కాలేదు. బుర్ర గోక్కుంటూ లోపలకి వచ్చి చూస్తే సీమ ఎలుగుబంటి లాటి జంతువొకటి చేపలు పడుతూ కనబడింది.

ఇతడే బాసయా? ఆంబోతు అన్నారు!? - జాన్ కేమీ అర్థం కాలేదు.

ఇంతలో ఆ జంతువు "వెల్‌కమ్ డాక్టర్ డూలిటిల్, వెల్‌కమ్ టు మై డెన్" అంది.



దాంతో తనే బాస్ అని తెలిసినా జాన్ ఇంకా కన్ఫ్యూజ్ అవుతూనే ఉన్నాడు. అతని అవస్థ గమనించి, "ఆంబోతు నా ముద్దు పేరంలే. చిన్నప్పటినుండీ నా తిరుగుళ్లు చూసి మా వాళ్లు పెట్టిన పేరది. అదే స్థిరపడిపోయింది." అంది బాస్. "ఫ్రెష్‌గా ఫిష్ పట్టాను, కావాలా?" అని ఆఫర్ చేసింది.

"వద్దులే, పొద్దున్నే తినివచ్చా" అన్నాడు జాన్.

కుడికాలు "బాస్ ఇస్తుంటే వద్దంటావేమిటి డాక్టర్, తీసుకో" అంది గట్టిగా.

బాస్ కలగజేసుకుంది. "నోర్ముయ్" అని కుడికాలును మందలించి జాన్‌తో "సారీ బాస్, మా వాళ్లకు దూకుడెక్కువ" అని అనుచరుల తరఫున క్షమాపణ చెప్పుకుంది.

"నీ గురించి మా డాక్‌యార్డ్‌లో ఉన్న మా వాళ్లు చాలా గొప్పగా చెప్పారు. అందుకే నీకు కాస్త ట్రబుల్ ఇవ్వాల్సివచ్చింది." అంది ఆంబోతు

"ఈ బాస్‌లు.. కుడిభుజం.. కుడికాలు.. డాక్‌యార్డు ముఠా.. ఏమిటిదంతా? మీరేమైనా మాఫియానా?" అన్నాడు జాన్ చుట్టూ చూస్తూ.

'ఎలకలా? అవేమిటి? ఎలా ఉంటాయి?' అని పిల్లి అడిగిన స్టయిల్లో 'మాఫియా? ఎప్పుడూ వినలేదే! ఏరా, మీరేమైనా విన్నారా? ఇదేమిటో.. మాఫి ..మాఫి యాట!'' అంది కుడికాలు.



అవి కూడా అదేమిటో బూతుమాట అన్నట్టు "ఛ, ఛ! అదేమిటో.. మాకు వర్ణక్రమం కూడా తెలియదు" అన్నాయి కోరస్‌గా.

"చూశారా? మాఫియా అనేది ఒక మిథ్య! అటువంటి మిథ్యలో పడి కొట్టుమిట్టులాడకుండా మా బాస్ చెప్పేది కాస్త వినండి." అంది కుడికాలు.

జాన్ అజ్ఞానపు పొరలు ఇంకేమైనా మిగిలివుంటే వాటినీ చింపేయడానికి ఆంబోతు సమకట్టింది. "నేను ఓ సింపుల్ ఫిషర్‌మన్‌ని. ఏదో.. చేపలు పట్టుకుని బతికే జాలరిని. నా అదృష్టం ఏమిటంటే భగవంతుడు నాకెందరో స్నేహితులను ప్రసాదించాడు. మీరు కూడా స్నేహితులయితే మరింత అదృష్టవంతుణ్నవుతాను డాక్టర్!"



"నేనేం చేయగలను? నాకు చేపలు పట్టడం అంతబాగా రాదు'' అన్నాడు జాన్ చికాకుపడుతూ!

"హ, హ! డాక్టరు గార్కి జోకులు వేయడం బాగా వచ్చులా వుంది. భగవంతుని దయవల్ల నాకు చేపల కొరత ఇంకా రాలేదు. నా ప్రాబ్లెం ఏమిటంటే - నా సామ్రాజ్యం క్రమంగా క్షీణించిపోతోంది."

"ఏం తతిమ్మా జంతువులు వచ్చి నీ ఏరియాపై దురాక్రమణ చేస్తున్నాయా?" అడిగాడు జాన్ వెకసక్కెంగా.

"అవే.. వాటిపేరు మనుష్యులు.." అంది ఆంబోతు.

"అంటే..?"



"అంటే, మనుష్యులు వచ్చి వ్యాపారప్రయోజనాల కోసం అడవులు కొట్టి పారేస్తున్నారు. దాంతో మా ఇళ్లు నాశనమయి పోతున్నాయి. కుటుంబాలు విచ్ఛిన్న మయిపోతున్నాయి. చెట్టుకొకరు, పుట్టకొకరుగా కకావికలయి పోతున్నాం. అంతా మీ మనుషుల చలవే.."

"మీరు పొరబాటున నన్ను తీసుకొచ్చినట్టున్నారు. మీరేం చేయాలంటే.. కొన్ని సంఘసేవా సమాజాలుంటాయి. అడవులు హరించేస్తున్నారనీ, ప్రాజెక్టులు కట్టి ఆదివాసులు ఇళ్లు కూల్చేస్తున్నారనీ కేసులు పెట్టి, హంగామా చేస్తుంటారు. వాళ్లని కాంటాక్ట్ చేసి చూడండి."

"వాళ్లతో మా గోడు చెప్పుకోవాలంటే నువ్వే మాకు గతి. మనుష్యుల భాష తెలిసినది నువ్వొక్కడివే కదా!"

కుడికాలు తనగోడు చెప్పుకుంది. "వెధవది, మనుషులతో పోట్లాడ్డం మహా కష్టం. వాళ్లు కత్తులు కటార్లు, తుపాకులు అన్నీ దగ్గర పెట్టుకుని వస్తారు. మా దగ్గర ఏంవున్నాయి కనుక? అఫ్‌కోర్స్, నాకయితే రేబీస్ ఉంది. కరిచానంటే వెధవకి రేబీస్ రోగంతో తీసుకుని తీసుకుని ఛస్తాడు. కానీ.. అన్ని తుపాకులకు ఒక్క రేబీస్‌తో జవాబివ్వగలమా? చేతిలో ఓ నాలుగు రోగాలైనా ఉంటే.."

"ఆగండాగండి. మనుష్యులకు, జంతువులకు మధ్య పోరాటం గురించి నేను రాలేదు. అది తెలుసుకోండి." అన్నాడు జాన్ కుడికాలు వాగుడికి అడ్డుకట్ట వేస్తూ.

ఆంబోతు కలగజేసుకుంది "చిన్న సవరణ, డాక్టర్. ఇది మనిషికి, ప్రకృతికి మధ్య పోరాటం. ఈ ఉపకారానికి మేమందరం నీకు ఋణపడివుంటాం.."



జాన్ కంగారుపడ్డాడు. "బాబోయ్, నేనే ఉపకారమూ చేస్తాననలేదు. మాట సరిగ్గా అర్థం చేసుకోండి ముందు" అని.

"నిజమే డాక్టర్, నువ్వు చేస్తానని అనలేదు. చేయననీ అనలేదు. చేయనని అనేముందు ఒక్కసారి అడివిలోపలకి వెళ్లి చూడు. మా గోడు ఏమిటో అర్థమవుతుంది." అంది ఆంబోతు.



కాస్సేపటిలో జాన్ కారు అడివిలోకి దారి తీసింది. ఆంబోతు చెప్పిన గుర్తులు జ్ఞాపకం పెట్టుకుంటూ కారు ఓ చోట ఆపి జాన్ కిందకి దిగాడు. అక్కడ అడవి అంతా కొట్టేసి ఉంది. చెట్లు కొట్టేసి దుంగలు, దుంగలుగా పడేశారు. తుఫాను వస్తే 'ప్రకృతి విలయతాండవం' అంటూ పత్రికలు హెడ్‌లైన్స్‌లో వాపోతాయి. ఇది ప్రకృతి ఛాతీపై మనిషి విలయతాండవం! పర్యావరణంతో చెలగాటాలాడే మనిషి విధ్వంసనృత్యం ఇది! ఈ భూమిపై తను తప్ప పశుపక్ష్యాదులు నివసించగలిగినా మానినా తనకు ఖాతరు లేదని చాటుతున్న మనిషి నిలువెత్తు స్వార్థానికి ఇంతకు మించిన సాక్ష్యం కానరాదు అనిపించింది జాన్‌కి. అక్కడే ఓ ఉడత ఏడుస్తోంది. "అంతా సర్వనాశనం అయిపోయింది. కొంపా, గోడూ అన్నీ పోయాయి. కుటుంబం చెల్లాచెదరైపోయింది. బ్రతికేం ప్రయోజనం?" అని.





జాన్ హృదయం కరిగింది. వెంటనే దృఢనిశ్చయానికి వచ్చాడు. జేబులోంచి సెల్‌ఫోన్ తీశాడు.

-(సశేషం)





# అన్నమయ్య పద భావ దర్శనమ్ 2



నిర్వహణ
జి.బాలకృష్ణప్రసాద్

## ఆకటివేళల అలమటించేవేళ...

సంపుటం 1, సంకీర్తన 158
టి.టి.డి. వారి "అన్నమయ్య హరి సంకీర్తనామృతము " క్యాసెట్‌లోనిది
సంగీత కూర్పు : శ్రీ నేదునూరి కృష్ణమూర్తి
గానం : జి. బాలకృష్ణ ప్రసాద్.

ఆకటి వేళల అలపైనవేళలను
తేకువ హరి నామమే దిక్కు మరిలేదు ॥
కొఱమాలి వున్నవేళ కులము చెడిన వేళ
చెఱవడి వొరుల చేజిక్కిన వేళ
ఒఱపైన హరినామ మొక్కటే గతిగాక
మఱచి తప్పిననైన మఱిలేదు తెరగు॥
ఆపద వచ్చిన వేళ ఆరడి బడినవేళ
పాపపు వేళల భయపడిన వేళ
వోపినంత హరినామ మొక్కటే గతిగాక
మాపుదాకా పొరలిన మరిలేదు తెఱగు॥
సంకెల బెట్టిన వేళ చంప బిలిచినవేళ
అంకిలిగా నప్పులవారాగిన వేళ
వేంకటేశునామమే విడిపించ గతిగాక
మంకుబుద్ధిఁ బొరలిన మరిలేదు తెఱగు॥

ఆకలితో అలమటించే వేళ, అన్నబలంలేక అలసిపోయిన వేళ, ధైర్యాన్నిచ్చి రక్షించగలిగింది ఆ శ్రీహరి నామమే. వెదకి చూచినా మరొక దిక్కులేదు. (మానవుడు అన్నగత ప్రాణి. ఏ పని చెయ్యాలన్నా కావలసిన మూలశక్తి అన్నంనుండే వస్తుంది. ఆ అన్నం (ఆహారం) లేకపోతే జీవితమే లేదు. అందుకే ఆకలితో ఈ సంకీర్తన ప్రారంభించారు అన్నమాచార్యులు)

ఏ పనికీ కొఱమాలివున్నప్పుడు; తోటివారిచేత బహిష్కరింపబడి ఏకాకియైనపుడు (కులము చెడినపుడు); మరొకరికి బందీయై నిస్సహాయుడైనపుడు - ప్రకాశవంతమైన ఆశాకిరణం శ్రీహరి నామమే. ఈ సంగతి మరచిపోతే వేరే దారిలేదు.

ఏ విధమైన ఆపదలో చిక్కుకున్నా, నిందలపాలై మనసు చెడినా, పాపకర్మముల పాల పడినపుడు, ఏవిధంగానైనా భయపడినా శక్తిమేరకు చేయగలిగిన శ్రీహరి స్మరణమే గతి. ఇతర ఉపాయములతో మాపుదాక (చివరివరకూ) ఎంత ప్రయత్నించినా ఫలముండదు.

శత్రువులు చంపనెంచినా, సంకెలలతో బంధించినా, అప్పులవారు అడ్డుతగిలినా (మానవునకు కుటుంబసభ్యులు గానీ బంధుమిత్రాదులు గానీ ఋణానుబంధంతో ఏర్పడుతారనీ- ఋణగ్రస్తుడైన ఈ జీవి పారమార్థిక జీవితానికి ఈ బంధుమిత్రులే మొదటి అడ్డు అనీ శాస్త్రకోవిదులైన పెద్దలమాట). ఏ పరిస్థితిలోనైనా శ్రీవేంకటేశుని పావన నామము తప్ప-మూర్ఖులై ఇతరత్రా ఎంత మొండి ప్రయత్నాలు చేసినా ప్రయోజనం లేదు.

ఒకరకంగా - " ఆర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతా
ఘోరేషుచ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్త దుఃఖాస్సుఖినో భవన్తి"

(అర్త్యులు, వ్యాధిగ్రస్తులు మొదలగు ఏ దీనులైనా నారాయణ నామసంకీర్తన మాత్రం చేత దుఃఖము బాసి సుఖంగా వుంటారు) అనే విష్ణు సహస్రనామ స్తోత్రంలోని శ్లోకానికి వ్యాఖ్యానమే ఈ సంకీర్తన మనవచ్చు.

**తేకువ = ధైర్యము, ఆలంబనము  తెఱగు = దారి, విధానము,**

**ఒఱపైన = అమందమైన, ప్రకాశవంతమైన  ఆఱడి = నింద**

**అంకిలి = అడ్డు  మంకుబుద్ధి = మూర్ఖత్వము.**

ఈ సంకీర్తనకు ఒక ప్రత్యేకత వున్నది. సాళ్వ నరసింగరాయల ఆస్థానంలో అన్నమయ్య ఉన్న రోజులలో - రాజస్తుతి చేస్తూ కీర్తన రచించడానికి నిరాకరించిన అన్నమయ్య, రాజధిక్కార నేరానికి బంధించబడి చెరసాలపాలై నాడు. చెరసాలలో అన్నమయ్య ఈ సంకీర్తన గానం చేసినంతట సంకెలలు వాటంతట అవే తెగిపడ్డాయి. ఆయన బంధవిముక్తుడైనాడు. ఈ వార్త నమ్మని రాజు- తన సమక్షంలో అన్నమయ్యను సంకెలలతో మరల బిగించి కట్టించి గానం చెయ్యమన్నాడు. తిరిగి ఆ సంకీర్తనే ఆలపించి రాజు సమక్షంలోనే బంధమోచనం పొందాడు అన్నమయ్య . అప్పుడు కనువిప్పు కలిగిన నరసింగరాయలు ఆయనను శరణువేడి తిరిగి అనుగ్రహపాత్రుడైనాడు.

ఇది కట్టుకథకాదు. చరిత్ర. తన తాతగారైన అన్నమాచార్యుల జీవిత చరిత్రను ద్విపద కావ్యంగా రచించి తరించిన తాళ్ళపాక చిన్నన్న రాగిరేకులపై చెక్కించి భద్రపరిచిన చరిత్ర. చెక్కుచెదరక ఇప్పటికీ మనకి లభ్యమౌతున్న చారిత్రక వాస్తవ విశేషం.

ఇక ఈ సంకీర్తన మహాత్మ్యానికి వస్తే- నాకే కాదు, ఎంతో మందికి ఎన్నెన్నో క్లిష్టపరిస్థితులలోనూ, తేకువ నిచ్చి కష్టాలు బాపిన మహిమోపేతమైనది ఈ సంకీర్తనం. దీనికి వారి వారి అనుభవాలే సాక్ష్యం. కేవలం అన్నమాచార్య సంకీర్తనల శ్రవణం, పఠనంతో అనేక విధాలుగా స్వస్థత పొందినట్లు నాతో చెప్పినవారెందరో వున్నారు.

**పాఠకులకు ప్రధానంగా గాయనీ గాయకులకు గమనిక**

ఈ పాటలోని ఈ క్రింది పదాలు సూచించిన విధంగా పలకగలరు.

సంకెల = సఙ్కెల
చంప = చమ్పః
అంకిలి = అఙ్కిలి
విడిపించ = విడిపిన్చ
వేంకటేశు = వేఙ్కటేశు
ఓపినంత = ఓపినన్త
మంకుబుద్ధి = మఙ్కుబుద్ధి

## నా అనుభవం!....

ఆకటి వేళల.... అని ప్రారంభమయ్యే ఈ సంకీర్తన ఎంతటి మహిమాన్వితమైనదో ఆర్తితో అన్నమయ్య ఈ సంకీర్తన గానం చేసినపుడు సాళువ నరసింగరాయలు అన్నమయ్యకు వేయించిన సంకెళ్ళు వాటంతట అవే తెగిపడిన సన్నివేశంలోనే తెలిసింది. అన్నమయ్యకే కాదు -ఈ కాలంలో కూడా మరెంతో మందికి ఈ సంకీర్తన గాన, పఠనల ద్వారా ఎన్నో కష్టాలు తీరిన విషయం నేనెరుగుదును. నిజానికి అటువంటిది నాకూ ఒక అనుభవం ఉంది.

20సం॥ క్రిందట నాకు వెన్నుపూస (యల్ 4 స్లిప్ డిస్క్) ఆపరేషన్ జరిగింది. 'డిస్క్' జరగడం మూలంగా ఏర్పడిన దుష్ప్రభావానికి అప్పటికే రెండేళ్లకు పైగా తీవ్రమైన నడుం నొప్పేకాక, కుడికాలు పూర్తిగా డీలా పడింది. అడుగు వెయ్యలేని -అసలు కదలలేని స్థితి. అప్పుడు - మా పినతల్లి, ప్రఖ్యాత నేపథ్యగాయని శ్రీమతి యస్. జానకి, మా పినతండ్రి రాంప్రసాద్ గారలు నన్ను వారి సంరక్షణలో ఉంచుకొని పెద్ద ఆపరేషన్ చేయించారు. అప్పటి పరిస్థితిలో ఆపరేషన్ తదుపరి ఫలితం అనుమానస్పదమే అని కూడా తెలిసింది. ఇక ఆపరేషన్‌కి సన్నాహాలు మొదలైనవి. ప్రాణాపాయం లేకపోయినా, మళ్ళీ నేనులేచి మాములు స్థితిలో కూర్చుని పాడుకోగలనా! అన్న భయంతో అన్నమయ్య కీర్తనలనే ఆశ్రయించాను. ఆపరేషన్ అయ్యేవరకూ పదేపదే పాడుకున్న కొన్ని పాటలలోనూ ఎక్కువ సార్లు పాడుకున్నది ఈ పాటే!

ఆపరేషన్‌కి జయప్రదంగా ముగిసిన తరువాత నేను చేసిన వేలాది కచేరీలలో పదేపదే పాడి ఈ సంకీర్తన మహత్యం గురించి సభలలో చెప్పేవాణ్ణి. సాధారణంగా నాకు ఏరకమైన ఇబ్బంది ఎదురైనా - భగవంతుని సహాయాన్ని అర్థిస్తూ నేను పాడుకునే సంకీర్తనలతో ఇది మొదటిది.

**- జి.బాలకృష్ణ ప్రసాద్**

ఈ శీర్షికకు తగిన పేరును సూచించమంటూ ఓ ఎనిమిది పేర్లనిచ్చి నిర్వహిస్తున్న జి.బాలకృష్ణప్రసాద్ గారికి ఆమోదయోగ్యంగా ఉండే పేరుని సూచించిన పాఠకులలో ఇద్దరికి ఆదిత్యా మ్యూజిక్ వారు వెలువరించనున్న అన్నమయ్య సంకీర్తనల సీడీలను పంపటం జరుగుతుందని 16-30 సెప్టెంబరు, 2004 సంచికలో ప్రకటించాం. అసంఖ్యాకంగా వచ్చిన సూచనలలో 'అన్నమయ్య పదభావ దర్శనమ్' పేరుని ఓ 13 మంది సూచించారు. వారు....

ఎస్. అనిల్‌కుమార్ - హైదరాబాద్, కె.రామారావు - హైదరాబాద్, డా॥ ఎం.పురుషోత్తమాచార్య - నల్గొండ, వి.ఎస్.జగపతిరాజు - విజయవాడ, పి.తిరుమలప్రసాద్, హైదరాబాద్, పిశుపాటి దాక్షాయణి - సికిందరాబాద్, ఆడిదం శారద - నెల్లిమర్ల (విజయనగరం), డా॥ కె. బాలసరస్వతి -సుళ్లూరుపేట, కె.వి.రమణ -జయపురం(ఒరిస్సా), వరదా సాయికుమార్ -పర్లాకిమిడి(ఒరిస్సా), ఎం.ఎస్.భట్టరాచార్యులు- జగ్గయ్యపేట, ఎ. ఉష - సికింద్రాబాద్, బి.ఎస్.పద్మావతి -సికింద్రాబాద్,

ఈ స్పందనను చూసి ఆదిత్యా మ్యూజిక్ వారు మరో మూడు అన్నమయ్య సంకీర్తనల సీడీలను ఇవ్వటానికి అంగీకరించారు.

ఈ పదముగ్గురిలో ఆ 5గురు ఎవరనేది వచ్చే సంచికలో...

విజయదశమిన జన్మించిన శైలజ పుట్టినరోజున పురస్కరించుకుని....

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 14



- ఇంద్రగంటి జానకీబాల

తన వదమూడో ఏట సోదరి వసంతలక్ష్మితో కలిసి 'మార్పు' అనే సినిమా కోసం 'ఇద్దరం -మేమిద్దరం' అనే పాటతో ఎస్.పి. శైలజ నేపథ్యగానానికి శ్రీకారం చుట్టారు. అయితే అప్పుడామె చాలా చిన్నపిల్ల. కథానాయికకి నేపథ్యం పాడాలంటే పసితనం వీడని గొంతు. అందువల్ల ఒక ఏడాదిపాటు సినిమా పరిశ్రమ వైపు చూడకుండా, చదువులో మునిగిపోయారు. చక్రవర్తి సంగీతంలో మొదటిసారి పాడిన శైలజ తన గొంతులోని అందాల్ని, శక్తిసామర్థ్యాల్ని నిరూపించుకున్నారు.

నెల్లూరు స్వస్థలమైన ఎస్.పి. శైలజ ప్రముఖగాయకులైన ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం సోదరి. ఆమె మొదట పాడేటప్పటికే అన్నగారు చాలా ప్రముఖమైన గాయకులుగా తెలుగు సినిమా పరిశ్రమలో వున్నారు.

"నేను సినిమా గాయని అవ్వాలని పెద్దగా అనుకోలేదు. పెద్ద చదువులూ అవీ చదవాలనుకునేదాన్ని. మా అమ్మ శకుంతలగారు నన్ను పాడేందుకు ఎక్కువ ప్రోత్సహించేవారు. మా నాన్న సాంబమూర్తిగారు కాస్త పాతతరం మనిషే. ఆయన కూడా సినిమా ఫీల్డ్ అదీ ఆడపిల్లలకెందుకూ అనే ధోరణిలోనే మాట్లాడేవారు. మా అమ్మగారి ప్రోత్సాహంతో అన్నయ్య అప్పటికే ఫీల్డ్‌లో వుండడం వల్ల, నేను రావడం జరిగింది".

ఇళయరాజా కొత్త గొంతులకోసం వెదుకుతున్న సమయంలో శైలజను పాడించాలనుకుని 'సూర్యచంద్రులు' అనే చిత్రంలో (1988) "ఏదో ఏదో ఎంతో చెప్పాలని" అనే డ్యూయట్ పాడించారు. అయితే శైలజకి మొదటగా 'తమిళం'లో పాడే అవకాశం లభించింది. అంటే మొదట 1977లో ఒక పాట పాడి వెనక్కి వెళ్ళిపోయిన శైలజకి ఆ తర్వాత తమిళ సినిమా




'పొన్నువూరు పుదుసు'లో పాడారు. 'తమిళంలో పాడి, ఆ తర్వాత మళ్ళీ తెలుగులోకి వచ్చాను' అంటారామె.

"తెలుగు పాట పాడాలంటే నాకు సుశీలగారి, జానకిగారి ఇన్‌ఫ్లూయన్స్ వడిపోతూ వుండేదనిపిస్తుంది. అదే తమిళానికి వస్తే, నాకా భాష పూర్తిగా కొత్తది కావడంతో, నా అసలు గొంతు తమిళం పాడేటప్పుడు బయటపడేదేమో ననిపిస్తుంది" అంటూ తన గొంతు స్వభావం గురించి విశ్లేషిస్తారు శైలజ.

'సాగర సంగమం'లో పాడాను. మా అన్నయ్యతో డ్యూయెట్ పాడేటప్పుడు కొంచెం ఇబ్బంది ఫీలయ్యేదాన్ని. అదీ ఇద్దరం ఒకేచోట వుండి పాడినప్పుడు -ఒకసారి మా అన్నయ్య 'మైక్ దగ్గరకొచ్చాక నువ్వూ, నేనూ, మన బంధుత్వం అన్నీ మరిచిపోవాలి. ఇక్కడ పాట, ట్యూన్,దానికి కావాల్సిన ఏకాగ్రత, ఎఫెక్ట్స్ - అంతే - ఇది ప్రొఫెషన్‌గానే తీసుకోవాలి' అని చక్కగా వివరించారు" అంటారు శైలజ.

శైలజ నెమ్మదిగా తన ప్రొఫెషన్‌కి బాగా అలవాటుపడ్డారు. అయితే తరువాత్తరువాత ట్రాక్ రికార్డింగ్ రావడంతో ఇలాంటి చిన్నచిన్న ఇబ్బందులు కూడా వుండేవి కావు. ఎవరి పాటలోని భాగాన్ని వారు పాడేసి వెళ్ళిపోతే, రెండో వారు మిగిలిన భాగాన్ని పాడి పూరించడమే. ఇందులో త్వరగా పనికానిచ్చుకునే వీలుందిగానీ పాటలోని ప్రాణం ఎగిరిపోయే ప్రమాదం కూడా వుంది.

ఇంగ్లీషు సాహిత్యంలో పట్టభద్రురాలైన ఎస్.పి.శైలజ చాలా స్వతంత్ర భావాలు గల యువతి. సంగీతం పట్ల , పాడడం పట్ల, సినిమా పాట పట్ల మంచి అవగాహన ఆమెకు వుంది. ఆమె కొత్తగా పరిశ్రమలోకి వచ్చినప్పటికి కూడా పాటను బాగా రిహార్సిల్ చేసే పద్ధతి వుండేదని, దానివల్ల ఎంతో ఆత్మవిశ్వాసం కలిగించేదని ఆమె అంటారు. సాలూరి రాజేశ్వరరావు, వేణు, కె.వి.మహదేవన్, ఎమ్.ఎస్.విశ్వనాథన్, ఇళయరాజా లాంటి మంచి సంగీత దర్శకుల దగ్గరపాడే అవకాశం లభించిందని ఆమె చెప్తారు.

"రాజేశ్వరరావుగారి దగ్గర జాగ్రత్తగా, శ్రద్ధగా వుండాలి. అందుచేత కాస్త టెన్షన్ తప్పదు. ఎమ్.ఎస్.విశ్వనాథన్ గారి దగ్గర క్షణక్షణం భయంగానే వుంటుంది. ఆయన పాట చెప్తూ మనం నేర్చుకునేలోగా ట్యూన్ మార్చేస్తూ వుంటారు. పాట పూర్తయ్యేవరకు టెన్షన్ తప్పదు, చాలా స్వేచ్ఛగా, ఏ భయమూ లేకుండా పాడేయగలిగేది కె.వి.మహదేవన్ గారి దగ్గర. అంతకంటే మరీ హాయిగా పాడేది చక్రవర్తి గారి దగ్గర" అంటారామె నవ్వుతూ.

ఎస్.పి.శైలజకి చాలా పేరు తెచ్చిన పాట 'నాంపల్లి స్టేషన్‌కాడి రాజాలింగో' అన్నది. ఈ పాట ఆంధ్రదేశమంతా మారుమోగిపోయింది. అలాగే 'చిన్నారినవ్వు, చిటి తామరపువ్వు', 'నాద వినోదము' లాంటి పాటలు శైలజకి ఒకగుర్తింపు, ప్రత్యేకతను తెచ్చిపెట్టాయి.

ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంతో సినిమా పాటల కార్యక్రమాలు చేయడం, అప్పుడప్పుడు ఆనంద్ పార్టీతో వెళ్ళి పాడటం శైలజ చేస్తూంటారు. "పాట మధ్యలో నవ్వడం అనేది నాకస్సలు వచ్చేది కాదు. 'మనవూరి పాండవులు' సినిమాలో పాడేటప్పుడు బాపుగారు పాట చివర నవ్వితే బాగుంటుందంటే నేను చాలా కష్టపడి నవ్వాను. మధ్యలో నవ్వు, రకరకాల హావభావాల్ని గొంతులో పలికించడం అంటే జానకిగారికే చెల్లింది" అంటారు శైలజ. మంగళంపల్లి బాలమురళీకృష్ణ దగ్గర శాస్త్రీయ సంగీతం నేర్చుకున్నశైలజ శాస్త్రీయ సంగీతం వైపు మళ్ళకపోవడం కూడా చిత్రంగానే అనిపిస్తుంది. అయితే కళ్యాణి, తోడి, ధర్మవతి లాంటి రాగాలు ఆమెకెంతో ఇష్టమని చెప్తారు.

శైలజకి పాట కంపోజ్ చెయ్యడం మీద ఎంతో ఆసక్తి వుంది. కానీ ఇంతవరకు చెప్పుకోదగినవేమీ కంపోజ్ చెయ్యలేదని ఆమె అంటారు. ఆమెకి 'మెలడీ' పాటలంటే ఇష్టం. పాటహాయిగా, చల్లగా, హృదయాన్ని కదిలించేదిగా వుండాలని ఆమె భావం. ఇంతవరకు హుషారు పాటలే ఎక్కువగా పాడారు. గత కొద్ది సంవత్సరాలుగా ఆమె గొంతు సినిమాల్లో పెద్దగా వినిపించడం లేదు. కంఠం చక్కని ఫాంలో వుండి, చిన్నవయసులో వుండి అవకాశాలు లేకుండా వున్నారంటే ఆలోచించవలసిన విషయం. మన తెలుగు సినిమా పరిశ్రమకి మొదటినుండి ఒక లక్షణం వుంది. కోతి, టోపీల వర్తకుడి కథలా వుంది దాని వ్యవహారం. నాలుగు రకాల గొంతులను నాలుగు రకాలుగా ఉపయోగించి ప్రయోగించడం లేదు. ఎవరో ఒకర్ని పట్టుకుని, మొదటినుంచీ చివరిదాకా వారితోనే పాడించే పద్ధతి వుంది. సినిమా పరిశ్రమ వరకు వచ్చినవారికి ఎంతో కొంత సొంత ప్రతిభ వుండి తీరుతుంది. దాన్ని సరైన పద్ధతిలో వుపయోగించాలి.

ఒకప్పుడు ముగ్గురు గాయనులు సమవుజ్జీలుగా పరిశ్రమలో మసిలారు - పి.లీల, జిక్కి, పి.సుశీల -ఆ తర్వాత ఎస్.జానకి కూడా. పి.లీల, జిక్కి వెనక్కి వెళ్ళిపోయాక ఒక పి.సుశీల మాత్రమే ప్రథమస్థానంలో వుండిపోయారు. అప్పుడామె అన్ని రకాల పాటలూ పాడారు. సంగీతదర్శకులు పాడించారు. మార్కెట్ అనే విషయం గురించి ఏమోగానీ, వినేందుకు మహ



మొనోటనస్‌గా అనిపించిన సందర్భాలు న్నాయి. ఇలాంటి ఒక 'మొనోపలీ' వల్లనే శైలజ లాంటి యువ కళాకారిణికి బొత్తిగా అవకాశాలు లేకపోతున్నాయంటే తప్పుకాదేమో! నిజానికి శైలజ పాడలేకపోయేంతటి గొప్ప పాటలేం ఇప్పుడు సినిమాల్లో రావడంలేదనేది కూడా సత్యం.

ఒకేచోట - అంటే సినిమా పరిశ్రమలాంటి చోట- చాలా దగ్గర బంధువులుండడం వల్ల అవకాశాలు ఎక్కువగా వస్తాయని జనం భావిస్తారు. కానీ ఒక్కొక్కసారి అలాంటి బాంధవ్యాలు వుండడం వల్ల ఎన్నో కష్టాలు, నష్టాలు కూడా వుంటాయనిపిస్తుంది. ఇది ఒక పరిశీలన మాత్రమేనని గ్రహించాలి.

చదువుకున్న ఎస్.పి. శైలజకి పుస్తక పఠనమంటే ఎంతో యిష్టం. సాహిత్యం పట్ల సంగీతం పట్ల స్వంత ఆలోచన గల యువతి. రికార్డింగ్ సమయాల్లో ఖాళీ దొరికితే పుస్తకం చదువుతూ కూర్చుంటా రని ఆమెని సన్నిహితంగా ఎరుగున్నవారంటారు.

ఎస్.పి.శైలజ మంచి డబ్బింగ్ ఆర్టిస్టు. 'సాగరసంగమం'లో నాట్యం చేసి, నటించి చక్కని నటిగా కూడా నిరూపించుకున్నారు. సినిమా పాటల కార్యక్రమాలకి వాళ్ళ అన్నగారితో వెళ్తున్నారు. డబ్బింగ్ చెప్తున్నారు. క్యాసెట్లు పాడుతున్నారు. "క్యాసెట్లు ఎక్కువగా భక్తివే వుంటాయండి" అంటూ భక్తిగా చెప్తారామె.

డబ్బింగ్ చెప్పడంలో ఒక సహజత్వం - అలవోకగా పలికే ఒక సులువు శైలజకి బాగా వుండంతో ఆమెకి ఆ ప్రక్రియలో ప్రత్యేక స్థానం వుంది. ఈమధ్య బొంబాయి తారలూ, అసలు తెలుగనే ఒక భాష వుందని తెలియని ఎందరో అమ్మాయిలూ తెలుగు సినిమాల్లో నటిస్తున్నారు కానీ వారి కంఠాలు వారివి కావు. ఎరువు కంఠాలతోనే వాళ్ళు అవార్డులు కూడా గెల్చుకుంటున్నారు.

'ఎక్కువ డబ్బింగ్‌చెప్తే, పాట పాడేందుకు గొంతు 'రఫ్' అయిపోయే ప్రమాదం వుందేమో కదా" అని అడిగినప్పుడు ఆమె నవ్వి, "నిజమే కానీ నాకు డబ్బింగ్ చెప్పడానికి అవకాశాలు వస్తున్నప్పుడు వాటిని తిరస్కరించలేం కదా!" అంటారు.

శైలజ పాడాల్సినన్ని పాటలు, పాడగలిగినంత వైవిధ్యం గల పాటలు పాడనేలేదు. కారణాలు వెదకటం కష్టమే. సినిమా పరిశ్రమలో వున్న పోటీని తట్టుకుని నిలబడటం మాటలుకాదు. దొరికేవరకు దాని వెంటపడి తిరగగలిగే ఓర్పు, నేర్పు కూడా ఒక్కొక్కసారి వుండకపోవచ్చు. సంగీతపరంగా నేపథ్యగానానికి కావలసిన అతిముఖ్య లక్షణాలను పరిశీలించవలసి వస్తే 'ఈ పాట శైలజగారే పాడాలి' అనే స్పష్టమైన ముద్ర ఆమె గాత్రానికి లేదనిపిస్తుంది. అక్కడక్కడ సుశీలలాగా, మరొకచోట జానకిలాగా వినిపించడం వల్ల (అది ఆమె మీద వారి ప్రభావం బాగా వుండడంవల్లే కావచ్చు) ఆమెకు ప్రత్యేకత లేకుండాపోయింది. అయితే ఎవరో ఒకరిద్దర్ని మినహాయిస్తే ఇప్పుడు పాడుతున్న నేపథ్యగాయనులందరూ ఒకేలాంటి కంఠాలు కలిగివున్నారని చెప్పాలి. అదీకాక పాడే విధానం - పెట్టుకునే శ్రుతి ఇవన్నీ ఒకరి పాట నుంచి మరొకరి పాటను వేరుగా వినిపించలేక పోతున్నాయి. తెరమీద ఫలానా అని పేరు చూశాక, 'ఓహో వారా!?' అనుకోవాలి.

ఒకప్పటి లీల, బాలసరస్వతి, జిక్కి, సుశీల, జానకి,భానుమతి, ఎస్.వరలక్ష్మి గొంతులు ఒకరిని పోలి ఒకరు వుండకపోవడం వల్లనే వారు రాణించారు. ఈనాటికీ స్థిరంగా నిలిచిపోయారు. ఎస్.పి. శైలజ వయస్సులో చాలా చిన్నవారు. ఇప్పటికీ మించిపోయిందేమీ లేదు. పాటలో తాదాత్మ్యం చెంది పాడే పద్ధతిలో నిర్విరామ కృషి చేస్తే, ఆమె మంచి గాయని కాగలరు. ■



# ఎస్.పి.శైలజ హిట్స్

**చిత్రం: ఎర్రమల్లెలు    రచన: ప్రభు    సంగీతం: చక్రవర్తి**

నాంపల్లి టేషన్ కాడి రాజాలింగో రాజాలింగా
రామా రాజ్యం తీరు సూడు శివా శంభు లింగా- లింగా॥రామా॥
తిందావంటే తిండీలేదు వుందావంటే ఇల్లేలేదు -2
చేద్దావంటే కొలువూ లేదు పోదావంటే నెలవూ లేదు ॥నాంపల్లి॥
గుక్కెడు గంజి కరువైపాయే ఒక్కటి పేణం బరువైపాయే -2
బీదా బిక్కి పొట్టలు గొట్టి మేడలు గట్టెసీకటి శెట్టి ॥నాంపల్లి॥
లేని అమ్మకీ అతుకులబతుకు వున్న బొమ్మకే అందం ఎరువు -2
కారల్లోన తిరగే తల్లికి కట్టే బట్టా కరవైపాయె ॥నాం॥
ముందు మొక్కులు ఎనకతప్పులు వున్నవాడికే అన్నీ చెల్లును -2
వులకావేమి పలకావేమి బండారాయిగ మారిన సామి॥నాంపల్లి॥

**చిత్రం : సాగరసంగమం    రచన : వేటూరి**
**సంగీతం: ఇళయరాజా    గానం : బాలుతో...**

అ: వాగర్థా వివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ
వందే పార్వతీప....రమేశ్వరౌ
ప: నాదవినోదము నాట్యవిలాసము పరమ సుఖము పరము
అభినయ వేదము సభకనువాదము సలుపు పరమ పదము
భావములో ఆ: ఆ... భంగిమలో ఆ: ఆ ....
గానములో ఆ: ఆ..... గమకములో ఆ: ఆ..... అ: ॥భావములో॥
ఆంగీకమౌ తపమీ గతి సేయగ ॥నాద వినోదము॥
ఆ: అభినయవేదము సభకనువాదము
సలుపు పరమ పదము ఆ...ఆ...ఆ...
ఇ: నీనిమదనీని మదనిసనీ రిసనిదనీ
మగమదాద గమామ రిగస
ఆ: కైలాసాన కార్తీకాన శివరూపం
ప్రమిదే లేని ప్రమథాలోక హిమదీపం అ: ॥కైలాసాన॥
అ: నవరస నటనం ఆ : దని సరి సనిస
అ: జతియుత గమనం ఆ : దని సరి సనిస
అ: నవరస నటనం జతియుత గమనం
ఇ: సుతగిరి చరణం సురనుతి పయనం
అ: భరతమైన నాట్యం బ్రతుకు నిత్య నృత్యం ॥2॥
తపనుని కిరణం తామస హరణం ॥2॥
శివుని నయన త్రయలాస్యం
ఆ: ధిరన ధిరన నన అ : తకిట తకిట థిమి
ఆ: ధిరన ధిరన నన అ: నాట్యం
ఆ: ధిరన ధిరన నన అ : తకిట తకిట థిమి
ఆ: ధిరన ధిరన నన అ: లాస్యం
అ: నమక చమక సహజం ఆ: జం
నటప్రకృతీ పాదజం ఆ: జం
నర్తనమే శివకవచం ఆ: చం
నటరాజ పాద సుమరజం ఆ: జం
ఆ: ధిరన నన అ: ధిరన నన
ఆ: ధిరన నన
అ: ధిరన నన ధిర ధిర ధిర ధిర ధిర ధిర ధిర ధిర॥నాద॥

**చిత్రం : సాగరసంగమం    రచన : వేటూరి**
**సంగీతం: ఇళయరాజా    గానం : బాలుతో...**

సాకీ: గా మా నీ గమగస మగస గస నీసానిదమగ
దమగ మగ సరీసానీ
గమగనీ గమాగ మదామ దనీద నిసానిరీ
అ: వేదం అణువణువున నాదం ॥2॥
నా పంచ ప్రాణాల నాట్యవినోదం
నాలో రేగేనెన్నో హంసానంది రాగాలై ॥వేదం॥
అ: సాగర సంగమమే ఒక యోగం
నిరిసనిదమగా గదమగరిసనీ నిరిసనిదమగా
మదనిసరీ సగారి మగదమ గమద నిసాని దనిమద
గమ రిగస
సాగర సంగమమే ఒక యోగం
క్షార జలధులే క్షీరములాయె
ఆ మథనం ఒక అమృత గీతం
జీవితమే చిరనర్తనమాయె
పదములు తామే పెదవులు కాగా ॥2॥
గుండియలే అందియలై మ్రోగా ॥వేదం॥
ఆ: ఆ....ఆ.....ఆ.... మాతృదేవోభవా
పితృదేవోభవా.... ఆచార్య దేవోభవా....ఆచార్య దేవోభవా
అతిథి దేవోభవా .........అతిథి దేవోభవా
ఎదురాయె గురువైన దైవం మొదలాయె మంజీర నాదం
గురుతాయె కుదురైన నాట్యం గురుదక్షిణైపోయె జీవం
అ: నటరాజపాదాల తలవాల్చనా నయనాభిషేకాల తరియించనా
ఆ: నటరాజపాదాల తలవాల్చనా నయనాభిషేకాల తరియించనా
అ: సుగమము రసమయ
సుగమము రసమయ నిగమము భరతముగా ॥ఆ: వేదం॥
అ: జయంతితే సుకృతినో రస సిద్ధాః కవీశ్వరాః
నాస్తిక్లేశాం యశః కాయే జరా మరణంచ భయం
నాస్తి జరామరణంచ భయం నాస్తి జరామరణంచ భయం

**చిత్రం : మొండి మొగుడు - పెంకిపెళ్లాం    రచన : సాహితి    సంగీతం : యం.యం.కీరవాణి**

లాలూ దర్వాజ లస్కర్ బోనాల్ పండగకస్తనని రాకపోతివి
లకడీకాపూల్ పోరికి లబ్బర్ గాజుల్ తెస్తనని తేకపోతివి- అవ్ మల్ల
ఒట్టి జూట మాటచెప్పి ఒచ్చేదాక లొల్లిపెట్టి
పట్టుకుంటె పోరగాడు పలకనామ పారిపాయ.....తుర్.....॥లాలూ॥
ఆడే చెలికాడు నాకు లాలీ పోలీసు ఓడు
ఆడ్నే పేమించినాను సై సై సై
కిష్నా నీ కంటి వాడు ఇంకా మా కొంటెవాడు
కన్నేకొట్టిండు నాకు హోయ్ హోయ్ హోయ్
నెమలి పింఛమొకటి తక్కువా ఆడి పొగరు జూస్తే తగని మక్కువ
యహ నాకు మాత్రమేవి తక్కువా ఆడెపుస్తెకట్టి పెనిమిటవ్వగా
యాడికో వుర్కుతాడనే ఏసినా ముక్కుతాడునే
కొంగులాగి నోడితోనే కొంగుముల్లు ఏసుకున్న
ఏడుకైన కన్నెవూసునేడు మల్ల చెప్పకున్న.. సంజైనదా? ॥లాలూ॥
టోపీ చప్రాసికన్న బీడీ బంట్రోతుకన్న
పోలీస్ పటేల్ బత్కుడోయ్.. డోయ్... డోయ్
గదిలో పెండ్లంతో వున్న గంటల్ ఫోనొస్తెమల్ల
ఎంటన్ పెట్టాల పర్గు రయ్ .. రయ్... రయ్
పొద్నలేస్తే ఖూనికేసులు పీన్గలెత్తె దాక సావు కాపులు
బందుల్తె తెగస్తితిర్గుడు ఆడ బందూకెత్తిగోలి కాల్చులు
ఉండవే కంటి నిద్రలు ఏలకే తిండి తిప్పలు
అడివికెల్లి బదలిఇస్తే ఆలు బిడ్డయాదమర్చి
ఆకు అలం మెక్కుడేలె మీకు బలం మింగుడేలె
జర గుస్స జైకుండ్రీ నే సచ్చ జెప్తున్నా ॥లాలూ॥

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

15

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు



'శ్రీ కృష్ణ తులాభారం' సినిమాలోని 'ఇది సరాగాల బాట...'పాట నేను పర్సనల్‌గా లైక్ చేయలేదు. ఎందుకంటే ఏదో ఇంగ్లీష్ ట్యూన్ పెట్టేశారు. "ఏం చేద్దామండీ ఏదో ఎంటర్ టైన్‌మైంట్ ఉండాలి కదండీ... అయినా ఇంద్రలోకం కదండీ" అని ఏదో చెప్పేరు. పద్యాలు మాత్రం చాలా బాగా పెట్టేరు. ఆ రోజుల్లో మేం కూడా బాగానే పాడేవాళ్లం.

ఇక మూడోసారి సత్యభామగా రామారావు గారు, జయలలిత కాంబినేషన్‌లో వచ్చిన 'శ్రీకృష్ణ విజయం'లో చేశాను. మన ఎం.ఎస్.రెడ్డి గారు తీశారు. ముందు నేను చేయనని చెప్పాను. అందులో సత్యభామది చాలా చిన్న పాత్ర. "అవతల ఆ అమ్మాయి హీరోయిన్‌గా చేస్తూ, ఇవతల నేనూ హీరోయిన్ చేస్తూ... అంత చిన్న క్యారెక్టర్ చేయాలంటే ఎలా.... అందులోనూ సత్యభామగా నేను బ్రహ్మాండమైన పేరు తెచ్చుకుని ఈ వేషం నేను ఎక్కడ వేయగలను" అన్నాను. అంటే ఆయన "లేదమ్మా...మీరు వేయాలి. రామారావు గారు పర్సనల్‌గా చెప్పారు.... ఆమెనే బుక్ చేయండి అని' అన్నారు.

"పోనీ నన్ను బుక్ చేసినప్పుడు నా సర్వీసెస్ యుటిలైజ్ చేసుకుని 5 లేక 6 సీన్స్ పెంచటానికి పాజిబిలిటీ ఉంటే చూడండి" అని అన్నాను. వాళ్లు అదేం చేయలేదు. సరే గ్రేట్ అబ్లిగేషన్ అంటారు చూడండి... ఒక్కోసారి మరి ఏ హీరోగారో వేయమంటారు.... అలా అడిగినప్పుడు కాదనలేం కదా... సో అలా ఆ వేషం వేశాను.

నాకు సత్యభామ పిచ్చి ఎంతవరకు వచ్చిందంటే ఇక్కడే హైదరాబాద్‌లో ఓ పది సంవత్సరాల క్రితం నేనే సత్యభామగా చేస్తూ స్టేజ్ పై శ్రీ కృష్ణ తులాభారం నాటకం తయారు చేసుకున్నాను. అక్కిరాజు సుందర రామకృష్ణ అని.... లెక్చరర్... చక్కగా పద్యాలు పాడతారు... అందంగా ఉంటారు. ఆయన్ని కృష్ణుడిగా ఎంపిక చేసుకున్నాం.

అంతకుముందు 'శ్రీ కృష్ణ తులాభారం' డ్రామా అందరూ లేడీ ఆర్టిస్ట్‌లతో వేశాం. కాంచన కృష్ణుడు, నేను సత్యభామ, మమత అని కమెడియన్.... ఆమెకు విగ్గు పెట్టి వసంతకుడు. ఇలా మొత్తం ఫిల్మ్‌స్టార్సే.



కృష్ణుడిగా కాంచన పద్యాలు, పాటలు చాలా బాగా పాడేది . తనతో పాటు ఓ మూడు ప్రోగ్రామ్‌ల వరకూ చేశాము. మొట్ట మొదట శ్రీకాకుళంలో.... డిస్ట్రిక్ట్ కలెక్టర్ హాస్పిటల్ సహాయార్థం వేయమంటే వేశాం. ఆ తరువాత..... కాంచన బెంగుళూరు వెళ్లిపోవడంతో కొన్నాళ్లు వెయ్యలేకపోయాం.

నేను రెగ్యులర్‌గా త్యాగరాయ గాన సభకు వెళ్తుంటాను - నాటక అకాడమీ అధ్యక్షురాలిగా! ఓ ప్రోగ్రామ్‌లో నారదుడు వేషంలో నాకు అక్కిరాజు గారు కనిపించారు. అలా ఓ మూల కూర్చుని ఉన్నారు ఓ తంబుర పెట్టుకుని. రామారావుగారి లాంటి అందగాడు నా పక్కన కృష్ణునిగా నా పక్కన యాక్ట్ చేసిన తరువాత డ్రామాలో మామూలు వాళ్లు నప్పుతారో లేదో అని పరీక్షగా చూశా. చూస్తే బాగా పాడాడు. నరే ఈయనైతే కృష్ణునిగా బాగుంటుందని నేను అనుకున్నాను. ఆయన్ని పిలిచి చెప్పాను.

సో హీరో దొరికాడు కాబట్టి మగ, ఆడ అంతా కలుపుకుని మళ్లీ మొదలుపెట్టాం. గోపాలకృష్ణ అనే ఆయన వసంతకుడు, నారదుడేమో బుర్రకథ సత్యనారాయణ... (ఈయన చనిపోయారు) చాలా బాగా పాడేవారు. వీళ్లందరితో లోకల్‌గా ఓ డ్రామా ట్రూప్ తయారు చేశాం. ఈ నాటకానికి సంగీతాన్ని పురుషోత్తమసాయి గారు అందించారు. ఆయన ఇప్పటికి దాదాపు 15, 20 వేల భక్తి పాటలు చేసి ఉంటారు. సినిమాల్లోకి రాలేదు. కానీ చాలా చక్కటి సంగీత దర్శకుడు. ఇంచుమించు ట్యూన్స్ అన్నీ పాతవే. కానీ ఆ డ్రామాలో ఉన్న ప్రత్యేకత ఏంటంటే - మొత్తం అందరూ పాడవలసినదే. నేను కూడా 'మీరజాలగలడా' స్వయంగా స్టేజ్‌పైన పాడాను.

అది కూడా ఓ 12 ప్రోగ్రామ్స్ కంటే ఎక్కువ ఇవ్వలేదు. సెకండ్ యూనిట్‌తో 12 ఇస్తే, ఫస్ట్ యూనిట్‌తో రెండో, మూడో ఇచ్చాము. అది కూడా ఏదైనా సహాయార్థం అని ఎవరైనా వచ్చి అడిగితేనే! ఎందుకంటే నేను సత్యభామ వేషం వేసుకుని... 50 ఏళ్ల ఏజ్‌లో పద్యాలు, పాటలు పాడుతుంటే థ్రిల్‌గా ఫీలయ్యేదాన్ని. ఆ పాత్రమీద నాకు అంత క్రేజ్. నిజం చెప్పాలంటే సత్యభామ పాత్ర అన్నా, ఆ పద్యాలన్నా నాకు పిచ్చి. సుశీల గారంత బాగా పాడలేకపోయినా పాడుతూ, డ్యాన్స్ చేస్తూ మంచి పేరునే తెచ్చుకున్నాం.

అదృష్టవశాత్తు 1986లో భగవాన్ నత్యసాయిబాబా వారి నన్నిధానంలో ప్రదర్శించటం జరిగింది. 1986 సెప్టెంబరులో నేను మొదటిసారి పుట్టపర్తి వెళ్లి బాబా గారి దర్శనం చేసుకున్నాను. నేను సెప్టెంబర్ 22న కలిశాను. డేట్ ఎందుకు గుర్తంటే మా అబ్బాయి బర్త్‌డే సెప్టెంబరు 20. నాగేశ్వరరావు గారిది, మా అబ్బాయిది ఒకేరోజు. సో 21 నేను హిందూపూర్ పబ్లిక్ మీటింగ్‌కు వెళ్లి, 22న స్వామి దర్శనానికి వెళ్లాను. అప్పుడు స్వామి నన్ను చూస్తూనే 'ఇంతకాలానికి వచ్చావా' అని ఇంటర్వ్యూకు పిలిచారు. అప్పుడు రెండు మూడు రోజులు అక్కడ ఉండిపోయాం. అక్కడ ఉన్నన్ని రోజులూ రెండు పూటలా మమ్మల్ని ఆయన పిలిచారు. ఫస్ట్ మా ఆరోగ్యం గురించి మాట్లాడేవారు. మూడోరోజు నేను మాట్లాడాను. "స్వామీ.... దసరాకు మీరు మంచి కార్యక్రమాలు ఏర్పాటు చేస్తారని విన్నాను. నాకొక అవకాశం ఇవ్వండి. 'కృష్ణతులాభారం' నాటకం వేయాలని వుంది. నేను స్వయంగా పాడతాను. ఓ కళాకారిణిగా నా జన్మ ధన్యమవుతుంది " అని అంటే... "తప్పకుండా వెయ్.. దసరాకు వద్దులే... నవంబర్‌లో స్వామి బర్త్‌డే. అప్పుడు లక్షల జనం వస్తారు. అందరూ చూసి ఆనందిస్తారు. అప్పుడు వెయ్" అన్నారు.

అంతవరకూ స్వామి మగ, ఆడ కలిసి యాక్ట్ చేస్తే చూసేవారు కాదట. స్వామి ముందు ఫస్ట్ టైమ్. రెండు గంటల నలభై అయిదు నిమిషాలు... స్వామి ఎంత ఎంజాయ్ చేశారో. అసలు కదలలేదు. స్వామికి నచ్చకపోతే లేచి వెళ్లిపోతుంటారట. అంజలీదేవి గారు కూడా స్వామి భక్తురాలు.... "ఇదిగో అమ్మాయ్... మన సినిమాల్లో మాదిరిగా స్వామి ముందు ముట్టుకుని యాక్ట్ చేస్తావేమో..." అని అన్నారు. "సరేలే.. అసలు నేను ముట్టుకునే యాక్ట్ చేయను" అని అన్నాను. ఆ విధంగా స్వామి సమక్షంలో ప్రదర్శన ఇచ్చాం. అప్పుడు 12 లక్షల మంది వచ్చారు.

తరువాత 1, 2 ప్రోగ్రామ్స్ వేశాను. 2002లో అమెరికా తీసుకువెళ్దామని ప్రయత్నాలు చేశా, అప్పుడే 7,8 ప్రోగ్రామ్స్ ఫిక్స్ అయిపోయినాయి. తీరా చూస్తే ఇద్దరు, ముగ్గురుకి వీసాలు రాలేదు. 'పోనీ మేడం మీరైనా రండి. ఉగాది ఫెస్టివల్ కదా. మొత్తం ట్రూప్ రాలేకపోయినా మీరైనా చీఫ్ గెస్ట్‌గా రండి' అనటం... వాళ్లలో వాళ్లే మాట్లాడుకుని నా ప్రోగ్రామ్స్ ఫిక్స్ చేయటంతో ఉగాది ఫెస్టివల్‌కు ఎనిమిది స్టేట్స్ వెళ్లాను. నా డ్రామా ఉంటుందనుకుని ఈ గంతా బొంతా పట్టుకుని వెళ్లాను. కనీసం అక్కిరాజుకి వచ్చినా అలక సీన్ ఒకటి అయినా చేద్దామనుకున్నాం. కానీ ఆయనకు కూడా వీసా రాలేదు. ఇక లాభం లేదని టెలిఫిల్మ్ విసిడి పట్టుకెళ్లా!

ఈ 'కృష్ణ తులాభారం' పిచ్చి నాలో బాగా ఉన్నప్పుడు దూరదర్శన్ వాళ్లు నన్ను అడిగారు. 'ఏమండీ మీ 'కృష్ణతులాభారం' నాటిక చాలా



## నేనూ నా పాటలు





బాగుందంట. ఓ 45 నిముషాల పాటు టెలీఫిల్మ్‌లా తీసి దూరదర్శన్‌కు ఇవ్వండి" అని అన్నారు. పద్మాలయాలో బ్యూటిఫుల్ సెట్స్ ఉన్నాయి. అక్కడ మొత్తం సినిమాలాగా తీశాను. మొత్తం మా పాటలను మేమే రికార్డ్ చేసుకున్నాం. ఈ డ్రామా యూనిట్‌తోనే స్టూడియోలో సినిమా మాదిరిగా రెండున్నర గంటల సినిమాను తీసి దాన్ని ఒక గంటకు దింపాం. ఎక్కడా ఏమీ మిస్ కాలేదు. పద్యాలు, పాటలు అన్నీ ఉన్నాయి. టెలిఫిల్మ్‌గా తీసి దూరదర్శన్‌కు ఇచ్చాం.

అమెరికా వెళ్లినపుడు ఆ టెలీఫిల్మ్ సీడీలు పట్టుకుని వెళ్లాను. ఇక శాన్‌ఫ్రానిస్కో వాళ్లు పట్టుకున్నారు. 'ఎలాగూ డ్రస్సు ఉంది కదా మేడం, ఒక్కసారి సత్యభామగా కనిపించండి' అని గొడవ. సరే అని చెప్పి మేకప్ వేసుకుని ప్రదర్శించా. పక్కన నళిని ఉండాలి కదా... అందుకని శాన్‌ఫ్రానిస్కోలో లోకల్ అమ్మాయికి ట్రైనింగ్ ఇచ్చి, ఆ అమ్మాయి చేత డ్యాన్స్ చేయించి, నేను డ్యాన్స్ చేసి ప్రదర్శించాను.

ఇక చూడండి. ఏమి రెస్పాన్స్ అంటే స్టాండింగ్ ఒవేషన్ ఇచ్చారంటే నమ్మండి. సత్యభామగా డ్రస్సు వేసుకుని 'మీరజాలగలడా' అని చేయి ఇలా పెడుతూనే 'ఓ..' అంటూ లేచి కరతాళ ధ్వనులతో స్టాండింగ్ ఒవేషన్ ఇచ్చారు. మళ్లీ ఒన్స్‌మోర్ అంటారు. 60 ఏళ్ల వయసులో ఈ జమున శాన్‌ఫ్రానిస్కోలో కనిపించి అక్కడి వాళ్లని అలరించింది. వాళ్లు చాలా ఆనందించారు. మా అబ్బాయి ఇటీవలే ఫోన్ చేశాడు... 'అమ్మా మళ్లీ రమ్మంటున్నారమ్మా, తులాభారం నాటకం తీసుకుని రా' అని అన్నాడు. 'నాయనా నా వల్ల కాదు. నేను ఆర్గనైజ్ చేయలేనిప్పుడు. అసలు ప్రయాణం చేయాలంటేనే చిరాగ్గా ఉంది' అని చెప్పా.

శ్రీమతి జమునగారికి నచ్చిన మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో...

స్థానం వారి 'మీరజాలగలడా' పాట పుట్టుపూర్వోత్తరాల గురించి 44,45 పేజీలలో

# మత్తు పాటల్లో రఫీ

నిజ జీవితంలో కించిత్తు అనుభవం కూడా లేని విషయాన్ని కళలో అత్యంత సమర్థంగా వ్యక్తీకరించడం గొప్ప కళాకారుడికి మాత్రమే సాధ్యం. రఫీ అలాంటి ప్రతిభావంతుడే. అందుకే నిషాలో జోగుతూ, కథానాయకుడి మనో వేదనను గానం చేయడంలో అతను అనితరసాధ్యమైన నైపుణ్యాన్ని చూపగలిగాడు. వ్యక్తిగత జీవితంలో రఫీ అన్ని వ్యసనాలకూ దూరంగా ఉండేవాడిని ఆయన సన్నిహితులు చెప్తారు. అయినా, 'మైనే పీనా సీఖ్‌లియా' (గూంజ్ ఉఠీ షెహనాయ్) వంటి పాటలు వింటే, తాగుడు అతనికి ఎంత అలవాటో అనే భ్రమకు లోనవుతాం.

కథానాయకుడు తాగిన సన్నివేశాలకు వెళ్ళేముందు, ఇతరరకాల మత్తులను రఫీ ఎలా గానం చేసాడో చూడాలి. అసలు 'మత్తు', 'నిషా' అన్నవి జీవితంలో తాగడం వల్లే కలగ నవసరంలేదు. యౌవనం ఓ మత్తు. ప్రేమ ఓ నిషా. యౌవ్వనపు మత్తు ఈపాటల్లో ఎంత హృద్యంగా పలికిందో -

**జవానియా యే మస్త్ మస్త్ బిన్ పియే**
**జలాతీ చల్ రహీ హై రాహమే దియే**
**న జానే కిస్ కే వాస్తే హు మై**
**న జానే ఇన్ మే కౌన్ హై మేరేలియే (తుమ్ సా నహీ దేఖా)**

తాగకుండానే ఈ యౌవ్వనం మత్తు కలిగిస్తోందిట. తన మార్గంలో దీపాలను వెలిగిస్తోందిట. అక్కడున్న యువతుల్లో తాను ఎవరికోసమో తెలీదుట; ఎవరు తన కోసం ఉన్నారో తెలీదుట. జవానియా, మస్త్ మస్త్, బిన్ పియే అనే పదాలను పలకడంలోనే ఆ మత్తెక్కిన అనుభూతిని, ఉత్సాహాన్ని శ్రోతలకు చేరవేయగలిగాడు రఫీ.

ప్రియురాలి కళ్లల్లోకి చూసినపుడు కలిగేది మరో రకం మత్తు - ఆమె చూపులు కలిగించే మైమరపు మద్యానికేమీ తీసిపోదు.

**'ఛల్ కే తేరీ ఆంఖోంసే శరాబ్ ఔర్ జియాదా**
**ఖిల్ తే రహే హోటోంపే గులాబ్ ఔర్ జియాదా' (ఆర్జూ)**

ఆమె కళ్ళలోంచి తొణికే మద్యం అసలు మద్యం కంటే ఎక్కువని వర్ణిస్తాడు.



ఇలాంటి ప్రియురాలు లేక, ప్రేమ అనుభవంలోకి రాక, మద్యం మత్తే జీవితమైపోయిన కథానాయకుడు రఫీ స్వరంలో జీవం పోసుకున్నాడు. 'షరాబీ' (పాతది, సంగీతం మదన్ మోహన్ ) చిత్రంలోని మూడు సోలోలు, కథానాయకుడు తన ఆవేదనను, ఏకాకితనాన్ని, తాగిన మైకంలో మరిచిపోవడానికి చేసే ప్రయత్నాల ప్రతిఫలనలే.

**'కభీ న కభీ - కహీ న కహీ - కోయి న కోయి తో ఆయేగా**
**అప్‌నా ముఝే బనాయేగా - దిల్ మే ముఝే బసాయేగా'**

(ఎప్పటికైనా, ఎక్కడైనా, ఎవరో ఒకరు వస్తారు; నన్ను దగ్గరికి తీసుకుంటారు; మనసులో చోటు ఇస్తారు)

**'సావన్ కే మహీనే మే - ఇస్ ఆగ్‌సీ సీనేమే**
**లగ్‌తా హై కి పీలేతా హు- దో చార్ ఘడీ జీలేతా హు'**

(వర్షాకాలంలో, మండే హృదయంతో, తాగుదామనుకుంటున్నాను; ఓ

---

చిత్రం : కశ్మీర్ కీ కలీ | రచన : ఎస్.హెచ్.బిహారీ
సంగీతం : ఓ.పి.నయ్యర్ | అభినయం : షమ్మీకపూర్

హై దునియా ఉసీకీ.. జమానా ఉసీకా...
మొహబ్బత్ మేఁ జో హో గయా హో కిసీ కా... ॥హై దునియా॥
లుటా జో ముసాఫిర్ దిల్ కే సఫర్ మేఁ
హై జన్నత్ యే దునియా ఉస్‌కీ నజర్ మేఁ ॥లుటా దో॥
ఉసీనే హై లూటా మజా జిందగీ కా
మొహబ్బత్ మే జో హో గయా హో కిసీ కా...
హై సజ్‌దే కే కాబిల్ హర్ వో దివానా
కే జో బన్‌గయా హో తస్‌వీర్-యే జానా ॥హై సజ్‌దే॥
కరో యహతరామ్ ఉస్‌కీ దీవాన్‌గీ కా..
మొహబ్బత్ మే జో హో గయా హో కిసీ కా...
బర్‌బాద్ హోనా జిస్ కీ అదాహో
దర్‌దే మొహబ్బత్ జిస్‌కీ దవా హో ॥బర్‌బాద్॥
సతాయేగా క్యా గమ్ ఉసే జిందగీకా...
మొహబ్బత్ మే జో హో గయా హో కిసీ కా... ॥హై దునియా॥



**చిత్రం : మధుమతి** | **రచన : శైలేంద్ర**
**సంగీతం : సలిల్ చౌధురీ** | **అభినయం : జానీవాకర్**

జంగల్ మే... జంగల్ మే మోర్ నాచా కిసీనేనా దేఖా..
జంగల్ మే మోర్ నాచా కిసీనేనా దేఖా.. హై
హమ్ తో థోడీ జరా పీకే జరా ఝూమే
హాయ్‌రే సబ్‌నే దేఖా ॥జంగల్ మే॥
గోరీ కీ గోల్‌గోల్ అఖియా షరాబీ
కర్ చుకీ హై కైసే కైసోం కీ ఖరాబీ
దిల్ కా యే జోర్ జుల్మ్ కిసీనే న దేఖా...
హమ్ తో థోడీ సీ పీకే జరా ఝూమే
హాయ్‌రే సబ్‌నే దేఖా ॥జంగల్ మే॥
కిసీ కో హరే హరే నోట్ కా నషా హై
కిసీ కో బూట్ సూట్ కోట్ కా నషా హై
అరె వావ్వా కిసీకో హర్రే హర్రే నోట్ కా నషా హై
కిసీ కో బూట్ సూట్ కోట్ కా నషా హై
యూరో హమే తో న చాంద్ కా నషా హై
హమ్ తో థోడీ జరా పీకే జరా ఝూమే
హాయ్‌రే సబ్‌నే దేఖా ॥జంగల్ మే॥



రెండు ఘడియలు జీవిద్దామనుకుంటున్నాను). తాగితే తప్ప జీవించలేని స్థితికి చేరుకున్న బాధాతప్తజీవి అతను.

'ముఝే లే చలో.. ఇస్ జహాన్ సే '

నన్ను ఈ లోకంనుంచి తీసుకు వెళ్ళు అనిపాడే మూడో పాట కూడా నైరాశ్యంలో మద్యం ఆసరాగా చేసుకున్న నాయకుడి ఆవేదనకు గానరూపమే. ఈ మూడు పాటల్లోనూ, నాయకుడి విషాదభరితమైన జీవితాన్ని, మనఃస్థితిని వ్యక్తం చేయడానికి బాధకు, మత్తుకూ రఫీ ఏర్పరచిన సయోధ్య -శ్రోతలలో ఉద్విగ్నత కలిగిస్తుంది.

సాధారణ జీవితంలో మద్యానికీ, ఆనందానికి దగ్గర సంబంధం ఉండవచ్చు గానీ, చలనచిత్రాల్లో మాత్రం ఎక్కువ భాగం (ముఖ్యంగా పాడేది హీరో అయినపుడు) మద్యపానం అన్నది మనోవేదనకు సంకేతమే.

**'హై దునియా ఉసీకీ - జమానా ఉసీకా**
**మొహబ్బత్ మే జో - హో గయా వో కిసీకా' (కశ్మీర్ కీ కలీ)**

ఈ లోకంలో, ప్రపంచంలో, ప్రేమలో అన్నీ ఆమెవే; తనవంటూ ఏమీ లేవు; ఆమెకు తను ఏమీ కాడు అన్న నిర్వేదం ఈ పాటలో వినిపిస్తుంది.

దుఃఖం ముదిరినపుడు శాంతి కోసం మద్యాన్ని ఆశ్రయిస్తారు చాలా మంది. కానీ మత్తు వల్ల కలిగే స్పృహ లేని స్థితి కూడా శాంతి నివ్వలేదు ఇతనికి.

**'కోయీ సాగర్ దిల్ కో బహలాతా నహీ**
**బేఖుదీ మే భీ కరార్ ఆతా నహీ' (దిల్ దియా దర్ద్‌లియా)**
(ఏ మధుపాత్రా మనసును రంజింపజేయలేదు
విస్మృతిలో కూడా శాంతి కానరాదు)

అసలు తాగేది దేనికి? అన్నిటినీ మరిచిపోవడానికి, కానీ అందరూ వదిలి వెళ్ళిన జీవితంలోనూ ఆమె పేరు గుర్తుకు వస్తోంది అతనికి.

**'హమ్ బేఖుదీ మే తుమ్ కో పుకారే చలే గయే**
**సారే వో జిందగీ కే సహా రే చలే గయే' (కాలాపానీ)**

మద్యం మత్తులో ఏం చేస్తున్నాడనే కాదు. తాను ఎవరో కూడా తెలీడంలేదు ఈ మహానుభావుడికి.

**'మై కౌన్ హూ, మై కహా హూ, ముఝే యే హోశ్ నహీ**
**కిధర్ మై ఆజ్ రవా హూ- ముఝే యే హోశ్ నహీ (మై చుప్ రహూంగీ)**

మత్తులో ఉన్న గమ్మత్తేమిటంటే, ఒక్కోసారి అందులో బాధ, ఆనందం రెండు తెలీవు. ప్రియురాలు తనను దయ తలుస్తుందో, బాధపెడుతుందో తనకు అవసరం లేదంటాడు- ఎలాగూ స్పృహ లేదు కనక.

**'అబ్ వో కరమ్ కరే కే సితమ్-మై నషే మే హూ**
**ముఝ్‌కో న కోయి హోశ్ న గమ్ - మై నషే మే హూ' (మెరీన్ డ్రైవ్)**

పిచ్చివాడు తనను పిచ్చివాడని ఒప్పుకోనట్టే, ఒక్కోసారి తాగినవాడు కూడ తాగానని ఒప్పుకోకపోవచ్చు.

**ముఝే దునియా వాలో - షరాబీ న సమ్‌ఝో**
**మై పీతా నహీ హూ -పిలాయి గయీ హూ (లీడర్)**

నా అంతట నేను తాగలేదు; ఎవరో తాగించారు కనక. తనను తాగుబోతుగా అనుకోవద్దంటాడు.

తాగుతూ, దాన్ని ఎంజాయ్ చేస్తూ, తన నిత్య నూతన జీవితానుభవాల్ని ప్రకటించుకునే కథానాయకుడు 'నయాదిన్ - నయీ రాత్' లోదర్శనమిస్తాడు.

**మై వహీ వహీ బాత్ -మై వహీ వహీ బాత్**
**మేరేలియే తో హర్ దిన్ నయా దిన్ - హర్ రాత్ నయీ రాత్'**

**చిత్రం : తుమ్ సా నహీ దేఖా** | **రచన : మజ్రూహ్ సుల్తాన్‌పురి**
**సంగీతం : ఓ.పి.నయ్యర్** | **అభినయం : షమ్మీకపూర్**

జవానియా యే మస్త్ మస్త్ బిన్ పియే
జలాతీ చల్ రహీ హై రాహమే దియే
న జానే కిన్ కే వాస్తే హుః మై
న జానే ఇన్ మే కౌన్ హై మేరేలియే ॥జవానియా॥
మేరేలియే మేరేలియే మేరేలియే మేరేలియే
కభీ హసీ కభీ జవా కహాపే, దిల్ తౌహారియే ॥2॥
కభీ హై దిల్ కీ మెహమాన్
కిసే కిసే పుకారియే కిసే కిసే పుకారియే ॥జవానియా॥
మేరేలియే మేరేలియే మేరేలియే మేరేలియే
దివానే హమ్ యే చాహ్ కే, తో బేకరార్ హో లియే ॥2॥
యే రూర్ కి నిగా హతే
గునాహ్‌గార్ హో లియే॥2॥ ॥జవానియా॥
మేరేలియే మేరేలియే మేరేలియే మేరేలియే



చిత్రం : అర్జూ
రచన : హస్రత్ జైపురి
సంగీతం : శంకర్-జైకిషన్
అభినయం : రాజేంద్రకుమార్, సాధన తదితరులు

ఛల్ కే తేరీ... ఛల్ కే తేరీ... ఆంఖోం సే షరాబ్ ఔర్ జియాదా
ఛల్ కే తేరీ... ఆంఖోం సే షరాబ్ ఔర్ జియాదా 2
ఖిల్ తే రహే హోంఠోంకే గులాబ్ ఔర్ జియాదా
ఛల్ కే తేరీ... ఆంఖోం సే షరాబ్ ఔర్ జియాదా
క్యా బాత్ హై జానే తేరీ మహిఫిల్ మే సితమ్‌గర్ 3
ధడ్‌కే హై దిలే-ఖానా ఖరాబ్ ఔర్ జియాదా ॥ఛల్ కే తేరీ॥
ఇస్ దిల్ మే అభీ ఔర్ భీ జఖ్మోంకీ జగహ్ హై 3
అబ్ రూప్‌కీ కటారీ కో దోఆబ్ ఔర్ జియాదా ॥ఛల్ కే తేరీ॥
తూ ఇష్క్ కే తూఫాన్ కో బాహోంమే జకడ్ లే 3
అల్లాహ్ కరే జోరే-షబాబ్ ఔర్ జియాదా ॥ఛల్ కే తేరీ॥



సంజీవ్‌కుమార్ అసమాన నటనకు రఫీ సునాయాసగానం తోడై అద్భుతమైన సన్నివేశంగా ఇది రూపొందింది.

జీవితం మీద నిరాశ నిస్పృహలు, మద్యం మత్తులో కలిపి, రెండు అనుభూతులనూ అద్భుతంగా మేళవించి పాడడం రఫీ ప్రత్యేకత.

**'ఉసీనే హై లూటా మజా జిందగీకా, మొహబ్బత్ మే జోహో గయావో కిసీకా** (హై దునియా ఉసీకీ )పాటలో అంటున్నపుడు,

**'తుమ్ ముఝ్‌సే మై , జగ్ సే పరేశా, దోనోహై మజ్‌బూర్'** (దిన్ ఢల్ జాయే) పాటలో అంటున్నప్పుడు,

**'జో ఉన్ కీ తమన్నా హై బర్‌బాద్ హోనా'** (ఇంతకామ్ )అంటున్నపుడు, రఫీ పలికించిన హావభావాలు అనితర సాధ్యాలు.

కానీ తాగుడు అంతా విషాదమే కాదు. నవ్వుతూ, నవ్విస్తూ ఉండే పాటలు కూడ, రఫీ సోలోల్లోనూ, యుగళాల్లోనూ ఉన్నాయి. ముఖ్యంగా జానీవాకర్ రఫీ కాంబినేషన్‌లో తాగుడు కడు రమ్యంగా ఉంటుంది.

**జంగల్ మే మోర్ నాచా కిసినే న దేఖా**

**హమ్ జో థోడీ సి పీకే జరా ఝూమే - హాయ్ రే సబ్ నే దేఖా (మధుమతి)**

(అడవిలో నెమలి నాట్యం చేస్తుంటే ఎవ్వరూ చూడరు; నేనేదో కాస్త తాగి, తూలుతూంటే, ఖర్మ, అందరూ చూస్తారు) థోడీసీ అని ఎంత అభినయిస్తూ అంటాడంటే అక్కడ జానీవాకర్ లేకున్నా మనకు దృశ్యం చూస్తున్నట్టే ఉంటుంది. అలాగే, తాగి, తందానాలాడుతూ ఆనందంతో గెంతే పాట **'మై జట్ యమలా పగ్‌లా దీవానా'** (చరస్) మత్తు పాటల్లో మరో మూడ్‌ని చూపేది. ఇక, యుగళాల్లో తాగిన రఫీ -- **'ఖుద్‌తో బద్‌నామ్ హువే - హమ్ కో బదనామ్ కియా'** (చందా ఔర్ బిజిలీ లో - ఆశాభోంస్లేతో) **'పీతే పీతే కభీ కభీ యూ జామ్ బదల్ జాతీహై** (బైరాగ్ లో - లతాతో )ఎంతో వైవిధ్యాన్ని ప్రదర్శించాడు.

తాగినపుడు మాటలు మత్తుగా పలకడం (**కోయీ సాగర్**), మధ్యలో వెక్కిళ్ళు వెక్కడం (**మైనే పీనా సీఖ్‌లియా**), ఎక్కువ దీర్ఘాలు తీయడం (**సావన్ కే మహీనేమే**) వంటి లక్షణాలు అభినయించడం ద్వారా, రఫీ ఆ పాటల్ని, సన్నివేశాన్ని దృశ్యమానం చేసాడు. అందుకే అన్ని రకాల పాటల్లో లాగే, మత్తు పాటల్లోనూ 'సరిలేరు నీకెవ్వరూ' అనిపించుకున్నాడు.

**- మృణాళిని**


లక్ష్మీ ప్రొడక్షన్స్
పాటల ప్రత్యేకం
మిస్టర్ అండ్ మిసెస్
శైలజా కృష్ణమూర్తి
వాళ్ళకింకా పెళ్లి కాలేదు
నిర్మాత: ఎ. పూర్ణచంద్రరావు దర్శకత్వం: శివనాగేశ్వరరావు సంగీతం: రోహిత్‌రాజ్

**రచన: సుద్దాల అశోక్ తేజ** **(1)** **గానం: టిప్పు, కల్పన**

అ: అసలే చలికాలం - ఆపై పడుచోళ్లం
విజిలేసే సన్న నడుం - ఓ అమ్మాయీ
ఇంకేలా ఇంత ఎడం
ఆ: హోయ్...అసలే పడుచోళ్లం - ఆపై చలికాలం
వదిలేశా సన్న నడుం - ఓ అబ్బాయీ
నీదేరా కన్నెధనం
అ: బాగుందీ కదిలే నడకలొ కదలని మందారం
ఆ: కరిగిందీ చూపుల వేడికి దాచిన బంగారం
ఈ రోజే ఇద్దరికీ సంతోషం అ: ॥ అసలే చలికాలం॥
అ: ఎకాయెకి చెప్పమ్మా పెదవిలో ఏముందో
ఆ: మునిపంట చూడు ఓసారీ అదే తేనెల రాదారీ
అ: చిరునామా....తెలిసె ఇక చూడూ
పగలూ రేయీ అననూ
ఆ: తెరిచింది మనసే తలుపులనీ
హద్దు - గిద్దూ అననూ
అ: అదరిందే జాణతనం - ఓ అమ్మాయీ
తెరతీసే వెచ్చదనం ॥ అసలే చలికాలం॥
అ: కసెక్కిన నీ బుగ్గ
గులాబి ఇస్తావా
ఆ: చెలి చెంపకు లేదు మోమాటం
అదీ ముద్దుల మైదానం
అ: పరుగెత్తే వయసు తొలివేగం
చూపే సమయం ఇపుడే
ఆ: గిలిగింతై తొలిచే కొసచూపు
కలిపే స్నేహం నేడే
అ: కొసిరిందే (కొసరిందే) కొంటెతనం - ఓ అమ్మాయి
మెరిసిందే ఆడతనం
ఆ: వదిలేశా సన్న నడుం - ఓ అబ్బాయీ
నీదేరా కన్నెధనం

**రచన: విశ్వ** **(2)** **గానం: దేవన్, కోరస్**

ప: ధినక్ ధిన్ ధిల్లోరే
తకిట ధిమి నాచోరే
ఝునక్ ఝున్ ఝూమోరే
జవానీ జియోరే
తలెత్తుకు తిరగాలోయ్
చలించక నిలవాలోయ్
మనస్సులు గెలవాలోయ్
ఖుషీగా ఆడాలోయ్
కాదోయ్ లైఫు జస్ట్ లాటరీ
ఎన్నో వింతల లాబరేటరీ
అంతే తెలియని పెద్ద మిస్టరీ - బ్రదరూ
చూసేసెయ్ చూసేసెయ్
ఉందోయ్ మనకు పెద్ద హిస్టరీ
ఎపుడూ మనదే సిసలు విక్టరీ
కథ మొదలెడితే కరుగు కాలరీ - డియరూ
లవ్ చేసెయ్ లవ్ చేసెయ్ ॥ధినక్ ॥
చ: మగువేరా ధీర సమీర
సుతిమెత్తగ సున్నితమేరా
చిరునవ్వులు చిందిస్తూనే
శృతి చెయ్యర చెలిమి సితార
జాదూ... హో హో మగువేరా ధీర సమీర
సుతిమెత్తగ సున్నిత మేరా
చూపుల్లో చురకత్తులొద్దురా
తీరంచేరుతు తొందరొద్దురా
హద్దులు మీరి వెళ్లవద్దురా....వినరా
చూసేసెయ్ చూసేసెయ్...
కాదోయ్ లైఫు జస్ట్ లాటరీ
ఎన్నో వింతల లాబరేటరీ
అంతే తెలియని పెద్ద మిస్టరీ....కనరా ॥ధినక్॥
చ: కాదోయీ ఆడది టాయి
చులకన చేయొద్దుర భాయి
మనసన్నది తనకుందోయి
ప్రేమించే గుణముందోయి....
కాదోయీ ఆడది టాయి
చులకన చేయద్దుర భాయి
లేదోయ్ లవ్వుకి గ్రామరస్సలు
కొలవాలంటే లేదు మీటరు
పంచేకొద్దీ పెంచు గ్లామర్....బ్రదరూ
చూసేసెయ్... చూసేసెయ్
కాదోయ్ లైఫు జస్ట్ లాటరీ
ఎన్నో వింతల లాబొరేటరీ
అంతే తెలియని పెద్ద మిస్టరీ...వినరో
లవ్ చేసెయ్ లవ్ చేసెయ్... ॥ ధినక్॥

**రచన: చిన్ని చరణ్** **(3)** **గానం: సుజాత, బృందం**

ప : ఆ....ఆ....ఆ... ఒహో చందామామ
ఒక్క మాటుందమ్మా
నింగి దిగి రావమ్మా
నీకు చోటుందమ్మా
గుండెల్లో ....గుట్టంతా
విప్పేసి..... చెప్పమ్మా
గుర్తైనా.... లేనంటూ
దాక్కుంటే..... తప్పమ్మా ॥ఒహో చందామామ॥
చ: సీతాకోకా సిగ్గెందుకూ సిరి దరికి చేరేందుకూ....
నెమలి ఈకా.... నేనెందుకూ
నువ్వేరా నా ముందుకూ...
చిలకా గోరింకా రారే నా వంకా
చింతలు లేనే లేవింకా....
అని నే కోరంగా అన్నీ చేరంగా
నీవే వున్నావు ఇంకా ॥ఒహో చందామామ॥
చ: నా మనసులో తొలిసారిగా మొదలైన ఈ భావనా...
తెరలే తీసి తెలిపెయ్యవా తనతో మరీ నువ్వైనా
ఎపుడూ లేదమ్మా ఇంతటి ఆనందం
ఎదలో నిండింటీ స్నేహం... హోయ్
ఎదుటే వుంటున్నా ఏదో మోమాటం
కనుకే కోరా నీ సాయం ॥ఒహో చందామామ॥

## తారాగణం

**శివాజీ, లైలా,
గిరిబాబు, తనికెళ్ల భరణి, ఎమ్మెస్ నారాయణ,
ఎల్బీ శ్రీరామ్, ఏవీఎస్, బ్రహ్మానందం,
ధర్మవరపు సుబ్రహ్మణ్యం, ఆలీ, రాళ్లపల్లి, బెనర్జీ,
వేణుమాధవ్, కిశోర్‌దాస్, కొండవలస,
సారిక రామచంద్రరావు, బాబ్ రాజ్, కృష్ణభగవాన్,
రమాప్రభ, రజిత, రాగిణి, పద్మాజయంతి**

**రచన: సుద్దాల అశోక్ తేజ** **(4)** **గానం: సుజాత**

ప : అమ్మాయీ .. మనసంటే..... తీయని ఆశలు మోసే పల్లకి
పైకెపుడూ కనపడదు పై పై చూసే ఏ కళ్ళకీ...
కనిపించే అందాలన్నీ నా...... కోసమే...
అనిపించే చిలిపి వయసులో
వేల కోరికలు పూలై పూయవా....
చ: పెదవులతో పలికేదొకటీ
ఎదపరిచి తెలిపేదొకటీ
ఎవ్వరికీ చెప్పని కోరికలుండవా.....
కోరకనే దొరికేదొకటి
కోరినచో తీరేదొకటి
తీరనివి ఎపుడూ కోరికలే కదా...
నా మనసే తెలిసి ఎవ్వరో ..
నా..... వాడుగ
రావాలని లోలో కోరిక
కోరికే లేని జీవితం వృధా.... ॥ అమ్మాయీ॥
చ: మన బాపూ బొమ్మల వలెనే
లోకాలను గీసిన దెవరో...
ఎటు చూసినా చక్కని చిత్రమే కదా...
జగమంతా ఒక ఆలయము
మనమంతా తన దివ్వెలము
రాయైనా నమ్మితే వరమే ఇవ్వదా..
మనలను దీవించుట కోసం.. అణువణువూ......న
మనకోసం వున్నది దైవం..
గుండె కనులతో చూడగలిగితే...

**రచన: చంద్రబోస్** **(6)** **గానం: మాలతి**

ప: నచ్చినోడే నాగార్జున
చిచ్చుపెట్టి చంపినోడే చిరంజీవి
అమ్మ..అబ్బ...అప్పా
అమ్మ..అబ్బ...అప్పా... అమ్మ..అబ్బ...అప్పా....
అమ్మ..అబ్బ...అప్పా...అమ్మ.. అబ్బ.. అప్పా ॥ నచ్చినోడే॥
ఏలినోడే ఎంకటేషూ
బాధలన్నీ తీర్చినోడు బాలకృష్ణ
పట్టినాడే ఎన్టీయారూ...
పంటిగాటు పెట్టినాడే పవర్ స్టారూ...
నువ్వింక వారి లాగ పేరు తెచ్చుకో హొయ్యా...
నన్నింక ఆగలేక ఆరగించుకో హొయ్యా...
చ: అత్త పేరు జ్యోతిలక్ష్మి వామ్మో.... వాయ్యో...
మామ పేరు సుబ్బిశెట్టి బాబో.... నాయనో...
మొగుడిపేరే దద్దమ్మా
తగినజోడీ కాదమ్మా..
ఒళ్ళు రగిలిందోయమ్మా
ఇల్లువదిలెను ఈ గుమ్మా
ఇవాళె విడుదలైన బొమ్మ చూడరో హొయ్యా...
హే నరాల కెక్కుతున్న రిమ్మ దించరో హొయ్యా ॥నచ్చి॥
చ: మొదటి రీల్లో మాటలాడి ఉస్కోకిస్కో.....
అరెరె...రెండోరీల్లో రాటుదేలి రాస్కోపూస్కో...
లేదురయ్యో విశ్రాంతి
ఉందిరయ్యో సుఖశాంతి
వందరోజుల చిత్రమిదీ
పెద్దవాళ్ళకె మాత్రమిదీ
కథమొ పాతదంట కలరు కొత్తదీ హొయ్యా..
ముగింపు పాతదంట మలుపు కొత్తదీ హొయ్యా...

**రచన: చిన్ని చరణ్** **(5)** **గానం: దీప్తి గంగ**

అ: నా మనసే..........
నిన్నే కోరిందిగా............
ఈ వరసే...........
ఎంతో బాగుందిగా....
ఆ: తెలిసెనే తొలిసారిగా
ఇదే తొలి తొలి ప్రేమని
అ: మనసు మారాం చేసేనే
నీ జతై నిలవాలని ఈ రోజే......
ఆ: లవ్ మీ...... ఓ ప్రియా
మైనే .........
దిల్‌దియా.... ప్యార్‌కియా.. ప్యార్‌కియా.....
అ: రమ్మని పిలిచిన స్నేహమా
మనసిమ్మని అడిగిన వేళ మౌనమా.....
ఆ: ఇన్నాళ్లు ఈ మాటే నీతో చెప్పాలంటే
దారైనా చెప్పనంది ఈ దూరం
అ: ఏ చోట నువ్వున్నా నీతోటే నేనున్నా
అంటుంది నాలో చేరి నీ ప్రాణం
ఆ: నీతో.. ఈ క్షణం...
ఎంతో.....పరవశం....పరవశం... పరవశం
అ: కమ్మని కలలకు రూపమా
జత కమ్మని తరిమెను ప్రేమ... ప్రియతమా.......
ఆ: నువ్వంటే నేనేగా నేనంటే నువ్వేగా
మనలోన వున్నది ప్రేమేగా.....
అ: నీమాటే వింటున్నా నీవెంటే వస్తున్నా
నా పంచ ప్రాణాలన్నీ నువ్వేగా...
ఆ: టెల్‌మీ ఓ ప్రియా
మైనే.....ప్యార్‌కియా... ప్యార్‌కియా... ప్యార్‌కియా...
అ: నా మనసే.......... ఆ: నా మనసే.........
నిన్నే కోరిందిగా............ ఆ: నిన్నే కోరిందిగా............
ఈ వరసే........... ఆ: ఈ వరసే...........
ఎంతో బాగుందిగా.... ఆ: ఎంతో బాగుందిగా....
అ: తెలిసెనే తొలిసారిగా
ఇదే తొలి తొలి ప్రేమని
ఆ: మనసు మారాం చేసేనే
నీ జతై నిలవాలని ఈ రోజే......
అ: లవ్ మీ...... ఓ ప్రియా
మైనే .........
దిల్‌దియా..... ప్యార్‌కియా ప్యార్‌కియా.....

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| కథ | : | గోపీమోహన్,శివనాగేశ్వరరావు |
| స్క్రీన్‌ప్లే | : | గోపీమోహన్ |
| మాటలు | : | నివాస్, డా॥ సి.శ్రీనాథ్ |
| కెమెరా | : | జయకృష్ణ గుమ్మడి |
| సంగీతం | : | రోహిత్ రాజ్ |
| ఆర్ట్ | : | తోట తరణి |
| ఎడిటింగ్ | : | గౌతంరాజ్ |
| స్టిల్స్ | : | మురళి |
| కాస్ట్యూమ్స్ | : | హరి |
| మేకప్ | : | హరి |
| పి.ఆర్.ఓ. | : | పులగం చిన్నారాయణ |
| పబ్లిసిటి | : | రామ్ డిజి |
| కో-డైరెక్టర్ | : | సీతారామరాజు |
| నిర్మాత | : | ఎ.పూర్ణచంద్రరావు |
| దర్శకత్వం | : | శివనాగేశ్వరరావు |


పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.
లక్ష్మీ ప్రొడక్షన్స్
మిస్టర్ అండ్ మిసెస్
శైలజా కృష్ణమూర్తి
వాళ్ళకింకా పెళ్ళి కాలేదు
నిర్మాత: ఎ. పూర్ణచంద్రరావు దర్శకత్వం: శివనాగేశ్వరరావు సంగీతం: రోహిత్‌రాజ్
ఎ.పూర్ణచంద్రరావు
శివనాగేశ్వరరావు
రోహిత్‌రాజ్
సుద్దాల అశోక్‌తేజ
చంద్రబోస్
విశ్వ
చిన్నిచరణ్
హాసం
హాసం






# అమెరికన్లను అధిగమించిన లండన్ గాయని

# డిడో!

ఐదేళ్ళ తెలిసీ తెలియని వయసులో సంగీతం మీద ఆసక్తి కలిగి ఇంట్లోని 'రికార్డర్' ను దాచి పెట్టేసింది డిడో ఆర్మ్‌స్ట్రాంగ్. అయితే ఆమెను తండ్రి దండించలేదు సరికదా కూతురు ఆసక్తిని అర్థం చేసుకుని ఆ మరు సంవత్సరం గిల్ట్‌హాల్ మ్యూజిక్ స్కూల్‌లో చేర్పించారు. ఆరేళ్ళకు సంగీత శిక్షణ ప్రారంభించిన డిడో పదేళ్ళు వచ్చేసరికి పియానో, వయొలిన్‌తోపాటు రికార్డింగ్‌నూ నేర్చుకుంది.

1971 క్రిస్మస్ రోజున లండన్‌లో పుట్టింది డిడో. ఆమె తల్లి కవయిత్రి, తండ్రి ప్రచురణ కర్త. ఒక రోజున తన 'నిక్‌నేమ్' వెనక వున్న కథ తెలుసుకుందామె. ఆఫ్రికాకు చెందిన ఓ తెగ నాయకురాలి పేరది. ఆమె పోరాటంలో ప్రాణత్యాగం చేసింది. అలానే డిడో పేరులోనే ఫ్లోరియన్ అనే పదమూ వుంది. సహజంగా జర్మన్ పురుషులకి ఆపేరు పెడతారు. తల్లి దండ్రులు తనకీ రకమైన పేరు పెట్టి ఇబ్బందికి గురిచేశారని చిన్నతనంలో డిడో వాపోతుండేది!. తండ్రికి సంబంధించి ప్రచురణల వ్యవహారాలను గమనిస్తున్న ఆ పేరులోని గొప్పతనం కూడా తెలిసింది. పుస్తకాలు చదవటం- టెన్నిస్ ఆడడం ఆమె ఇతర వ్యాపకాలు. సహజంగా అబ్బిన సంగీతం వుండనే వుంది.

యుక్తవయసులో డిడోకి ఓ క్లాసికల్ మ్యూజిక్ ట్రూప్‌తో కలిసి ఇంగ్లాండ్ పర్యటించే అవకాశం కలిగింది. కాలేజీ చదువు పూర్తికాగానే యూనివర్శిటీలో 'లా' అధ్యయనం మొదలు పెట్టింది. అదే సమయంలో తన సోదరుడు రోల్లోకి సంబంధించిన ఫెయిత్‌లెస్ గ్రూప్ లో పాటపాడే అవకాశం డిడోకి లభించింది. 1995 లో ఫెయిత్ లెస్ గ్రూప్ రూపొందించిన తొలి ఆల్బమ్ 'రెవరెన్స్' లో 'ఫ్లవర్ స్టాండ్ మెన్' 'సాల్వమియ' అనే ట్రాక్స్‌ను డిడో పాడింది. ఈ తొలి ఆల్బమ్ ఐదు మిలియన్స్ అమ్ముడు పోయాయి.

1998 లో ఫెయిత్ లెస్ మరో ఆల్బమ్ 'సండే 8 పి.యమ్. లో 'పోస్ట్ కార్డ్స్', 'హెమ్ ఆఫ్ హిజ్ గార్మెంట్' అనే ట్రాక్స్‌ను డిడో గానం చేసింది. ఈ ఆల్బమ్స్‌ని మధ్యలో ఆమె 1997లో నిర్మాత క్లైమ్ డేలిస్‌ను కలిసి -తన సొంత బాణీలను వినిపించింది. ఆ తర్వాత అరిస్టా కంపెనీతో ఒప్పందం కుదుర్చుకుని తొలి ఆల్బమ్ 'నో ఏంజెల్' ను రూపొందించింది.

ఈ ఆల్బమ్ 1999 లో యు.ఎస్.ఎ.లోనూ సంవత్సరం తర్వాత అక్టోబర్ 2000 లో ఇంగ్లాండ్‌లోనూ విడుదలైంది. ఇందులోని రెండు ట్రాక్స్ టీవీలోనూ, సినిమాలోనూ దర్శనమిచ్చాయి. 'స్లైడింగ్ డోర్స్' అనే సినిమాలో 'థ్యాంక్యూ' అనే పాటను ఉపయోగించారు. అలానే 'హియర్ విత్ మీ ' పాటని రోజ్‌వెల్ అనే టీవీ షోకు థీమ్ ట్యూన్‌గా పెట్టుకున్నారు. ఈ టీవీ షో అమెరికాలోనే కాకుండా ఇంగ్లాండ్ లోనూ ప్రేక్షకాదరణ పొందింది.

అయితే డిడోని గుర్తింపు మాత్రం ఎమినెమ్ 'స్టాన్' వీడియో ఆల్బమ్ ద్వారానే వచ్చింది. ఎలినెమ్ తన ఆల్బమ్‌లో డిడో 'థ్యాంక్యూ' మ్యూజిక్ వీడియోను జత చేశాడు. ఈ వీడియోలో డిడో పాడింగ్ ప్రెగ్నెసీ సూట్‌ను ధరించి నటించింది. నదిలో పడిపోయే కారులోంచి ఓ గర్భిణిగా డిడో ఆఖరి క్షణంలో బయటపడడం..,దానిలో చిత్రీకరించటం జరిగింది.

అలానే 'హియర్ విత్ మీ' పాటనూ వీడియోగా చిత్రీకరించారు. ఈ రెండు వీడియోలను జతచేస్తూ స్పెషల్ ఎడిషన్‌గా 'నో ఏంజెల్' ఆల్బమ్ 2001 జనవరిలో విడుదలైంది. దీనితో పాటు బోనస్‌గా 'టేక్ మై హ్యాండ్'

పాటను, ఓ పిక్చర్ గ్యాలరీని అల్బమ్‌తో అందించారు. ఈ ఆల్బమ్ చాలా వారాల పాటు మ్యూజిక్ ఛార్ట్స్‌లో నెంబర్‌వన్ స్థానంలో వుంది. ప్రపంచ వ్యాప్తంగా ఈ ఆల్బమ్ 12 మిలియన్ల కాపీలు మించి అమ్ముడు పోయింది.

డిడో తొలి సింగల్ 'హియర్ విత్ మీ ' ఫిబ్రవరి 2001 లో విడుదలై నాలుగవ స్థానం పొందింది. ఆ వెంటనే మే 2001లో 'థ్యాంక్యూ' సింగల్ విడుదలై మూడవ స్థానం పొందింది. ఆ తర్వాతి నెలలోనే డిడో ఫెయిత్‌లెస్ రూపొందించిన 'అవుట్ రో స్పెక్టివ్' లో 'వన్ స్టెప్ టూ ఫార్' అనే ట్రాక్‌ని పాడింది. ఆ తర్వాత 'హంటర్' అనే సింగల్ ను సెప్టెంబరు 2001 లో విడుదల చేసిన- అది ముందు రెండు ఆల్బమ్స్ అంత గుర్తింపు , ఆదరణ పొందలేదు. కేవలం 17వ స్థానంలో సరిపెట్టుకోవాల్సి వచ్చింది. ఆ తర్వాత నవంబర్ 2001లో డిడో 'నో ఏంజెల్' లిమిటెడ్ ఎడిషన్‌ను విడుదల చేసింది. అందులో 'హంటర్' వీడియోను - 'ఆల్‌యు వాంట్', 'హానెస్టీ ఓకే', 'లైక్ వెర్షన్స్‌ను, 'క్రిస్‌మస్‌డే' అన్ ఎక్స్‌ట్రా ట్రాక్‌ను జత చేసింది. అదే నెలలో డిడో బెస్ట్ న్యూయార్క్ అవార్డ్‌ను యం.టీవీ యూరప్ మ్యూజిక్ అవార్డ్స్ నుండి అందుకుంది. ఆ సంవత్సరం ఆఖరి నెలలో 'నోఏంజెల్'లోని ఆఖరి సింగల్ ఆల్ యు వాంట్ 'ను డిడో విడుదల చేసింది. మొత్తం మీద ఆ యేడాది 'నో ఏంజెల్' 2 మిలియన్ ఆల్బమ్స్‌కు పైగా అమ్ముడు పోయింది. అంతే కాదు ప్రపంచ వ్యాప్తంగా 13 దేశాలలో మ్యూజిక్ ఛార్ట్స్‌లో నెంబర్ వన్ స్థానం పొందింది. 2002 ఫిబ్రవరిలో డిడో బెస్ట్ బ్రిటీష్ ఫిమేల్ సోలో ఆర్టిస్ట్ గాను, 'నో ఏంజెల్' బ్రిట్ అవార్డ్ 2002లో బెస్ట్ బ్రిటిష్ ఆల్బమ్ గానూ ఎంపికయ్యారు.

2002లో 'వన్ స్టెప్ టూ ఫార్' అనే సింగల్ ను డిడో ఫెయిత్ లెస్ కోసం పాడి విడుదల చేయగా, అది 6 వ స్థానం పొందింది. అదే సంవత్సరం ఏప్రిల్‌లో డిడో - బ్రిట్నీ స్పియర్స్ కోసం 'ఐయామ్ నాట్ ఏ గర్ల్, నాట్ ఎట్ ఎ ఉమెన్' అనే ట్రాక్‌కు పాటరాసింది. ఈ పాట రెండో స్థానం సంపాదించుకుంది.

దాదాపు రెండు సంవత్సరాల విరామం తర్వాత సెప్టెంబరు 2003న డిడో 'లైట్ ఫ్లాగ్' అనే సోలో సింగల్‌ను విడుదల చేసింది. ఇది గత రికార్డులను అధిగమిస్తూ రెండోస్థానం పొందింది. ఆ తర్వాత మూడు వారాల అనంతరం డిడో రెండో ఆల్బమ్ 'లైఫ్ ఫర్ రెంట్' విడుదల ప్రథమ స్థానం చేజిక్కుంచుకుంది. ఈ ఆల్బమ్ అమేజాన్ ప్రీ ఆర్డర్‌సేల్స్ రికార్డ్‌ను బద్దలు కొట్టింది. అలానే గడిచిన ఆరేళ్ళలో వేగంగా అమ్ముడు పోయిన ఆల్బమ్‌గానూ ఇది రికార్డ్ సృష్టించింది విడుదలైన మొదటి రోజునే 1,52,000 కాపీలు అమ్ముడు కాగా, మొదటివారంలో 3,50,000 కాపీలు విడుదలైనాయి.

2003 డిసెంబర్ లో 'లైఫ్ ఫర్ రెంట్' టైటిల్ ట్రాక్ రిలీజ్ అయ్యి 8వ స్థానం పొందింది. ఈ ఆల్బమ్ 2003లో బెస్ట్ సెల్లింగ్‌గా గుర్తింపును సంసాదించుకుంది. ఆ యేడాది 2.2 మిలియన్ కాపీలు అమ్ముడు పోయాయి. మొత్తం 20 దేశాలలో ఈ ఆల్బమ్ ప్రథమ స్థానం పొందింది.

2004 ఫిబ్రవరిలో డిడో రెండో రెండోసారి బెస్ట్ బ్రిటిష్ ఫిమేల్ సోలో ఆర్టిస్ట్‌గా ఎంపిక అయ్యింది. అలానే బెస్ట్ బ్రిటిష్ సింగల్‌గా 'వైట్ ఫ్లాగ్' బ్రిట్ అవార్డ్స్ 2004 నూ పొందింది. అయితే ఇదే యేడాది ఏప్రిల్ లో విడుదలైన డిడో సింగల్ 'డోం'ట్ లీవ్ హోయే' మాత్రం 25వ స్థానంలో తృప్తి పడాల్సివచ్చింది.

తన విజయాలను గురించి మాత్రం డిడో గొప్పగా చెప్పుకోదు. నిజానికి ఓనార్త్ లండన్‌కి చెందిన అమ్మాయి మల్టీ ప్లాటినమ్ డిస్కలను పొందుతుందనిగానీ, ప్రపంచ సంగీత రంగాన్ని జయిస్తుందని కానీ ఊహించి వుండరు. అయితే ఆల్బమ్ విడుదల చేయటమే తనకు గొప్ప విషయమని డిడో అంటుంది . "ఒక ఆల్బమ్‌ను రూపొందించటం ఎంత కష్టమో మాటల్లో చెప్పవేం. నేను రొల్లో చిన్న చెల్లెలుగా ఈ రంగంలోకి అడుగుపెట్టాను. నా నుండి ప్రజలు గొప్పగా ఏం ఆశిస్తారు? నేనోదో అద్భుతం చేస్తానని వాళ్ళెలా ఊహిస్తారు? అందువల్ల తొలి ఆల్బమ్ ' నోఏంజెల్'ను ఏ రకమైన బంధనాలు - అంచనాలు లేకుండా రూపొందించాను. నామీద ప్రజలకున్న నిరాసక్తత నాకు ఎంతో ఉపయోగపడింది. ఇక రెండో ఆల్బమ్ విషయానివస్తే ఒక సెక్సెస్, పొందాను కాబట్టి - మరెవ్వరూ నన్ను శాసించడానికి , నియంత్రించడానికీ సాహించలేదు. 'మొదటి ఆల్బమ్ తరహాలో మరోగొప్ప ఆల్బమ్ ఇస్తే చాలు అని' నాకు స్వేచ్ఛనిచ్చారు. అందువల్లే 'లైఫ్ ఫర్ రెంట్' కూడా బాగా వచ్చింది " అని చెప్పింది డిడో.

'లైఫ్ ఫర్ రెంట్' గురించి చెబుతూ "ఈ అల్బమ్ టైటిల్, అందులోని పాటలు.. నేను జీవితాన్ని ఎలా స్వీకరిస్తూన్నానో -ఎలా భవిష్యత్తును గడపాలనుకుంటున్నానో తెలుపుతాయి. సవాళ్ళను నిరంతరం ఎదుర్కొనడమే జీవితమంటే ! నిజానికి జీవితం నుండి తప్పుకోవటం -రాజీపడి దారినుండి వైదొలగడం చాలా తేలిక. కానీ నిత్య సమరానికి సిద్ధం కమ్మని... ఈ పాటలు నాకు గుర్తు చేస్తుంటాయి" అని చెబుతోంది డిడో!

ఆమె విజయానికి ఈ ఆల్బమ్‌ను లక్షలాది మంది ఆదరించడానికి కారణం ఏమిటో ఇక ప్రత్యేకంగా చెప్పుకోనక్కర్లేదు.

**- వి.అరుణ సత్యవతి**

## రాజా ఆడియో రివ్యూ

**సి**నీ పరిశ్రమలో సీనియర్ మోస్ట్, అండ్ సిన్సియర్ మోస్ట్ ప్రొడ్యుసర్‌గా పేరు తెచ్చుకున్న అట్లూరి పూర్ణచంద్రరావు నిర్మించిన చిత్రం యిది. వృత్తిపరంగా కామెడీకీ, వ్యక్తిపరంగా మంచితనానికి పేరుబడ్డ శివనాగేశ్వరరావు ఈ చిత్రానికి దర్శకుడు. ఈ ఇద్దరి కాంబినేషన్లో రాబోయే చిత్రం ఎలా ఉంటుందోనన్న కుతూహలం రెగ్యులర్ సినీ గోయర్స్‌కి ఉండటం సహజం.



వెల :రూ.32/-
విడుదల : మధుర ఎంటర్‌టెయిన్‌మెంట్

సినిమా విజయంలో యాభై శాతం ఆడియో ద్వారా తెలిసిపోతుందన్న అభిప్రాయం సర్వత్రా వ్యాపించివున్న ప్రస్తుత వాతావరణంలో వెరైటీ టైటిల్‌తో ముందుకొచ్చిందీ సినిమా. దానికింద 'వాళ్ళకింకా పెళ్ళికాలేదు' అనే ట్యాగ్ వల్ల ఇది మిస్సమ్మ (పాతది) అంత కామెడీగా ఉండొచ్చునన్న ఉత్సాహాన్ని ప్రేక్షకులలో కలిగించారు. ఇన్ని నేపథ్యాల మధ్య దీనికి సంగీతం ఎవరై ఉంటారన్న కుతూహలానికి మరింత ఆసక్తిని జోడిస్తూ రోహిత్ రాజ్ ని ప్రకటించారు.

ఈ రోహిత్‌రాజ్ ప్రేక్షకులకు కొత్తగానీ పరిశ్రమకు కాదు. యస్.రాజేశ్వరరావుగారి మనవడు; (కూతురి కొడుకు), కోటికి మేనల్లుడు. 'తాతపోలిక తప్పదందురు', 'మామ పోలిక మంచిదందురు' అన్నట్టు చూడ్డానికి కోటిలాగే ఉంటాడు కనుక తాతగారిలాగే మాంచి మ్యూజిక్ ఇస్తాడని ఆశపడడంలో తప్పేమిలేదు. కాకపోతే నిర్మాత, దర్శకుల అభిరుచులు, సూచనలు, ఎన్నుకున్న కథ, ప్రస్తుతం నడుస్తున్న ట్రెండ్-ఇన్నిటిని దృష్టిలో పెట్టుకుని స్వరపరచవలసిన అవసరం ఏ సంగీత దర్శకుడికైనా తప్పనిసరి కనుక తొలిచిత్రంతోనే 'అతని పూర్తిస్థాయి శక్తి సామర్థ్యాలు ఇవీ' అనే ఒక అవగాహనకు ఈ ఒక్క ఆడియోతో రాకూడదు. సో... ఇవన్నీ బేరీజు వేసుకుంటూ ఈ ఆడియోని వింటే...

సుద్దాల అశోక్ తేజ రాయగా టిప్పు, కల్పన పాడిన 'అసలే చలికాలం - ఆపై పడుచోళ్ళం -విజిలేసే సన్న నడుం' పాటని హిట్ సాంగ్ ఆఫ్‌ది ఆడియోగా చెప్పుకోవాలి. ఇది క్యాసెట్‌లో తొలిపాట. ఈ పాటకు ఆధార రాగం బృందావన సారంగ. రోహిత్‌రాజ్ తాతగారు రాజేశ్వరరావు 'మాయాబజార్' కోసం 'చూపులు కలిసిన శుభవేళా' పాటను ఈ రాగంలోనే స్వరపరిచారు. ఈ పాట తొలిచరణం(ఎకాయెకి చెప్పమ్మా) కి ముందు వినిపించే ఇంటర్ లూడ్‌ని శ్రద్ధగా వింటే తాతామనవళ్ళ 'రాగబంధం' ఓ శుభారంభంలా వినిపిస్తుంది . సుమంత్‌లో నాగేశ్వరరావులా కనిపిస్తుంది.

ఇక ట్యూన్‌లోనూ, ఆర్కెష్ట్రయిజేషన్‌లోనూ రోహిత్‌రాజ్- కీరవాణి, మణిశర్మల దగ్గర పనిచేసిన తన అనుభవాన్ని చూపించాడు. కావాలంటే జాగ్రత్తగా వినండి, రిథమ్స్‌లో కీరవాణి స్టయిల్ వినిపిస్తుంది. అలాగే పాట ఓపెనింగ్ మణిశర్మ స్వరపరిచిన 'బాబీ'లో 'కళ్లల్లో ద్రాక్షరసం, ఒళ్లంతా చెరుకురసం...' పాట ఎత్తుగడని, మొదటి చరణం పల్లవితో సహా పూర్తికాగానే వినిపించే ఇంటర్‌లూడ్ 'మురారి'లోని 'చెప్పమ్మా చెప్పమ్మా' పాటలో ప్రముఖంగా వినిపించే మ్యూజిక్ బిట్‌ని గుర్తు చేస్తూ ఆ అనుభవాలకు రోహిత్‌రాజ్ తన సొంతశైలిని ఎలా జోడించాడో తెలియజేస్తాయి. ఈ వ్యాఖ్య కాంప్లిమెంటు మాత్రమే; కామెంట్ కానేకాదు. ఇక పాడేవారి ఉచ్చారణా దోషాలు మాములే. 'తనం'కి, 'దనం'కి 'ధనం' కి తేడా తెలుసుకోవడం కష్టం-కల్పన పాడుతుంటే! ఎప్పుడూ స్పష్టంగా పాడే టిప్పు -పల్లవిలో 'చ'కారాలకు అనవసరంగా ఒత్తు లిచ్చి 'ఇదేంటీ -టిప్పు కూడానా?' అని మనసు కష్టపెట్టుకునేలా పాడాడు. అలా రెండో చరణం చివర్లో 'కొసరిందే కన్నెతనం' కి బదులు 'కొసిరిందే కన్నెతనం' అని పలకడంలో టిప్పు బాధ్యత ఎంతో మనం ఊహించలేము. గీత రచయితగా అశోక్ తేజ ఈపాట తెలివిగా రాశాడు. ఎంత నర్మగర్భంగా రాసినా శ్రోతలకు తెలియాల్సిన భావం తెలిసిపోతూనే ఉంటుంది. జాతీయస్థాయికి ఎదిగిన అశోక్‌తేజ ఇటువంటి ప్రయోగాల విషయంలో మరికాస్త నిగ్రహం చూపమని ప్రార్థన.

బృందంతో దేవన్ పాడిన 'ధినక్ దిన్ ధిల్లోరే'పాట యూత్ పాట. అయినా సరే వినడానికి హడావుడీ, గందరగోళం లాంటివి ఏవీ లేకుండా హాయిగా ఉంది. కాస్త లోతుగా వింటే సాహిత్యానికి ఎక్కువ మార్కులు వెయ్యాల్సిన అవసరం ఉందీ పాటలో. కొత్త ఎక్స్‌ప్రెషన్స్‌తో రచయితగా విశ్వ అందరి దృష్టి తన వైపుకి తిప్పుకుని, అభినందనలు అందుకుంటాడు. 'అసలే చలికాలం' పాటలో టిప్పు అనవసరంగా ఒత్తులిస్తే ఈ పాటలో దేవన్ అవసరమైన చోట ఒత్తు లెగర కొట్టి ఇబ్బందిపెట్టాడు.

బృందంతో సుజాత పాడిన 'ఒహో చందమామ ఒక్కమాటుందమ్మ' చాలా మంచి పాట. సంగీతం, సాహిత్యం, గానం సమపాళ్ళలో కుదిరాయి ఈపాటకి. ఈ సందర్భంగా ఆర్డీ బర్మన్‌ని ఓసారి గుర్తుచేసుకోవాలి. ఆయన తన సంగీతంతో ఎంత అడ్వాన్స్‌డ్‌గా ఉన్నా మెలోడీ కొచ్చేసరికి తనకంటూ ఓ శైలిని ఓ స్కూల్‌ని రుచి చూపించాడు. వాటికి ప్రభావితం కాని స్వరకర్తలు ఉండకపోవచ్చు.

ఈపాట వింటే రోహిత్ రాజ్‌కి కూడ ఆ ముక్కువ ఉందన్న అభిప్రాయం మరింత బలపడుతుంది. కావాలంటే చివర్న వచ్చే పియానో బిట్ వినండి. ఆర్డీ స్వరపరిచిన 'హరేరామ హరేకృష్ణ' లోని 'ఫూలోంకా తారోంకా సబ్‌కా కెహెనాహై' పాటలో 'జానే తూ యా జానేనా' అనే ట్యూన్ కచ్చితంగా గుర్తొచ్చి తీర్తుంది. అలాగే 'నీకు చోటుందమ్మా' దగ్గర మన ఘంటసాలగారు స్వరపరిచే శైలిని రోహిత్‌రాజ్ అనుసరించినందుకు గుండె ఆనందంతో ఉప్పొంగి పోతుంది. చిన్ని చరణ్ ఈ పాటను క్యూట్‌గా రాశాడు.

'అమ్మాయీ... మనసంటే... తీయని ఆశలు మోసే పల్లకి' పాటలో రోహిత్‌రాజ్ మంచి పనితనం కనబరిచాడు. పాటని ఓ నాలుగైదు సార్లు మననం చేసుకోగలగితే మెలొడీ ఎంత గొప్పగా గుప్పించాడో అవగాహన కొస్తుంది. ముఖ్యంగా వీణతో పలికించిన ఇంటర్‌లూడ్స్ చాలా బావున్నాయి. ఎక్కడ రెండు వాయిస్‌లు ఉంటే బావుంటుందో అక్కడ సుజాత వాయిస్‌నే పేస్ట్ చేస్తూ చక్కటి ఎఫెక్ట్‌ని తీసుకు వచ్చాడు. ఒంటరిగా ఉన్నప్పుడు హాయిగా పాడుకోవటానికి ఉపకరించే పాటల్లో ఇదొకటి. సుద్దాల అశోక్‌తేజ ఈ పాటలో మంచి మాటల్ని వాడేడు. 'రాయైనా నమ్మితే వరమే ఇవ్వదా, గుండె కనులతో చూడగలిగితే మనలను దీవించుట కోసం అణువణువున మనకోసం ఉన్నది దైవం - లాంటివి మచ్చుకు కొన్ని, సుజాత సోలో క్రెడిట్స్‌లో చెప్పుకోదగ్గ గీతమిది.

వరస మెలోడిలతో పాటు మాములు జనాలు పాడుకోడానికి హుషారుగా ఓ డ్యూయెట్ కూడా ఉంటే బావుంటుదన్న స్కీములో 'నా మనసే నిన్నే కోరిందిగా' పాట తయారయినట్టు అనిపిస్తుంది. 1972లో వచ్చిన 'జవానీ -దివానీ' హిందీ సినిమాలో ఆర్డీ బర్మన్ స్వరపరిచిన 'జా....నే జా డూంఢ్ తా ఫిర్ యహా' పాట విపరీతమైన హిట్. ఆ పాటలో 'తుమ్ కహా మై యహా' అంటూ మధ్యలో వచ్చే ట్యూన్‌ని కొద్దిగా మార్చి 'లవ్‌మీ ఓ ప్రియా... మైనే దిల్ దియా ప్యార్ కియా ప్యార్ కియా' గా ఈ పాటలో పెట్టుకోవడం ఆ స్కీమ్‌లో ఓ భాగంగానే భావించాలి. టిప్పు, గంగ పాడిన ఈపాటని చిన్ని చరణ్ రాశాడు.

సంగీతపరంగా అన్ని రకాల పాటలు సమకూరాయి కాబట్టి బాక్సాఫీస్ మసాలా పాట కూడా ఒకటి ఉంటే ఇక తిరుగేముంది!? ప్రస్తుతం నడుస్తున్న ట్రెండ్ ప్రకారం బాక్సాఫీస్ మాస్ మసాలా సాంగ్ అంటే మాలతి పాడాల్సిందే! ఈ స్కీమ్‌లో చూసుకుంటే మంచి స్కీమింగ్ చేయగల రచయిత అంటే ఇప్పుడు చంద్రబోసే! 'నచ్చినోడే నాగార్జున చిచ్చుపెట్టి చంపినోడు చిరంజీవి' అంటూ వెంకటేశ్‌ని, బాలకృష్ణని, పవన్‌కళ్యాణ్‌ని, ఎన్టీఆర్‌ని కూడా కలిపేసుకుని అందరి ఫ్యాన్‌ల చేత ఈల కొట్టించు కొనే లెవెల్లో చంద్రబోస్ తన కర్తవ్యాన్ని దిగ్విజయంగా నిర్వర్తించాడు. మాలతి యథాప్రకారం అదర కొట్టేసింది. ఎంత లెవెల్లో అంటే థియేటర్ నుంచి బైటి కొచ్చిన ప్రేక్షకుడు మిగిలిన పాటలన్నీ మర్చిపోయి ఈ పాటనే 'హమ్' చేసుకునేంత !

# 'మీరజాలగలడా' పాట పుట్టుపూర్వోత్తరాల గురించి...



కీ॥శే॥ స్థానం నరసింహారావు

**ప**ద్మశ్రీ స్థానం నరసింహారావు గారు రచించిన 'నటస్థానం' అనే గ్రంథంలో 'మీరజాలగలడా నా యానతి' పాట గురించి ఉన్న సమాచారం ఇది....

నాటక ప్రదర్శనాల్లో పాత్రల ప్రవేశాలకంటే, నిష్క్రమణాలకు ఏదో ఒక ప్రత్యేకత ఉండాలనీ, అది జనరంజకంగా వుండాలనీ, నా అభిమతం. ఈ అభిమతాన్ని సిద్ధించుకోవడానికి నా అభినయానికి ఎల్లప్పుడూ నా అన్వేషణాదృష్టి నిశితవంత మవుతూ వుండేది.

శ్రీకృష్ణతులాభారం నాటకంలో "సత్యభామ" తన భర్త శ్రీకృష్ణుడెల్లప్పుడూ తనకు స్వాధీనుడై ఉండటానికి, నారదోవదేశమెుంది, తదనుగుణ్యంగా భర్తృదాన వ్రతం చేయడానికి నిశ్చయించుకొంటుంది. ఈ నిశ్చయాన్ని పాడిమాటలతో చెప్పి నిష్క్రమిస్తూ వుండేది. ప్రేక్షకులు మౌనంగా విని వూరకుండేవారు.

యీ నిశ్చయంలో ఆ వ్రతం వల్ల తనకు లభింపబొయ్యే మనశ్శాంతినీ, మహదానందాన్నీ తలవూపులోనూ, నడకలోనూ వ్యక్తపఱచి లోనికి వెళ్ళిపోవడం నా మనస్సునకు అంతగా తృప్తి నివ్వడంలేదు. ఆ సంతోషాన్ని వ్యక్తం చేసే ఒక పాట ఏదైనా వుంటే, బాగుండుననిపించింది. అందులకై కొన్ని పాటల బాణీలు నా మనస్సులో నడిచాయి. కాని వాటి నడకలకు అక్కడ ప్రకటించవలసిన భావానికీ అవి సరిపడలేదు.

తుదకు గ్రామాఫోన్‌లో మరాఠీబాణీలో ఎవరో పాడిన పాట నడక నా మనస్సున కందింది. ఇది ఆ సమయ సందర్భానికి చాలా బాగున్నదనుకొన్నాను. ఆ బాణీకి కొన్ని స్థాయీ భేదాల సొగసుల ఊహించుకున్నాను. ఆ పాట ఇలా ఉండాలని నడకకై మననం చేసుకొన్నాను. దానికి మాటలు వ్రాయాలి. సరియైన మాటలు నా మనస్సున కందడం లేదు.

యీ ఆలోచనతోనే ప్రొద్దుటూరు నాటక ప్రదర్శనాలకు మా కంపెనీ వారమంతా బయలుదేరాం. మేమంతా కడప దాటి ఎఱ్ఱగుంట రైలుస్టేషనులో దిగాం. అక్కడనుంచి ఆరు రెండెడ్ల బండ్లలో కొంత దూరం వెళ్ళి, అక్కడ పెన్నానది దాటి అక్కడనుంచి బస్సులో ప్రొద్దుటూరికి వెళ్ళాలి. అలాగే బయలుదేరాం.

పెన్నానది వొడ్డున ఆగాం. పెన్నానది మోకాళ్ళ లోతుకు పైగా పారుతూవుంది. మేమంతా బండ్లుదిగి, ఆ నదిలో నడిచాం. సామాన్లబండ్లు మాత్రం నది దాటుతూన్నాయి. అది వెన్నెల రాత్రి అయింది. వెన్నెలగూడా వచ్చేసింది. మాలో కొంతమంది ఆవలి వొడ్డుకు చేరారు. మేము అయిదారుగురం మాత్రం నదిలో ఇసుకదిబ్బ మీద కూర్చుండి, బండ్లవంక చూస్తున్నాం. అందులో ఒక బండి మాత్రం సామాన్ల బరువుతో నదిమధ్యలో చక్రాలు కూరుకుపోయినాయి. ఎడ్లను ఎంత అదిలించినా వెనక నుండి, ఎందరు ముందుకు నెట్టినా ఆ బండి కదలలేదు - నావద్దవున్న మెంబర్ల దృష్టి అంతా ఆ బండిమీదనే వుంది. నా మనస్సు మాత్రం నాలో మనలుతున్న పాట నడకమీదుంది.

అది 1925 వ సంవత్సరం అనుకొంటాను. తేదీ, నెలా గుర్తుకు రావడంలేదు.

ఆ ఇసుకదిబ్బమీద, నేనూ, పిల్లలమర్రి సుందరరామయ్య, కొండపాక గోవిందరావు, భీమవరపు నరసింహారావు, (బి.యన్.ఆర్) మమ్ములను తీసుకొనివెళ్ళే కంట్రాక్టరు కూర్చున్నాము. మాలో గోవిందరావు నాకు బాల్యమిత్రుడు, నాకూ ఈతనికి చనువు మెండు, ఈతడు తులాభారం నాటకంలో రుక్మిణి పాత్రధారి. "ఒరే గోవిందాయ్! లేచివెళ్ళి వాళ్ళకు సహాయంగా ఆ బండిని కాస్త ముందుకు నెట్టరా!" అన్నాను.

అతడు లేవకుండా బద్ధకంగా, "ఎందుకులేరా అక్కడ అంత మంది వున్నారు. సుళువుగా వూతంమిద నెట్టేస్తార్లే" అన్నాడు. "అదికాదురా! నువ్వుగూడా దగ్గరుంటే, వాళ్ళకు మరింత బలంగా వుంటుంది" అన్నాను. అన్నా, అతడు లేవలేదు.

ఇంతలో సుందరరామయ్య అందుకొని, "వీడు నీ మాట వింటాడుట్రా?" అన్నాడు. నాకు కొంచెం కోపం వచ్చింది. "ఆ ! నా మాట

---

**అ**క్టోబరు 1-15 'హాసం' సంచికలో జమునగారి పాటల అనుభవాలు మధుర స్మృతుల్లోకి తీసుకువెళ్ళాయి ఎంతో ఆనందం కలిగించింది ఆ శీర్షిక.

'మీరజాలగలడా' పాటను గురించి రెండు సవరణలు మనవి చేయాలనుంది. స్వీకరింప ప్రార్థన.

1. ఈ పాటను నాటకంలో అభినయించిన స్థానం నరసింహారావుగారే రచించారని వారు రచించిన "నటస్థానం" గ్రంథంలో 214 నుంచి 219వ పుట వరకు సాగిన వృత్తాంతం చెబుతున్నది. దైతా గోపాలంగారు కాదని మనవి.

దీని జిరాక్సుకాపీలు వంపిస్తున్నాను పరిశీలింప మనవి.

2. అలాగే రెండో చరణంలో "ఈడతావు" కాదు, జలధి అనే శబ్దానికన్వయించేట్లుగా స్థానం వారు "ఈదతావు' అని రచించారు. గమనింప మనవి.

3. మూడవ చరణంలో 'మదినే' పదాన్ని కొంచెం ఎడం ఇవ్వవలసివుంటుంది. "అధర సుధార సమది నే గ్రోలగ "(రసము అది నే) అని ముద్రిస్తే ఇంకా భావస్ఫోరకం ఉంటుందని భావిస్తూ విన్నవించుకుంటున్నాను.

ధన్యవాదాలు

డా॥ పురుషోత్తమాచార్య
నల్గొండ

మిారజాలగలడా వీడు?'' అన్నాను అప్రయత్నంగా! అప్పుడు గోవిందరావు లేచి బద్ధకంగానే వెళ్ళేడు. అదే మాట నామనస్సులో పలుసార్లు నడిచింది. అక్కడ ఆ బండి ముందుకు కదిలింది.

నా మనస్సులో నడుస్తూన్న ఆ మరాఠీ బాణీకి ఈ "మిారజాలగలడా" అన్న మాట సరిపోయింది. తరువాత "నా యానతి" అన్నమాట స్ఫురించింది. దాని వెనుక, "సత్యాపతి" అన్న పదం కూడా స్ఫురించింది. తరువాత వూహించుకొంటూన్న మాటల్లో 'వ్రతవిధానమునకున్' అన్న మాట వచ్చేసింది. ఆ ''మునకున్'' అన్న పదం బాగా లేదనిపించింది.'మహిమన్' అన్న పదం వేస్తే బాగుంటుం దనిపించింది. ఇక సాఫీగా ఆ బాణీ యొక్క మొదటి పల్లవి నడిచింది. 'మిారజాలగలడా నా యానతి వ్రతవిధాన మహిమన్ సత్యాపతి' బాగున్నదనుకొన్నాను.

ప్రక్కనే సుందరరామయ్య వుండి, "ఏమిట్రా స్థానం! ఏదో పాటను లోపల లోపలే పాడుకుంటున్నావ్. అదేదో పైకి అనరాదట్రా! నేనూ వింటాను" అన్నాడు. "ఇప్పుడు కాదులేరా. ప్రొద్దుటూరు వెళ్ళాక, వినిపిస్తాన్లే" అన్నాను.

ఇంతలోనే మా బండ్లన్నీ ఆవలివొడ్డుకు చేరాయి. అంతా మరల ప్రయాణం సాగించాం. ప్రొద్దుటూరికి చేరాం. నాకు విశ్రాంతి గలిగినప్పుడల్లా విడిగా కూర్చుండి, మిగతా పాదాలు కొన్నింటిని వ్రాసి, మరల వాటిని కొట్టేస్తూ, మర్నాటికి ఆ పాటను పూర్తిచేశాను. హార్మోనియం మీద పాడాను. దానికి మరి కొన్ని సొగసులు స్థాయీ భేదాలను భీమవరపు



నరసింహారావు (హార్మోనిష్టు)మెరుగులు దిద్దాడు.

ప్రొద్దుటూరులో ప్రథమంగా "రోషనార" ప్రదర్శించిన తరువాత, రెండవ నాటకంగా 'శ్రీకృష్ణతులాభారం' ప్రదర్శించాం. అందులో సత్యభామ కు భర్తృదాన వ్రతం నారదుడు ఉపదేశించి వెళ్ళిన తరువాత, సత్యభామ సంతోషంతో లోపలికివెళ్ళే సమయంలో "మిారజాలగలడా నాయానతి" పాట పాడి నటించాను. ప్రేక్షకులు కరతాళధ్వనులు చేశారు. భేష్! బాగున్నదనుకొన్నాను. అయితే, వన్సుమోర్ అని మాత్రం అనలేదు. బ్రతికానురా భగవంతుడా ! అని సంతోషించాను. ఎందుకంటే ఆ కీర్తనలోని పాదాలు భావోద్రేకం వల్ల అక్కడక్కడా జ్ఞాపకానికి రాలేదు. ప్రామ్టింగు సహాయంతో ఎలాగో పూర్తిజేశాను. కాని తగినంత భావప్రకటన చెయ్యలేక పొయ్యాను.

తరువాత ప్రదర్శించిన తులాభారం నాటకాల్లో ఆ పాట నా భావాలకు వొదిగి, గుర్రం కదను త్రొక్కినట్లుగా లయతోనూ, తబ్లా ముక్తాయింపు ధ్వనులతోనూ, మరింత ఆకర్షణీయ మవుతూ వచ్చింది. ఆ పాటను ఎక్కడ పాడినా ప్రేక్షకుల వన్సుమోర్లనందు కోకుండా నా "సత్యభామ" నిష్క్రమించలేదు.

ఆపాట ఇది :

**మిారజాలగలడా నా యానతి॥**
**వ్రతవిధాన మహిమన్ ! సత్యాపతి॥ ॥మిార॥**
**నటన సూత్రధారీ!మురారి!**
**ఎటుల దాట గలడో నాయానతి!**
**వ్రతవిధానమహిమన్॥ ॥మిార॥**
**సుధాప్రణయ జలధిన్ వైదర్భికి!**
**నీద తావుగలదే!**
**నాతో నిక, వాదులాడగలడే !**
**సత్యాపతి॥ ॥మిార॥**
**మధుర మధుర మురళీగాన రసాస్వాదనమున**
**అధర సుధారసమది నే గ్రోలిన ॥మిారజాలగలడా॥**

ఈ పాటతో కొన్ని వందల సార్లు ప్రదర్శింపబడిన శ్రీకృష్ణ తులాభారం నాటకంలో నా "సత్యభామ" ప్రౌఢభామ అయిందని రసజ్ఞులు మెచ్చుకుంటూ వుండేవారు. ఈ పాటనే గ్రామాఫోన్ రికార్డు నిచ్చాను.

దీనిని నేను ముందుగా ప్రచురించని కారణంవల్ల నాకు తెలుపకుండానే, కపిలవాయి రామనాథశాస్త్రి గ్రామాఫోన్‌లో రికార్డిచ్చారు. అది అతని గాత్రశబ్దంతో మరింత ప్రచారంలోకి వచ్చింది. ●

---

# బాణీ ముత్యాలు

**సేకరణ : పి.గిరి, హైదరాబాద్**



సినారె

వెలుగున ఉన్నంతవరకే నీ నీడ నీకు తోడుగా ఉంటుంది
చీకటిలో నీవు సాగితే అది నీకు దూరమౌతుంది
ఈ పరమార్థం తెలిసిననాడే బ్రతుకు సార్థకమౌతుంది

**చిత్రం** : చదువు - సంస్కారం
**పాట పల్లవి** : దీపానికి కిరణం ఆభరణం
రూపానికి హృదయం ఆభరణం



రాజశ్రీ

చందమామ రాని నాడు లేదులే వెన్నెల
ప్రేమనేదే లేనినాడు బ్రతుకులే వెలవెల

**చిత్రం** : పెళ్ళిరోజు
**పాట పల్లవి** : ఆనాటి చెలిమి ఒక కల కలకాదు
నిజము ఈ కథ



సిరివెన్నెల

ఇష్టం వుంటే చేదు కూడా తీయనే
కష్టం అంటే దూది కూడా భారమే
లక్ష్యమంటు లేని జన్మే దండగా
లక్షలాది మందిలేరా మందగా
పంతంపట్టి పోరాడందే కోరిన వరాలు పొందలేవు కదా

**చిత్రం** : సంబరం
**పాట పల్లవి** : పట్టుదలతో చేస్తే... సమరం
తప్పకుండా నీదే విజయం

# జధ్యావ మారుత ⑨

## సీమాంతర ప్రేమాయణం



## పడమటి సంధ్యారాగం

జన్మభూమిని, జన్మనిచ్చిన తల్లితండ్రుల్ని, బంధుమిత్ర వర్గాన్ని వదిలేసి ఎక్కడో సముద్రాలకవతల వృత్తిరీత్యా వుండాల్సి వచ్చినా తమ మూలాల్ని, అనురాగాల్ని సర్వసాధారణంగా ఎవ్వరూ మరిచిపో(లే)రు. మన సంస్కృతిలో వున్న గొప్పతనమే అలాంటిది. తెలుగువాళ్లకైతే ఈ సంబంధాల గాఢత మరీ ఎక్కువ.

వాన చుక్కకోసం అంగలార్చుకుంటూ ఎదురుచూస్తున్న నేలలాగా.... ఎవరైనా తెలుగువాడు కనబడితే చాలు ఆత్మీయంగా కౌగిళ్ల కరచాలనం చేసుకుంటారు. తెలుగుమాట వినబడితే చాలు మనసు చెవులు రిక్కించి మరీ ఆస్వాదిస్తారు.

ముఖ్యంగా కళాకారులకైతే తమకు నచ్చిన కళతో లక్షల మైళ్ళ కొద్దీ దూరాన్ని తగ్గించేసుకుని దగ్గరగా వున్నట్టుగా అనుభూతి చెందుతారు.

అలా రసాస్వాదన కలిగిన కొందరు ప్రవాసాంధ్రులకి 'ఆంధ్రా టూ అమెరికా' నేపథ్యంలో ఓ సినిమా చేయాలనిపించింది.

ఇక ఇక్కణ్ణుంచీ అసలు కథలోకి ఎంటరవుదాం.

జంధ్యాల కీర్తి కిరీటంలో కలికి తురాయిగా నిలిచే 'ఆనందభైరవి' చిత్ర జైత్రయాత్ర సందర్భంగా యూనిట్ మొత్తం అమెరికా వెళ్ళారు. ప్రవాసాంధ్రులంతా కలిసి వీళ్ళని ఘనంగా సత్కరించారు. జంధ్యాల దంపతులు, శాండిల్య, అతని సోదరుడు శివ, సీతాదేవి, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం దంపతులు, శైలజ, మాధవపెద్ది సురేష్ దంపతులు, ఆర్కెస్ట్రా సభ్యులు ఈ జైత్రయాత్రలో పాల్గొన్నారు.

అక్కడి ప్రవాసాంధ్రుల కోరిక మేరకు వారితో కలిసి ఓ చిత్రం తీద్దామనుకున్నారు జంధ్యాల. అలా కాకతాళీయంగా ఓ సినిమాకి రూపకల్పన జరిగింది. ఆ నిర్ణయమే 'పడమటి సంధ్యారాగం' చిత్రం. అమెరికాలో స్థిరపడ్డ తెలుగువారు 'ప్రవాసాంధ్ర చిత్ర' పతాకంపై ఈ చిత్రాన్ని రూపొందించారు. బేనర్ పేరు తొలుత 'అమెరికా ఆంధ్రా కంబైన్స్' అనుకున్నారుగానీ, తర్వాత 'ప్రవాసాంధ్ర చిత్ర' గా నిర్ణయించుకున్నారు.

ఈ చిత్రం చేయాలన్న ఆలోచన రాగానే జంధ్యాల వెనువెంటనే అందుకు తగ్గ

ప్రయత్నాలు ప్రారంభించారు. అందులో మొదటిది సంగీతం. జైత్రయాత్రలో యూనిట్‌తో పాటు వెళ్ళిన ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యంను సంగీత దర్శకుడిగా అనుకుని, అప్పటికప్పుడు సదాశివబ్రహ్మేంద్ర స్వామి 'పిబరే రామరసం' గీతాన్ని తీసుకుని పాపులర్‌గా ఉన్న ట్యూన్‌ను మార్చి కథానుగుణంగా ఆర్కెస్ట్రయిజేషన్ జత చేసి అక్కడికక్కడే రికార్డు చేయించడం కూడా జరిగిపోయింది.

అలా ఈ పాట అమెరికాలో రికార్డు చేయబడిన తొలి తెలుగు సినిమాపాటగా చరిత్రలో నిలిచిపోయింది. 'పిబరే రామరసం' పాటని సాయంత్రం 6-9 కాల్షీట్‌లో వాషింగ్టన్ డి.సి. లోని ఒమేగా స్టూడియోలో బాలు, శైలజ పాడగా రికార్డు చేయడం జరిగింది. సౌండ్ ఇంజనీర్ షెయిన్ ఒక మహిళ. ఒక్క అసిస్టెంటైనా లేకుండా ఆవిడే అద్భుతంగా రికార్డు చేసారు. బాలుతో పాటు కచేరీలు కోసం వచ్చిన వాద్య కళాకారులే ఈ రికార్డింగులో పాల్గొన్నారు.

అమెరికాలో ఆర్కెస్ట్రా పేమెంట్స్ చాలా ఎక్కువ. వాళ్ళకిచ్చే డబ్బులతో ఓ లో-బడ్జెట్ సినిమానే తీసేయొచ్చు. అందుకే 'ఆనందభైరవి' ట్రూప్‌నే ఆ పాటకి ఆర్కెస్ట్రాగా ఉపయోగించు కున్నారు జంధ్యాల. పాట రికార్డింగ్ మొత్తం 3 గంటల్లో పూర్తయిపోయింది.



విజయశాంతి, టామ్

## పాత్రలు - పాత్రధారులు

| | | |
|---|---|---|
| సంధ్య | : | విజయశాంతి |
| క్రిస్ | : | టామ్ (వాషింగ్టన్) |
| రెనాల్డ్ | : | శివమణి |
| ఆదినారాయణ | : | గుమ్మలూరి శాస్త్రి (వాషింగ్టన్) |
| రామారావు | : | అబ్దుల్లా (వాషింగ్టన్) |
| ఐస్‌క్రీమ్ ఓనర్ శేషగిరిరావు | : | శేషగిరిరావ్ (వాషింగ్టన్) |
| గణపతి | : | విజయ్ (వాషింగ్టన్) |
| సుధ | : | ఆశాజ్యోతి (వాషింగ్టన్) |
| అనిత | : | సుధేష్ణ (వాషింగ్టన్) |
| నటనాలయం మేనేజర్ | : | వేలు (అతిథి పాత్ర) |
| లక్ష్మి | : | సుధ |
| డాక్టర్ రవి | : | రవి చిట్టూరి (శాన్‌ఫ్రాన్సిస్కో) |

మరియు

వాషింగ్టన్ చెందిన జాన్‌జిక, గాత్‌మన్, ఎలిజబెత్, బిందు, జ్యోతి (బెంగళూరు), మాస్టర్ బెండ్‌మన్, (సెయింట్ లూయిస్), బేబీ రోహిణి (సెయింట్ లూయిస్), విజయ్ కొరారి (వాషింగ్టన్), భూషణ రావ్ (సెయింట్ లూయిస్), రామాశాస్త్రి (వాషింగ్టన్) సీతశాస్త్రి(వాషింగ్టన్), మృణాళిని(వాషింగ్టన్)

శ్రీనివాసమూర్తి (వయొలిన్ ఎరేంజర్ - ప్రస్తుతం ఎ.ఆర్. రహమాన్‌కు అసిస్టెంట్. ఇ.వి.వి. దర్శకత్వంలో వచ్చిన 'మా ఆవిడ మీదొట్టు -మీ ఆవిడ చాలా మంచిది' సినిమాకి ఈయనే సంగీత దర్శకుడు.) డ్రమ్స్ శివమణి (వరల్డ్ ఫేమస్ డ్రమ్మర్, ఈ సినిమాలో నీగ్రో అబ్బాయిగా నటించాడు కూడా) సూర్యనారాయణ (ఫ్లూట్) మాధవపెద్ది సురేష్ (ఎకోస్టిక్ పియానో కీబోర్డ్ ), ప్రసాద్ (తబలా), రాజా (రిథమ్ బాక్స్), సాలూరి వాసూరావు (బేస్ గిటార్), జోనఫ్ (గిటార్)ల సహకారంతో పాశ్చాత్య, భారతీయ సంగీత సమ్మేళనంతో ఈ పాట రికార్డు చేశారు. అది కూడా మంగళంపల్లి బాలమురళీ కృష్ణ చేసిన రాగంలోనే చేసినా సినిమా పరంగా కొద్ది మార్పులు చేశారు బాలు.

అమెరికాలో అప్పుడు పాపులర్ బ్లైండ్ పియానో ప్లేయర్ స్టీవ్‌వండర్‌కు సంబంధించిన ఓ పాపులర్ పియాన్ బిట్‌తో ఆ పాట ప్రారంభమవుతుంది 'పిబరే రామరసం' పాట జాగ్రత్తగా వినండి. జంధ్యాల, బాలుల తమాషా అర్థమవుతుంది.

ఈ సినిమాలో హీరో అమెరికన్ కాబట్టి స్టీవ్ వండర్ పాడిన 'I want to say I love you' పాట థీమ్ తీసుకుని, దాన్ని పియానో మీద వాయిస్తూ వయొలిన్‌పై అనుసరించారు బాలు.

"జంధ్యాల - బాలు కాంబినేషన్ ఎక్స్‌ట్రార్డినరీ కాంబినేషన్. ఈ కాంబినేషన్‌లో ఎన్నో మంచి పాటలు రూపొందాయి. నాకు తెలిసి వీళ్ళ కాంబినేషన్‌లో ది బెస్ట్ సాంగ్ ఇదే" అని చెబుతారు మాధవపెద్ది సురేష్. ఈ సినిమాకి ఎకోస్టిక్ పియానో కీ బోర్డ్ ప్లేయర్‌గా పనిచేసిన మాధవపెద్ది సురేష్‌ను జంధ్యాలే ఆ తర్వాత 'హై హై నాయకా'తో సంగీత దర్శకునిగా పరిచయం చేశారు. ఆ విశేషాలు మున్ముందు తెలుసుకుందాం.

ఇక్కడ మరో ఇంపార్టెంట్ విషయం చెప్పాలి. 'పిబరే రామరసం'తో పాటు అన్ని పాటలూ అమెరికాలోనే రికార్డ్ చేయాలనుకున్నారు. అయితే పాటలకి బోలెడంత ఖర్చు అవుతుందని విరమించుకున్నారు. ఈ ఒక్క పాటకే సుమారు వెయ్యిడాలర్లు ఖర్చయ్యింది. ఆర్కెస్ట్రాలో అప్పుడు ఎక్కువ మొత్తం పారితోషకం (200డాలర్లు) తీసుకుంది ఒక్క మాధవపెద్ది సురేషే.

అమెరికాకు వెళ్లిన ఓ పల్లెటూరి యువతి పెద్దలనెదిరించి అక్కడి యువకుడిని పెళ్ళి చేసుకుని ప్రపంచం అంతా వసుధైక కుటుంబం అని చెప్పటమే క్లుప్తంగా ఈ చిత్రకథ.

అటుపై టైటిల్ గురించి చర్చ మొదలయింది. టైటిల్ ఏం పెడదామా అన్న ఆలోచనతో ఎవరికి వారు పోటీలు పడి రకరకాల టైటిల్స్ చెప్పారు. 'ఆవకాయ - పిజా', 'ఆంధ్రా - అమెరికా'.... ఇత్యాది టైటిల్స్‌ని వాళ్లు చెబుతుంటే జంధ్యాల సరదాగా నవ్వుకున్నారు. అందరూ చెప్పడం పూర్తయ్యాక ఎక్కడో వెనుక



**విజయశాంతి**

కూర్చున్న ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం సడన్‌గా లేచారు.

ఈ చిత్రంలో హీరోయిన్ పేరు సంధ్య కనుక, పాశ్చాత్య దేశానికి చెందిన యువకుణ్ణి పెళ్ళి చేసుకుంటుంది కనుక - 'పడమటి సంధ్యారాగం' అనే టైటిల్ అయితే బాగుంటుందని ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం సూచించగా, అదే పేరుని చిత్రానికి జంధ్యాల ఖాయం చేశారు. టైటిల్ చెప్పినందుకుగాను బాలుకి నిర్మాతలు చిరుకానుకగా 116 యు.ఎస్. డాలర్లు ఇచ్చారు.

అప్పటికి అమెరికాలో 21 ఏళ్ళుగా వైబ్రేషన్ ఇంజనీర్‌గా పనిచేస్తున్న గుమ్మలూరి శాస్త్రి, నాలుగేళ్ళుగా ఇంజనీర్‌గా పనిచేస్తున్న మీర్ అబ్దుల్లా ఈ చిత్రానికి నిర్మాతలుగా వ్యవహరించారు. "అమెరికాలో వున్న తెలుగు కళాకారులందర్నీ పోగుజేసి తీరిక సమయాల్లో తెలుగు నాటకాలు ప్రదర్శిస్తుండేవాళ్ళం. మేమంతా కలిసి ఓ తెలుగు సినిమా చేద్దామని ఆలోచిస్తున్న సమయంలో జంధ్యాల పరిచయం కావడం మా అదృష్టం. 'పడమటి సంధ్యారాగం' అలా మొదలయ్యింది." అని గుమ్మలూరి శాస్త్రి చెప్పారు.

ఈ చిత్రంలో నాయికగా తొలుత సుహాసిని అనుకున్నారు. చివరికి విజయశాంతి 'సంధ్య' గా చక్కగా ఇమిడిపోయారు. పదహారణాల తెలుగుపిల్లలా ఆ చురుకుతనం, కొంటెతనం తన హావభావాల్లో అందంగా ప్రదర్శించి భేష్ అనిపించుకున్నారు. ఆమెకిది 64వ చిత్రం. ఇక విజయశాంతి తండ్రిగా గుమ్మలూరి శాస్త్రి, బాబాయ్‌గా మీర్ అబ్దుల్లా నటించారు. ఈ మీర్ అబ్దుల్లా అమెరికాలో అనేక ప్రదర్శనల్లో శ్రీకృష్ణదేవ రాయలు పాత్ర పోషించి పేరు తెచ్చుకున్నారు. విజయశాంతి పిన్నిగా చేసినావిడ పేరు ఆశాజ్యోతి రంగారావు. అమెరికాలో వీళ్ళింట్లోనే 'పిబరే రామరసం' పాట మ్యూజిక్ సిట్టింగ్స్, కొంత షూటింగ్ కూడా జరిగాయి.

పడమటి సంధ్యారాగం, చిన్నికృష్ణుడు - రెండు సినిమాల్లోనూ వేలుకి వేషాలున్నాయి. వీసా రాక కొన్ని డేట్లు వేస్ట్ అయ్యాయి. మళ్ళీ షెడ్యూల్ వేస్తే వేలుకి కుదర్లేదు. జంధ్యాల ఎలాగోలా డేట్లు అడ్జెస్ట్ చేసుకుని అమెరికా రమ్మన్నారు. వెళ్ళాలని వేలుకి వుంది. అయితే అప్పుడాయన ఐదు సినిమాలు చేస్తున్నారు. సినిమా పరిశ్రమకు వచ్చిన మొదటి రోజు జంధ్యాల తనతో "ఒకసారి ఒప్పుకున్న డేట్లు ఎప్పుడూ మార్చవద్దు. అలా చేస్తే నిర్మాత నష్టపోతాడు" అన్న మాటలు గుర్తుకొచ్చాయి.

ఈ విషయమే ఈ సందర్భంలో ఆయనకు గుర్తుచేశారు వేలు. చివరికి ఓ చిన్న సీన్‌తో వేలుని సరిపెట్టాల్సి వచ్చింది. వేలు ఇందులో అతిథి పాత్రలో నటనాలయం మేనేజర్‌గా కనిపిస్తారు. 'నువ్వు అమెరికాలో స్థిరపడలేవు' అంటూ గుమ్మలూరి శాస్త్రికి అమెరికా వాళ్ళ ఆచారవ్యవహారాల్ని తిడుతూ ఫ్లాష్‌బ్యాక్‌లో హితబోధ చేసే పాత్ర ఆయనది. "మా గురువు గారు జంధ్యాల చెప్పిన మాటల్ని ఇప్పటికీ తూచా తప్పకుండా పాటించడం నా కెరీర్‌కి ప్లస్సో, మైనస్సో - చెప్పలేను'' అని వేలు అంటారు.

ఇందులో హీరో పాత్రకు ముందుగా ఒక అమెరికన్ ఔత్సాహిక నటుడ్ని ఎంపిక చేశారు. అయితే ఆఖరి నిమిషంలో అతనికి హాలీవుడ్ సినిమాలో ఆఫర్ రావడంతో, హీరోగా ఎవరిని పెట్టుకోవాలా అన్న సమస్య ఏర్పడింది. చివరికి రంగస్థల నటనలో డిప్లమో వున్న 20 ఏళ్ళ అమెరికన్ యువకుడు 'టామ్' ని ఎంపిక చేశారు.

ఈ సినిమా హీర్ టామ్ ఆ మధ్య 'డీప్

ఆ: ఈ తూరుపు ఆ పశ్చిమం
సంగమించిన ఈ శుభవేళ
పడమటి సంధ్యారాగాలేవో పారాణి పూసెనులే
అ:యూ ఆవకాయ్
మి ఐస్‌క్రీమ్
దీసీజ్ ద హాట్ అండ్ స్వీట్ లవ్స్ డ్రీమ్
యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ హార్ట్స్ వియ్ హేవ్
లైక్ ఇండియన్ నమస్తే
ఆ:ఆకశంలో తార
సుడిగాలికారని దీపం
గుడిలేని దైవంకోసం
ఒడి చేరుతున్నదిలే
సాగరంలో కెరటం ఉప్పొంగిన నా హృదయం
అలిసేది కాదనురాగం ఈ జన్మ సంగీతం
గ్రహణాలు లేని ఆ తారలన్ని
గగనాన కలిసే ఈ వేళలోని
కలిసింది ఈ బంధం
కలిసింది ఈ బంధం ॥ ఈ తూరుపు॥
అ:లేడీస్ అండ్ జెంటిల్మేన్
దీసీజ్ యువర్ కెప్టెన్ స్పీకింగ్ ఫ్రమ్ ద కాక్‌పిట్..
అన్‌ఫార్చ్యునేట్లీ వియ్ కాట్ ఫైర్
ఆన్ ఆల్ ద ఇంజన్స్...
ఐ ఎడ్వైజ్ యు టు పుట్ ఆన్ యువర్ పారాచూట్స్
అండ్ బెయిల్ ఔట్ ఇమ్మీడియట్లీ
ఆ:చైత్ర కోయిలలెన్నో మైత్రి వేణువులూదె
మనసైన పాటలకోసం మౌనాల ఆశలు పూసె
ఏడేడు రంగుల దీపం ఆ నింగిలో హరి చాపం
అరుణాల రుధిరంతోనే ఋణమైనదీ ప్రియబంధం
ఏ దేశమైనా ఆకాశమొకటే
ఏ జంటకైనా అనురాగమొకటే
అపురూపమీ ప్రణయం
అపురూపమీ ప్రణయం ॥ఈ తూరుపు॥



'పిబరే రామరసం' పాట రికార్డింగ్ సమయంలో శివమణి, మాధవపెద్ది సురేష్, జంధ్యాల తదితరులు

## డబ్బింగ్ స్పెషల్

| ఆర్టిస్టులు | - | డబ్బింగ్ చెప్పిన వారు |
|---|---|---|
| విజయ శాంతి | - | సరిత |
| గుమ్మలూరి శాస్త్రి | - | సుత్తి వీరభద్రరావు |
| మీర్ అబ్దుల్లా | - | జంధ్యాల |
| శేషగిరిరావు | - | పొట్టిప్రసాద్ |
| విజయ్ | - | శుభలేఖసుధాకర్ |
| ఆశాజ్యోతి | - | డబ్బింగ్ జానకి |

| | | |
|---|---|---|
| రిలీజ్ | : | 11-4-1987 |
| నిర్మాణప్రాంతాలు | : | అమెరికాలోని వాషింగ్టన్, సెయింట్ లూయిస్ ,డెట్రాయిట్, పిట్స్‌బర్గ్ |
| వర్కింగ్ డేస్ | : | 45 రోజులు |



శివమణి, విజయశాంతి

## సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| బేనర్ | : | ప్రవాసాంధ్ర చిత్ర |
| సమర్పణ | : | జి.సుబ్బారావు |
| సంగీతం | : | యస్.పి. బాలసుబ్రహ్మణ్యం |
| సంగీత సహకారం | : | శ్రీనివాసమూర్తి |
| ఎడిటింగ్ | : | గౌతంరాజు |
| కథ | : | జంధ్యాల |
| పాటలు | : | హరికీర్తనాచార్య అన్నమయ్య (ముద్దుగారే) సదాశివ బ్రహ్మేంద్రయోగి (పిబరే రామ రసం) వేటూరి (ఈ తూరుపు ఆ పశ్చిమం) లైఫ్ ఈజ్ షాబీ (ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం) |
| నేపథ్యగానం | : | బాలు,జానకి, శైలజ |
| సాంగ్ రికార్డింగ్ | : | ఏ.వి.యం (ఆర్.ఆర్) ప్రసాద్ (70 యం.యం) ఒమేగా స్టూడియోస్ (వాషింగ్టన్) |
| డైలాగ్ రికార్డింగ్ | : | సురేష్ మహల్(సతీశన్) |
| రీ - రికారింగ్ | : | సెల్వరాజ్, ప్రసాద్ (70 యం.యం) |
| ట్రావెల్ అరేంజ్‌మెంట్స్ | : | ట్రావెల్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా డి.వి.యస్. శర్మ -సుభాష్ |
| ప్రెస్ పబ్లిసిటీ | : | ఐ. అర్జునరావు |
| స్టిల్స్ | : | గిరి |
| మేకప్ | : | రత్నం |
| డాన్స్ | : | సుజాత(సెయింట్ లూయిస్) |
| అసోసియేట్ డైరెక్టర్ | : | బి.యస్. నిష్టల |
| కో - డైరెక్టర్ | : | యు.వి.పాణి |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : | పి. దివాకర్ |
| నిర్వహణ | : | యార్లగడ్డ ప్రసాదరావు |
| నిర్మాతలు | : | గుమ్మలూరి శాస్త్రి, మీర్ అబ్దుల్లా |
| రచన-దర్శకత్వం | : | జంధ్యాల |

బ్లూ సీ' అనే హాలీవుడ్ సినిమాలో చేసాడు. ఆ సినిమాని తెలుగులో 'సముద్రపు దొంగలు'గా డబ్ చేసి విడుదల చేసారు కూడా. ఈ సినిమా పబ్లిసిటీలో 'పడమటి సంధ్యారాగం' హీరో అని వాడుకున్నారు.

మద్రాసు నుంచి 16 మంది సభ్యులగల యూనిట్ బయలుదేరి వాషింగ్టన్‌లో విడిది చేసి షూటింగ్‌లో పాల్గొన్నారు. 1986 ఆగస్ట్ 3న అమెరికాలో షూటింగు ప్రారంభమైంది. 45 రోజుల పాటు వాషింగ్టన్, చికాగో, న్యూయార్క్ నగరాల్లో, నయాగరా జలపాతం ప్రాంతాల్లో షూటింగ్ జరిపారు. అలాగే 'నాసా' గేటు బయట ఎంతో ప్రయాస కోర్చి కొన్ని దృశ్యాలను చిత్రీకరించారు. చెట్లు వింత వింత రంగులతో మారిపోయే ప్రదేశంలో కొంత భాగాన్ని షూట్ చేశారు. ప్రపంచ అద్భుతాల్లో ఒకటైన 'డిస్నీలాండ్'లో కూడా షూటింగ్ జరుప ప్రయత్నించారు గానీ అనుమతి దొరకలేదు. పిట్స్‌బర్గ్‌లోని వెంకటేశ్వర ఆలయంలో హీరో, హీరోయిన్ల వివాహాన్ని షూట్ చేశారు. పశ్చిమ వర్జీనియాలో 'హరేరామ హరేకృష్ణ' బృందపు బృందావనంలోనూ కొంత షూటింగ్ చేశారు.

ఈ షూటింగ్ సందర్భంలో ఓ సంఘటన గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. మెర్లిన్ యూనివర్శిటీ ప్రాంతంలో షూటింగ్ ప్రారంభించినపుడు ఈ యూనిట్ సభ్యుల హడావిడి చూసి స్థానిక రక్షక భటులు అమెరికన్లని హిందుమతానికి మారుస్తున్న ప్రయత్నం జరుగుతోందని అనుమానించారు. వాళ్ళ అనుమానం పోగొట్టడానికి యూనిట్ వాళ్ళ తలప్రాణం తోకకి వచ్చింది. ఈ సినిమాతో పాటు 'చిన్నికృష్ణుడు' కూడా అమెరికాలోనే షూటింగ్ చేశారు. ఈ రెండు సినిమాల నిమిత్తం నాలుగు నెలలు అమెరికాలోనే ఉండిపోయారు జంధ్యాల.

అమెరికాలో తెలుగు షూటింగ్ ఏమిటని అప్పట్లో చాలామంది కామెంట్లు కూడా చేశారు. "అమెరికాలో స్థిరపడిన తెలుగు కుటుంబాల్లోని పిల్లలు, ముఖ్యంగా ఆడపిల్లల వివాహసమస్య ప్రధానమైనది. ఆ ఆడపిల్లలు మనదేశంలో వారిని వివాహం చేసుకోలేరు, ఇక్కడి సంప్రదాయానికి తగినట్లు మూడు ముళ్ళకి నోచుకోలేరు. ఇండియాలో పుట్టి అమెరికాలో జీవిస్తున్న ఓ అమ్మాయి పెళ్లి సమస్యే 'పడమటి సంధ్యారాగం'. కథ కోసమే, కథకి తగిన సహజత్వం కోసమే అమెరికా వెళ్ళాం. ఏదో పబ్లిసిటి కోసమో, గొప్ప కోసమో ఇక్కడ షూటింగ్ చేయడం లేదు. అమెరికాలో మిత్రుల ఇళ్ళల్లో వుంటూ, ప్రత్యేక వంటశాల ఏర్పాటు చేసుకుని, ఖర్చు అమెరికా ఆకాశాన్ని తాకకుండా, అదే సమయంలో తెలుగుతనానికి దూరం కాకుండా ఏర్పాట్లు చేసుకున్నాం" అని జంధ్యాల ఆ కామెంట్లకి గట్టిగా సమాధానం చెప్పడం జరిగింది.

అమెరికాలో 'పిబరే రామరసం' అనే భక్తిగీతాన్ని రికార్డ్ చేసారని చెప్పుకున్నాం కదా. ఇందుకు రివర్స్ గా ఓ ఇంగ్లీష్ గీతాన్ని మన దేశంలో రికార్డు చేశారు. అదే 'లైఫ్ ఈజ్ షాబీ విత్ అవుట్ యు బేబీ' పాట. దీని గొప్పదనమేమిటో చూద్దాం.

ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం గాయకుడిగాను, సంగీత దర్శకుడిగాను మాత్రమే కాకుండా ఓ రచయితగా 'లైఫ్ ఈజ్ షాబీ విత్‌వుట్ యు బేబీ, వెన్‌యు స్మైల్ డియర్ సంధ్యా కళ్ళల్లో తహ తహ గుండెల్లో గుబుగుబ' అనే పాట ద్వారా తన ప్రతిభను ప్రదర్శించారు. ఒక ఆంధ్రుడు రాసిన ఆంగ్లగీతాన్ని తెలుగుచలన చిత్రాల్లో ఉపయోగించుకోవడం ఇది రెండోసారి. ఇంతకుముందు 'అల్లూరి సీతారామరాజు' చిత్రం కోసం సంగీత దర్శకుడు

ఆదినారాయణరావు స్వయంగా 'హేపీ హేపీ క్రిస్టమస్' అనే ఆంగ్ల గీతాన్ని రచించారు.

కథానుగుణంగా ఓపాశ్చాత్య యువకుడు హీరోయిన్‌తో పాడే ఈ పాటలో ఎక్కువగా ఇంగ్లీష్ పదాలు, అక్కడక్కడా తెలుగు పదాలుంటాయి. అదే ప్రకారం 'బాగున్నారా సయొనారా' అనే రెండు పదాల్ని కాయిన్ చేసి తనలోని ప్రతిభను మరోసారి రుజువు చేసుకున్నారు బాలు. అంతేగాక ఈ పాట ఆయన పాడిన తీరు కూడా ఎవరో ఓ హాలీవుడ్ గాయకుడు వచ్చి పాడినట్టు వుంటుంది గానీ, అసలు సిసలైన ఆంధ్రుడు పాడినట్టే ఉండదు. అందుకే హేట్సాఫ్ టూ బాలు.

మద్రాసుకి చెందిన ప్రఖ్యాత డ్రమ్మర్

సినిమాకి సంబంధం లేకపోయినా గానీ ఈ సందర్భంలో ఓ సంఘటనని చెప్పాలి. విమానంలో అమెరికా వెళ్తూ దారిలో లండన్‌లో ఆగారు జంధ్యాల ట్రూపు! అక్కడ భానుమతిగారు, రామకృష్ణగారు, వాళ్ళబ్బాయ్ భరణీ తారసపడ్డారు. జంధ్యాల వాళ్ళని పలకరించి కుశలప్రశ్నలు వేసారు. భరణీ కోరిక మేరకై భానుమతిగారు తొలిసారిగా అమెరికా ప్రయాణం పెట్టుకున్నారట. ఈ అమెరికా యాత్రలోనే రామకృష్ణగారు కన్నుమూయడం జరిగింది.

శివమణి ఈ చిత్రంలో బ్లాక్ అమెరికన్‌గా నటించారు. విజయశాంతిని ప్రేమించి విఫలుడైన పాత్ర అతనిది. 'శివమణి' ఇంట్రడక్షన్‌ని కూడా భలే లింక్ కలిపారు జంధ్యాల. 'నేను ఇండియాకి పోతా. అక్కడ ఎలుగెత్తి అరిచినా ఎవరూ పట్టించుకోరు' అని గుమ్మలూరి శాస్త్రి, మీర్ అబ్దుల్లాతో అంటాడు. తర్వాతి సీన్‌లో 'శివమణి' డ్రమ్స్ వాయిస్తూ కనిపిస్తాడు.

ఈ సినిమాలో అమెరికన్ అబ్బాయి హిందూ అమ్మాయిని వివాహం చేసుకునే సందర్భం వుంది. ముందు పిట్స్‌బర్గ్ వెంకటేశ్వర స్వామి గుడిలో హిందూ సంప్రదాయం ప్రకారం గానూ, తర్వాత చర్చిలో క్రైస్తవ ఆచారాల ప్రకారంగానూ వివాహం జరుగుతుంది. దీనికి రీరికార్డింగ్ చేసేటప్పుడు బాలు తన సహాయకుడు మూర్తి ఇచ్చిన ఊహతో హిందూ వివాహం వెనుక పాశ్చాత్య సంగీతం, చర్చిలో వివాహం వెనుక నాదస్వరం

లైఫ్ ఈజ్ షాబీ వితౌట్ యు బేబీ
లైఫ్ ఈజ్ షాబీ వితౌట్ యు బేబీ
వెన్ యు స్మైల్ డియర్ సంధ్యా
గుండెల్లో గుబగుబ కళ్ళల్లో తహతహ
గుండెల్లో గుబగుబ గుబగుబా ॥లైఫ్ ఈజ్॥
ద మార్నింగ్ ఐ సా యు ద ఫస్ట్ టైమ్
యు ఆర్ యాన్ ఆర్డినరీ బేబీ దట్స్ వాట్ ఐ ఫెల్ట్
యాజ్ ఐ వాచ్ యు డే ఇన్ అండ్ డే ఔట్
ఐ నో నౌ వాట్ యు మీన్ టు మై లైఫ్
వెన్ ఐ బీట్ ది ట్రమ్‌టాన్ ఇన్ మై బాడ్ మూడ్
ఇట్ సౌండ్స్ యాజ్ ఇఫ్ ఇట్స్ మేడ్ ఆఫ్ వుడ్
వెన్ ఐ థింక్ ఆఫ్ యు బేబీ అండ్ బీట్ ఇట్ ఎగైన్
ఓ... బ్రదర్ ఇట్స్ బబ్బాన్
మై హార్ట్ స్కిప్స్ ఏ బీట్ వెన్ యు ఫెయిల్ టు మీట్
వెన్ ఐ ఫీల్ యు చీట్, ఐ ఫర్గెట్ టు ఈట్ ॥లైఫ్ ఈజ్॥
మ్యూజిక్ ఇన్ ద ఆఫ్టాన్
మ్యూజిక్ ఇన్ ద టీవి
మ్యూజిక్ ఆన్ ద స్టేజ్
అండ్ మ్యూజిక్ ఇన్ ద స్టీరియో
ద మూమెంట్ యు స్టార్ట్ స్మైలింగ్ ఎట్ మి బేబీ
సైలెన్స్... సైలెన్స్...సైలెన్స్...ఎవ్రీవేర్
ద డే వెన్ యు ఆస్క్‌డ్ మి బాగున్నారా
ఐ టోల్డ్ మై బ్యాడ్ మూడ్స్ సయొనారా
సింగింగ్ టు గర్ల్స్ ఈజ్ నాట్ మై కప్ ఆఫ్ టీ
యు మేడ్ మి డు సో ఇట్స్ యువర్ స్పెషాలిటీ
డోన్ట్ యూ ఎవర్ హిట్ మి
లైక్ ఎ పింగ్ పాంగ్ బాల్
మై హార్ట్ గెట్స్ ఫ్రిక్‌డ్ లైక్ ఎ డింగ్ డాంగ్ బెల్ ॥లైఫ్ ఈజ్॥


గుమ్మలూరి శాస్త్రి


విజయశాంతి, టామ్

ఉపయోగించిన తీరు ఎంతోమంది ప్రశంసల్ని పొందింది. సంగీత దర్శకుడిగా బాలుకి ఈ సినిమా మంచి పేరుని తీసుకువచ్చింది. ఆయన స్వరపరిచిన సినిమాల్లో టాప్‌టెన్ లిస్ట్ వేస్తే ఖచ్చితంగా ఈ సినిమాకి స్థానం దక్కుతుంది. ఇందులోని 'ఈ తూరుపు ఈ పశ్చిమం' పాటంటే బాలుకి వ్యక్తిగతంగా చాలా చాలా ఇష్టం. ఆ విషయాన్ని చెబుతూ "కెవిమహదేవన్, బాలసుబ్రహ్మణ్యంలకు నేను పర్మినెంట్ కీబోర్డ్ ప్లేయర్‌ని. 'పడమటి సంధ్యారాగం రీరికార్డింగ్‌కి నేను కూడా వర్క్ చేసాను. బాలు గారు పాటలు ఎంత గొప్పగా చేసారో, రీరికార్డింగ్ ఇంకా గొప్పగా చేసారు" అన్నారు మాధవపెద్ది సురేష్.

బాలు పాటల్ని ఎంత గొప్పగా స్వరపరిచారో, జంధ్యాల తనదైన శైలితో, చిత్రీకరణతో ఆ పాటలకి కొత్త అందాల్ని తీసుకువచ్చారు. జంధ్యాల పాటల చిత్రీకరణ గురించి ఓ ప్రత్యేక వ్యాసమే రాయొచ్చును. ఈ పాటల గురించి బాపు కితాబు ఏమిటో తెలుసుకుందాం. జంధ్యాల, బాపు ఇద్దరికీ గౌతంరాజే ఎడిటర్. 'పడమటి సంధ్యారాగం' ఎడిటింగ్ జరుగుతున్నపుడే, పక్కన బాపు గారిది వేరే సినిమా ఎడిటింగ్ జరుగుతోంది. అనుకోకుండా ఈ సినిమాలోని మూడు పాటల్ని చూసి 'ఎంత బాగా తీసాడయ్యా మీ జంధ్యాల' అని వక్కనేవున్న మాధవపెద్ది సురేష్‌తో చెప్పి తెగ పొంగిపోయారు బాపు.

ఇక ఈ సినిమా హైలెట్స్ విషయాని కొద్దాం. అమెరికాలో స్థిరపడిన తెలుగు నటీనటులతో 90 శాతం అమెరికాలో నిర్మించబడిన తొలి తెలుగు చిత్రం ఇది. ఈ సినిమాలో విజయశాంతి, శివమణి తప్ప, తక్కిన వారందరూ అమెరికాలో స్థిరపడినవారే. అలాగే

## 'పడమటి సంధ్యారాగం'లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్

- ఒరే... ఒరే... పొరపాటున బుద్ధి గడ్డితిని ఈ ఐస్‌క్రీమ్ షాప్ పెట్టానురా బకాసురా. అంగట్లో అమ్మేది తక్కువ. నీ అంగిట్లో దూరేది ఎక్కువ అయిపోయాయి. తిన్నది చాలు. ఇకనైనా ఆ వీర మింగుడు ఆపి నన్ను కనికరించరా సుపుత్రా.
- అసలు తప్పు నాదిలే. నీకు కొరుకుడు పడని ఏ ఇనుప సామానో, ఏ టైర్ల కొట్టో పెట్టుండాల్సింది.

  టైర్ల కొట్టు పెడితే ఒక్కొక్క టైరు అమ్ముకుని ఐస్‌క్రీమ్ కొనుక్కుతింటాను నాన్నా.
- పొద్దున్నే ఇంట్లో పదహారు దోసెలు తిన్నావ్

  పద్దెనిమిది

  అదే పద్దెనిమిది... పక్క రెస్టారెంట్లోకెళ్లి 8 గ్లాసుల ఆరెంజ్ జ్యూస్ తాగావ్

  పది...

  ఆ... అది మాత్రం మహా బాగా గుర్తుంది. షాపులో కూర్చుని 6 ఐస్‌క్రీమ్‌లు తిన్నావ్. ఇక చాలు ఆపరా. ఆ ఒంట్లో ఉన్న 320 కిలోలు నా ఐస్‌క్రీమ్ బరువే కదరా. అన్ని కిలోల ఐస్‌క్రీమ్ అమ్ముకుని ఉంటే ఈ పాటికి ఓ చిన్న ఇల్లు కొనుక్కుని ఉండేవాడ్ని. చచ్చి ఏ లోకాన ఉందో మీ అమ్మ... హిడింబి. అదీ బ్రతికుంటే మీ ఇద్దర్నీ మేపటానికి నేను నడిబజారులో అడుక్కోవలసి వచ్చేది.
- కులాసా

  ఆ... కు లాసే.. అంటే కుమారుడి వల్ల లాసు
- ఒరే వీరబాహూ.. ఇటు రా నాన్నా...

  మన కొట్లో మింగేవి చాలక మిగతా కొట్లలోవి కూడా తుడిచిపెడుతున్నావా నాన్నా...
- నీ శక్తి తెలియక అమాయకుడు నీకేదో తినిపిస్తానంటున్నాడు.... బాకీ తీర్చటానికి మూడేళ్లు ఆ హోటల్‌లో క్లీనర్ పనిచేస్తాడు.. కుంక
- నీక్కూడా మావాడికి తిండి పెట్టించాలన్న పాడు ఆలోచన వచ్చిందా నాయనా...

  ఆరిపోతావ్
- సుపుత్రా... సైంధవా....

  పిలిచావా నాన్నా.

  రాత్రి బియ్యం మూట తెచ్చి ఇక్కడ పెట్టాను... నువ్వుగాని మాయం చేశావా నాన్నా...

  పొద్దున్న లేవగానే ఆకలేసింది నాన్నా.. తినడానికి ఏం లేకపోతే బియ్యం తినేశాను.

  పన్నెండు కిలోల బియ్యం తిన్నావా నాన్నా...

  ఆఁ...

  శెభాష్.. అయితే ఓ పనిచెయ్... ఓ పది బిందెల వేడినీళ్లు తాగు. లోపల అన్నం ఉడుకుతుంది.

  (చెయ్యిపట్టుకుని గుంజుతూ)తొందరగా వంట చెయ్ నాన్నా.. ఆకలేస్తుంది

  ఏ... ఇదీ పీక్కుతిందామనే.... వదులు చెయ్యి.... వంటా... వంట దేనితో చేయను. నా బొంద.... బాబూ సర్వభక్షకా నువ్వు ఇంతవరకూ తినన్ది నరమాంసం మాత్రమే అనుకుంటా....

  అవునా..

  అవును నాన్నా

  అయితే ఓ పనిచేస్తా నాన్నా.... ఈ 4 స్టవ్వులూ వెలిగించి వాటి మీద నేను పడుకుంటాను. దోరగా కాలగానే నన్ను దించేసి నా మీద కాస్త ఉప్పుజల్లుకుని తినేయ్

  ఉప్పు డబ్బా ఎక్కడుంది నాన్నా...
- చెప్పు నీ దెయ్యపు తిండి ఆపుతానని ఆ దేవుడిమీద ఒట్టువేస్తావా.... కరెంటు ముట్టుకుని గిలగిలా కొట్టుకుని చావనా

  ఊరుకో నాన్నా.. అదేం పని

  నిన్ను పోషించటం నా వల్ల కావటం లేదురా... అమెరికా సంయుక్తరాష్ట్రాలన్నీ కలిసి చందాలేసుకుని నిన్ను ఒక నేషనల్ మాన్యుమెంట్ లాగా పోషించాల్సిందే తప్ప నాలాంటి మామూలు సంసారికి సాధ్యం కాదురా
- మనింట్లో తిన్నది చాలక నిన్న రాత్రి పక్కింటి వాళ్ల దొడ్డి గుమ్మంలోంచి దొంగ వెధవలా దూరి వాళ్లు వండుకున్నది మింగివస్తావా

  నిన్న వాళ్లు టర్కీ వండుకున్నారు నాన్నా..... వాసనొచ్చింది

  వాసనొచ్చిందా... కుక్క ముక్కు సంప్రాప్తించిందేరా నీకు... తిక్క వెధవా.. లాభంలేదు.. పద.... చెయ్... వెంకటేశ్వరస్వామి ముందు ప్రమాణం చెయ్... శనివారం నాడు రెండు పూటలా ఫలహారం తప్ప భోజనం చేయనని ప్రమాణం చెయ్.... వారానికి నువ్వు ఒక్కరోజు తిండిమానినా ఆ డబ్బులతో నేను నెలరోజులు తిండి తినగలను.... ప్రమాణం చేస్తావా.... వైర్లు ముట్టుకుని టపా కట్టమంటావా

  నువ్ అంత పనిచేస్తే నాకు ఫుడ్ ఎలా నాన్నా... ప్రమాణం చేస్తానులే
- సుపుత్రా..... ఐరావతా..... ఈ ఫల ప్రదర్శనేమిట్రా.... అమెరికాలోని వ్యవసాయదారుల సంత జరుగుతుందా ఇక్కడ.

  ఇవాళ శనివారం కదా నాన్నా....

  అయితే

  శనివారం భోంచేయొద్దన్నావు కదా.... ఫలహారం చేస్తున్నాను.

  ఫలహారం అంటే ఒకటో రెండో పళ్లు తినటమే తప్ప అమెరికాలో నెలరోజులు దాకా ఎవ్వరికీ పళ్లు దొరక్కుండా నువ్వు మింగేయటం కాదు.

  అది నాకు తెలియదు నాన్నా.... నీకు మాటిచ్చాను... మాట నిలబెట్టుకున్నాను.

  వద్దురా బాబూ... నీకు దణ్ణం పెడతాను. దయచేసి మాట తప్పి మామూలన్నమే తిను. ఈ పళ్లకంటే అన్నమే చౌక. బాబూ నీ క్షుత్తుకు నా జోహారు. నీ జీర్ణశక్తికి నా జేజేలు. వద్దు... ఇంక ఈ పళ్ల గోల మరచిపో. మామూలుగా భోజన కార్యక్రమం నిర్వర్తించు.

  మరి వెంకటేశ్వర స్వామి ముందు ప్రమాణం చేయించావ్.

  వచ్చే శనివారం పిట్స్‌బర్గ్ వెంకటేశ్వర స్వామి గుడికెళ్లి అపరాధ క్షమ క్రింద జరిమానా కట్టుకుంటాను. నువ్వు మాత్రం నీ ఒట్టుతీసి గట్టుమీద పెట్టి నన్ను బ్రతికించు.

  అలాగే నాన్నా.. నీ ఇష్టం.

  హమ్మయ్య

  మరి త్వరగా వంటచేయ్.... ఆకలేస్తోంది.

  ఆఁ.... గోవిందా గోవిందా

## కథాంశం

తమ్ముడు రామారావు పట్టుదల మేరకు ఆంధ్రప్రదేశ్‌లోని అంగలకుదురు నుండి అమెరికాకు భార్య, కూతురు సంధ్యతో సహా వెళ్తాడు ఆదినారాయణ. తెలుగు సంస్కృతి సంప్రదాయులు, ఆచార వ్యవహారాలంటే ఆదినారాయణకు బాగా నమ్మకం. ఇతరులది చాదస్తం అని భావించినా పట్టించుకోడు. అమెరికాలో కొత్త కొత్త పద్ధతుల్ని జీర్ణించుకోవడానికి చాలా ఇబ్బంది పడిపోతుంటాడాయన. అమెరికాలో ఓ కంపెనీలో ఉద్యోగానికి చేరతాడు.

ఉప్పు కొనడానికి షాపింగ్‌కి వెళ్ళి దారి తప్పి ఇబ్బంది పడుతున్న సమయంలో సంధ్యకి, క్రిస్ అనే అమెరికన్ కుర్రాడు పరిచయమవుతాడు. క్రిస్, సంధ్య ఒకరినొకరు ఇష్టపడుతుంటారు. సంధ్య ఇంటికి ఎదురుగా వుండే నీగ్రో రెనాల్డ్ కూడా ఆమెను ఇష్టపడుతుంటాడు. సంధ్య కోసం అటు క్రిస్, ఇటు రెనాల్డ్‌లు గణపతి దగ్గర తెలుగు నేర్చుకుంటారు. ఆదినారాయణ, సంధ్యకు వేరే సంబంధం నిశ్చయిస్తాడు. అనుకోకుండా క్రిస్, సంధ్యలు పారిపోయి హిందుధర్మం, క్రైస్తవ ధర్మం ప్రకారం రెండు రకాలుగా పెళ్ళిచేసుకుంటారు. వీళ్ళకు ఓ అమ్మాయి పుడుతుంది. ఆమెని చిన్న వయసులోనే తనతో పాటే ఇండియాకు తీసుకొచ్చేస్తాడు ఆదినారాయణ. అతని శిక్షణలో పెరిగిన ఆ అమ్మాయి అనిత పెద్దయ్యాక తండ్రిని అసహ్యించుకుంటుంది. ఆదినారాయణ చనిపోతే దహన సంస్కారాలు నిర్వహిస్తాడు క్రిస్. తమ ప్రేమకథను తన కూతురుకి చెప్పి ప్రపంచమంతా ఓ వసుధైక కుటుంబం అని తెలియజేస్తుంది సంధ్య. తన తప్పు తెలుసుకున్న అనిత, తండ్రి ఔన్నత్యాన్ని గౌరవించి తల్లి తండ్రులతో పాటు అమెరికా బయలు దేరుతుంది.

ఒక అమెరికన్ కథానాయకుడిగా నిర్మించబడిన తొలి తెలుగు చిత్రం కూడా ఇదే.

ఈ చిత్రంలో ప్రముఖ పాత్రలు ధరించిన వారందరికి పాపులర్ తెలుగు నటులతో డబ్బింగ్ చెప్పించారు జంధ్యాల. వారందరూ జంధ్యాల తీసే ప్రతి చిత్రంలోనూ కనబడతారు. కాబట్టి ఈ కళాకారుల గొంతులతో ప్రవాసాంధ్రులను తెరపై చూపిస్తూ 'ఇది మన సినిమాయే. అందులో ఉన్నదీ మనవాళ్ళే' అనే ఫీలింగ్‌ని కలిగించారు జంధ్యాల.

హీరోయిన్ విజయశాంతికి తండ్రిగా నటించిన గుమ్మలూరి శాస్త్రికి సుత్తి వీరభద్రరావు, బాబాయ్ పాత్రలో నటించిన మీర్ అబ్దుల్లాకి జంధ్యాల, ఐస్‌క్రీమ్ షాపు ఓనర్ శేషగిరిరావుకి పొట్టిప్రసాద్, అతని కొడుకు విజయ్‌కి శుభలేఖ సుధాకర్ డబ్బింగ్ చెప్పారు.

సుత్తి వీరభద్రరావు వాయిస్‌కి తగ్గట్టుగా గుమ్మలూరి శాస్త్రి బాడీ లాంగ్వేజ్ చక్కగా అమిరింది. సీరియస్‌గా వుంటూనే ప్రేక్షకుల్ని నవ్వించే ఈ పాత్ర అద్భుతంగా హాస్యాన్ని పండించింది. వీధిలో టవల్ మాత్రమే కట్టుకుని కూర్చుని వంటికి నూనె పట్టించుకోవడం ఇత్యాది సీన్స్ ఎన్నిసార్లు చూసినా నవ్వులు పుట్టిస్తాయి.

క్రిస్(టామ్)కి,రెనాల్డ్ (శివమణి)కి గణపతి (విజయ్) తెలుగు నేర్పే ఎపిసోడ్ భలే తమాషాగా సాగుతుంది. తిండిపోతు అయిన గణపతిని రెస్టారెంట్స్‌కి తీసుకెళ్ళి అతను తిన్నంత పెట్టి తెలుగు నేర్చుకోవడం, అతగాడేమో దీన్ని అలుసుగా తీసుకుని వీళ్ళకి తప్పుడు తెలుగు నేర్పడం, వీళ్ళ తెలుగు చూసి సంధ్య నవ్వడంతో ఇద్దరూ కోపంగా వెళ్ళి గణపతిని కొట్టబోయి తామే తన్నులు తినడం - నవ్వడం రానివాళ్లని కూడా నవ్విస్తుంది.

## పాటలు

**పిబరే రామ రసం**
రచన : సదాశివబ్రహ్మేంద్ర స్వామి
గానం : బాలు, శైలజ
అభినయం : గుమ్మలూరి శాస్త్రి, విజయశాంతి, టామ్, ఆశాజ్యోతి

**లైఫ్ ఈజ్ షాట్.... ఐతే వుట్ యు డేట్**
రచన, గానం : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం
అభినయం : శివమణి, విజయశాంతి

**ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు**
రచన : అన్నమయ్య
గానం : యస్.జానకి
అభినయం : పిల్లలు

**ఈ తూరుపు ఆ పశ్చిమం**
రచన : వేటూరి సుందరరామమూర్తి
గానం : బాలు, జానకి
టామ్, విజయశాంతి

గణపతి తిండిపోతుతనానికి పరాకాష్టగా ఓ చిన్న సీన్ చెప్పుకోవాలి. క్రిస్,సంధ్యల పెళ్ళిలో అక్షింతల్ని కూడా నోట్లో వేసేసుకుని తన ఆకలి కొద్దిగా తీర్చుకుంటాడు.



అమెరికాలో వుండగా జంధ్యాల ప్రఖ్యాత దర్శకుడు స్టీవెన్ స్పీల్‌బర్గ్‌ని కలిశారు. "జాస్ వంటి ఎన్నో అద్భుత చిత్రాల్ని తీసిన స్పీల్‌బర్గ్‌ని ఇంటర్వ్యూ చేసే అవకాశం వాషింగ్టన్‌లో నాకు లభించింది. ఇండియన్ ఫిల్మ్ గురించి ఎంతో ఆసక్తికరంగా ఆయన మాట్లాడారు" అంటూ ఎంతో సంబరపడిపోయారు జంధ్యాల. అలాగే న్యూయార్క్‌లో టి.వి. ద్వారాను, వాషింగ్టన్‌లో రేడియో ద్వారాను ఇంటర్వ్యూలు ఇచ్చారు జంధ్యాల.

ఓ పక్క క్రిస్, మరో పక్క రెనాల్డ్ ఇద్దరూ ఒకేసారి సంధ్యకు 'ఐ లవ్యూ' చెబుతారు. తర్వాతి రోజు ఉదయం సంధ్య తెల్ల చీర కడితే క్రిస్‌కి గ్రీన్ సిగ్నల్, నల్లచీర కడితే రెనాల్డ్‌కి లవ్ సిగ్నల్. ఈ ప్రేమానుభూతిలో సంధ్య మునిగి తేలుతున్న సమయంలో 'ముద్దుగారే యశోద' అంటూ ఓ పాట పెట్టడం, ఆ పాటలో ఓ అమెరికన్ కుర్రాడిని కృష్ణుడిలా అలంకరించి, ఆ బాలకృష్ణుని అల్లరుల నేపథ్యంలో ఈ పాటని పూర్తి చేయడం చాలా గొప్ప థాట్.

ఈ పాట వెనుక ఓ ఆసక్తికరమైన కథ ఉంది. అమెరికాలో ఈ చిత్రం యూనిట్ బాగోగులు



చూసుకోనేవారికి ఓ అబ్బాయి ఉన్నాడు. ఆ బాబు జంధ్యాల దృష్టినాకర్షించాడు. ఆ అబ్బాయిని చిన్ని కృష్ణుడిలా అలంకరించి అతని మీద ఓ పాట చిత్రీకరించాలనుకున్నారు. కానీ ఆ అబ్బాయి అస్సలు సహకరించలేదు. ఫ్లూట్ ఇస్తే విరిచేసేవాడు. అలా చాలా ఫ్లూట్లు విరక్కొట్టేశాడు. 'నవ్వుతూ మొహం పెట్టు' అంటే కెమెరా ఆన్ అయ్యేసరికి వెక్కిరించేవాడు. కెమెరా చిత్రీకరించగలిగే 'ఫీల్డ్'లోంచి పారిపోయేవాడు. 'నడుస్తూ...రా' అంటే పడిపడి దొర్లేవాడు. అలా కొన్ని వందల అడుగుల ఫిల్మ్ ఎక్స్‌పోజ్ అయిపోయింది. జంధ్యాల ఊరుకోలేదు. వాటన్నిటిని చాలా తెలివిగా ఎడిట్ చేసి 'ముద్దుగారే యశోద' అనే అన్నమయ్య కీర్తనని జత చేశారు. ఇవాళ ఆ పాటని చూస్తూ ఉంటే 'బాలకృష్ణుడి అల్లరి' లా ఉంటుందే తప్ప మరోలా ప్రేక్షకుడికి తట్టే అవకాశం లేదు. అదీ జంధ్యాల సృజనాత్మక కౌశలం.

తెలుగు సినిమా నిర్మాణరంగంలో ప్రవాసాంధ్రులు కాలుమోపడం 'పడమటి సంధ్యారాగం' చిత్రంతోనే ఆరంభమైందని చెప్పొచ్చును. అంతకు ముందు కూడా కొంతమంది ప్రవాసాంధ్రులు తెలుగు సినిమా నిర్మాణంలో పాలు పంచుకున్నా, వారు స్లీపింగ్ పార్టనర్స్‌గానే వున్నారు. 'పడమటి సంధ్యారాగం' తర్వాత చిన్నికృష్ణుడు, జెండా, అటు అమెరికా ఇటు ఇండియా, ప్రేమాయనమః తదితర చిత్రాలను ప్రవాసాంధ్రులు నిర్మించారు.

'పడమటి సంధ్యారాగం' చిత్రనిర్మాణంలో అహర్నిశలు శ్రమించి సహకరించిన అమెరికాలో ప్రసిద్ధిగాంచిన తెలుగు వైద్యులు డా॥ కోటంరాజు సత్యమూర్తి మొన్నీ మధ్యనే కోడిరామకృష్ణ దర్శకత్వంలో 'జెండా' చిత్రాన్ని నిర్మించారు.

అలాగే గుమ్మలూరి శాస్త్రి స్వీయ దర్శకత్వంలో 'అటు అమెరికా-ఇటు ఇండియా' చిత్రం ఆ మధ్య నిర్మితమైంది.

ప్రేమకు ఎల్లలు లేవంటూ 'పడమటి సంధ్యారాగం' చిత్రంలోని సీమాంతర ప్రేమాయణాన్ని చక్కగా తెరకెక్కించారు జంధ్యాల. ఈ చిత్రానికి 1987లో ఉత్తమ కథా రచయితగా నంది అవార్డునందుకున్నారాయన. ఈ చిత్ర కథ రచనలో జంధ్యాలకు ఆదివిష్ణు సహకరించారు.

ఈ సినిమా గురించి ఆదివిష్ణు వెర్షన్ ఏమిటో తెలుసుకుందాం. "ఈ సినిమాకి నేను కొంచెమే వర్క్ చేసినా, స్పెషల్ కార్డ్ వేసి గౌరవించారు. ఈ సందర్భంలో ఓ సంఘటనను కూడా గుర్తుచేయాలి. ఈ సినిమా సెన్సార్ జరుగుతోంది. ఆఫీసర్ పేరు రత్నప్రభ. సెన్సార్‌కి నన్ను పంపించాడు జంధ్యాల. నన్ను చూడగానే ఆవిడ "మీరెందుకండి రావడం, జంధ్యాల గారి సినిమాల్లో బూతులుండవు కదా. మాకు కత్తెరేసే పనే ఉండదు." అని అన్నారు. ఆవిడ మాటలతో నేను చాలా సంబర పడిపోయాను. ఇందులో ఓ చోట నీగ్రోని కొట్టేటప్పుడు 'ఇది ఆవకాయ దెబ్బ, గోంగూర దెబ్బ' అని చెప్పే సీన్ నాకు నచ్చలేదు. పరభాషా వ్యక్తిని అలా తిట్టడం బాగుండదనిపించింది. కానీ రత్నప్రభగారు మాత్రం ఉన్నా పర్వాలేదన్నారు. నేను మాత్రం కట్ చేయమన్నాను" అని చెప్పుకొచ్చారు ఆదివిష్ణు. సినిమా రిలీజైంది. అటు ఆంధ్రప్రేక్షకుల్ని, ఇటు ప్రవాసాంధ్ర ప్రేక్షకుల్ని ఆకట్టుకుంది.

ఇదండీ... విదేశీగడ్డపై తెలుగుబిడ్డలు చేసిన అనురాగాల కచేరీకి జంధ్యాల సవినయంగా సమర్పించిన పడమటి సంధ్యారాగం.

**- పులగం చిన్నారాయణ**

## మార్కెట్లో ఉన్న ఆడియో క్యాసెట్లు




వెల : రూ. 38/-
విడుదల : ఆదిత్య మ్యూజిక్




వెల : రూ. 25/-
విడుదల : సూర్య మ్యూజిక్



మహాసహస్రావధాని
డా॥ గరికపాటి నరసింహారావు

# పలకరిస్తే పద్యం...

1116 పృచ్ఛకులతో 750 పద్యాలను ఏకధాటిగా ధారణ చేసి 'మహాసహస్రావధాని'గా కీర్తి ప్రతిష్ఠలనందుకున్న డా॥ గరికపాటి నరసింహారావుగారు సాగించిన అవధానయజ్ఞాలలో చమత్కారంగా దొర్లిన ఆశు పద్యాలివి. ఈ పద్యాలకు పృచ్ఛకులుగా వ్యవహరించినవారు శ్రీకాంత్, మంజుల, కుమార్, జ్యోతి, సాయి... చిత్తగించండి....

**◆ అవధాని గారూ... భారతీయ వస్తువులు మాని విదేశీ వస్తువులు వాడటాన్ని మీరు ఆక్షేపించారు కదా. ఈ రోజుల్లో విదేశీ వస్తువులు వాడందే పొద్దు గడవదు. చివరకు మనం బట్టలు ఆరేసుకునేటప్పుడు పెట్టే క్లిప్పు కూడా విదేశాలనుండీ వచ్చిందే కదా. దీనికి మీరేమంటారు...?**

క్లిప్పు మీరన్నట్టు విదేశీ వస్తువే అయినా అది స్వదేశీ శీలానికి శ్రీరామరక్ష. ఏ రకంగా అంటే

**చేత కాసులేక చిటికె వేసినయట్లు**
**పట్టు చీర నైన పట్టగలదు**

మనం పట్టుచీర కొనాలంటే ఎంత ఖర్చవుతుందండి...!? చిటికె వేసినంత సేపట్లోనే ఈ క్లిప్పు పట్టుచీరను కూడా పట్టుకోగలుగుతుంది.

పైగా అది ఒక రకంగా సౌందర్యాన్ని రక్షిస్తుంది కూడా.




డాబా మీద దండెం మీద బట్టలు ఆరవేస్తే ఈ క్లిప్పు లేదనుకోండి.. ఈ సొగసంతా వెళ్లి పక్కింట్లో పడిందనుకోండి... అనేక రకాల తగాదాలు వస్తాయి కదా.. అందుకని

**ఆరవేయు సొగసు పారిపోనీయదు**
**క్లిప్పు శీలమునకు గొప్ప రక్ష**

**చేత కాసులేక చిటికె వేసినయట్లు**
**పట్టు చీర నైన పట్టగలదు**
**ఆరవేయు సొగసు పారిపోనీయదు**
**క్లిప్పు శీలమునకు గొప్ప రక్ష**

**◆ అవధాని గారూ... అమెరికా వంటి దేశాలది చాలా అదృష్టం. ఎందుకంటే బిల్ క్లింటన్‌లాంటి రొమాంటిక్ పర్సన్స్ వాళ్లకి ప్రెసిడెంట్లు అవుతున్నారు. కానీ మన భారతదేశ ఖర్మేంటండీ... బ్రహ్మచారులు, వయోవృద్ధులు మనకు నాయకులయ్యారు...?**

నాయనా... నువ్వు చెప్పినట్లుగా భారతదేశానికి ఇది ఒక ఖర్మ కాదు కానీ.... ఒక విచిత్రమైన అంశమే. మొదట్నించీ మనకు ప్రధాన మంత్రులుగా పనిచేసిన వారిలో చాలామంది భార్యలు పోయిన వారు, భర్తలు పోయిన వారు, అసలు పెళ్లికాని బ్రహ్మచారులు. ఇది ఒక రకంగా వరం కూడా. ఎందుకంటే కార్యేషు దాసి, కరణేషు మంత్రీ అన్నారు కదా... అందుకని ఇంకొక మంత్రి వచ్చి ఈయనకు సలహాలిచ్చి ఆయన బుర్ర చెడగొట్టకుండా ఆయనే ప్రధానమంత్రి కాబట్టి ఆయనే స్వంత సలహా తీసుకుని, తన బుర్ర ఉపయోగించుకుని...పనిచేస్తాడు. అవసరమైతే మంత్రివర్గ సలహా తీసుకుంటాడు తప్ప వేరే తంత్రి వర్గమేదీ పనిచేయవలసిన అవసరమేమీ లేదు. అందుకని బ్రహ్మచారులు ఉండటమే మంచిది. పైగా మన దేశం ధర్మానికి ప్రసిద్ధి కదా. ఇది ధర్మభూమి, కర్మభూమి. అందుకని మనవాళ్లు ఒకవేళ పెళ్లయిన వాళ్లు ఉన్నా, వీళ్లంతా ఏక పత్నీ వ్రతులు. అమెరికన్ నాయకులు లోకపత్నీ వ్రతులు.

**(గత ప్రభుత్వం ఉన్నరోజులలో అడిగిన ప్రశ్నకి అవధానిగారు ఇచ్చిన సమాధానం ఇది)**

**◆ అవధాని గారూ... బ్రహ్మచారి పరిపాలిస్తే బాగానే ఉంటుందన్నారు. కేంద్రంలో బ్రహ్మచారి ప్రధానమంత్రిగా ఉండగా, తమిళనాడు రాష్ట్రంలో బ్రహ్మచారిణి జయలలిత అడుగడుక్కీ ఆయనకు అడ్డం తగిలి చివరకు ఆయన్ని పదవి నుండి దింపేసింది కదా. మరి దీనిపై వ్యాఖ్యానం ఏమిటి?**

అయ్యా జయలలిత, వాజ్‌పేయ్‌కు అడ్డం తగిలిందంటే అది ఆవిడ తప్పు కాదు. ఆయన పేరులోనే ఉందా తప్పు. వాజ్‌పేయ్ అన్న దాంట్లో మీరొకటి గమనించండి. వా తరువాత జ, పే తరువాత య. అంటే అడుగడుక్కీ ఆయనకు అడ్డుతగులుతుందని వాళ్ల అమ్మ అందుకే ఆయనకా పేరు పెట్టింది. పోనీ వాజ్‌పేయ్‌లో జయ తీసేశారనుకోండి మిగిలింది వాపే బలుపేమీ లేదక్కడ. అందుకని ఆవిడ ఉండవలసిన అవసరం ఉంది, అడ్డుతగలవలసిన అవసరం ఉంది.

ఆ పైన బ్రహ్మచారులైనా, బ్రహ్మచారిణులైనా మనకొక సామెత ఉంది. బ్రహ్మచారీ శతమర్కటహః అని. సామాన్యుడు కాదు బ్రహ్మచారి. కష్టనష్టాలు తెలియవు కదా అందుకని... బ్రహ్మచారి యొక్క బుద్ధి ఎలా ఉంటుందంటే - ఒక బ్రహ్మచారి, ఇద్దరు సంసారులు కలిసి ఒక హత్య చేశారట. సరే మరీ ఆధారాలు ఎక్కువ దొరక్క పోవటం వల్ల మరణశిక్ష కాకుండా ద్వీపాంతరవాస

శిక్ష వేశారు వాళ్లకి. అండమాన్ దీవుల్లో వదిలిపెట్టారు. అక్కడెలాగూ అన్నం నీళ్లు దొరికిచావవు కదా.. అందుకని ఈ ముగ్గురూ కలిసి బ్రహ్మచారి సలహా మేరకు తపస్సు చేశారు.

సరే వాళ్ల కఠోరమైన తపస్సుకు మెచ్చుకుని దేవుడు ప్రత్యక్షమయినాడు. అయి, నాయనా మీకు ఏం వరం కావాలో కోరుకోమని ఒక సంసారిని అడిగితే నన్ను నా పెళ్లాం బిడ్డల దగ్గర దిగబెట్టండి... ఇంకేమీ నాకు అవసరం లేదు ... నేను వాళ్లని చూసి ఏడాది అయింది అన్నాడు. సరే పాపం ఆయన్ని అక్కడ దించేశారు. రెండో సంసారిని అడిగితే ఆయనా... అదే వరం అడిగాడు. ఆయన్ని కూడా అక్కడ దించేశారు. మూడో వాడైన బ్రహ్మచారిని నీ తపస్సుకు మెచ్చాను నాయనా నీకేం వరం కావాలో కోరుకోమన్నాడు. నాకేం తోచట్లేదండి. నాకు వెళ్లటానికి ఇంటి దగ్గర ఎవరూ లేరు. ఒంటికాయ సొంటి కొమ్ముని. సత్రం భోజనం. మఠం నిద్ర. అందుకని ఓ పదిహేను రోజులు నాకు అవకాశం ఇవ్వండి. వరం కోరుకుంటాను అన్నాడట. పదిహేను రోజులు తరువాత ఆ దేవుడు మళ్లీ వస్తే ఈయన వరం కోరాడట. నాకిక్కడేం తోచటం లేదు. వారిద్దరినీ ఇక్కడకు తీసుకురండీ అన్నాడట. అది బ్రహ్మచారీ శత మర్కటహః అంటే... అందుకని అటువంటి ఇబ్బందులు ఉంటాయి కానీ... మన బ్రహ్మచారి మాత్రం భీష్ముడు లాంటి వాడు. మీరు కంగారు పడనక్కర్లేదు.



**◆ అవధాని గారూ... గ్యాస్ స్టవ్ లేని ఇల్లయినా ఉందేమోగానీ, టీవీ లేని ఇల్లు మాత్రం లేదు. ఈ టీవీ మన జీవితంలో ఓ ముఖ్య భాగమై పోయింది. కనుక ఈ టీవీ మీద ఓ పద్యం చెప్పగలరా?**

టీవీలు మీరు చెప్పినట్టే ఇవాళ జన జీవన స్రవంతిలో ఓ ముఖ్య భాగమై పోయాయి. వాటిని విడదీయలేము. అది నిజమే.

**టీవీ లేని ఇల్లు ఠీవిగా నుండదు**
**దూరదర్శనమ్ము దూరెనింట**
**పెట్టి చూడలేము, పెట్టకుండగలేము**
**ధారవాహి కనులధారలయ్యే**

సీరియల్స్ చూడటం, ఏడుస్తూ కూర్చోవటం, ఛానెల్స్ మార్చటం... మళ్లీ మళ్లీ ఏడవడం... ఎందుకు కొన్నామా అని ఒక ఏడుపు, కొని చూడలేక పోతున్నామని మరో ఏడుపు. ఇంతగా జన జీవితంలో భాగమైన టీవీలను సరిగ్గా ఉపయోగించుకోగలిగితే అవి ఉపయోగ పడతాయి.



**డిస్కో డ్యాన్సులను చూతురు**
**డిస్కవరీ చూడబోరు డింభకులైనన్**

డిస్కవరీ చూస్తే చాలా ప్రయోజనం ఉంది. కానీ అది ఎవరూ చూడరు. డిస్కో డ్యాన్సులు తప్ప.

**డిస్కో డ్యాన్సులను చూతురు**
**డిస్కవరీ చూడబోరు డింభకులైనన్**
**రిస్కే టీవీ కొనగా ఆస్కారములేక**
**చదువులాకశమునంటెన్**

చదువులు ఆకాశాన్నటంకుండా, మరీ పాతాళానికి పోకుండా కాస్త తల్లితండ్రులు దాన్ని అదుపులో పెట్టి జాగ్రత్త పడితే చాలా ప్రయోజనాలున్నాయి.

**◆ కవిగారూ... నేను ఎందుకు ఇలా సంబోధిస్తున్నానంటే... మీరు అవధానే కాదు.. మంచి కవి కూడా అందుకని . ఓ చిన్న ప్రశ్న. చప్పట్లు లేకపోతే సభ నడవదంటారు. అది నిజమేనా ?**

**చప్పట్లే గొప్పట్లయ్ తప్పెట్లయ్**
**మోగుచుండే తధిం తకధిమ్**

చప్పట్లు కళాకారులకు ఎంత ప్రోత్సాహమైనా అవి తెచ్చిపెట్టే ప్రమాదాలు కూడా కొన్ని లేకపోలేదు.

**చప్పట్లే గొప్పట్లయ్ తప్పెట్లయ్**
**మోగుచుండే తధిం తకధిమ్**
**తపెట్లో ఒప్పెట్లో ఇప్పట్లో**
**చూడనీవు ఈ చప్పట్లే**

అవి మరీ ఎక్కువైనా కూడా తప్పో ఒప్పో చూసుకోని పరిస్థితి కవికి, కళాకారునికి కల్పిస్తాయి. ప్రోత్సాహకరంగా కొట్టడం మంచిది కానీ, అత్యుత్సాకరంగా చేయటం మాత్రం మంచిది కాదు.

**◆ అవధాని గారూ... ఈ రోజున ఆంధ్ర రాష్ట్రాన్ని ఉర్రూతలూగిస్తున్నవి రెండే రెండు. అది ఒకటి అవధానం, రెండోది క్రికెట్ మ్యాచ్. అవధానం చేయటం గొప్పదా, క్రికెట్ మ్యాచ్ ఆడటం గొప్పదా?**

**ఈ ప్రశ్నకు సమాధానంగా అవధానిగారి పద్యం ఎలా ఉంటుందో వచ్చే సంచికలో.....**

రసజ్ఞులైన పాఠకులు కూడా ఈ 'పలకరిస్తే పద్యం' శీర్షికలో పాల్గొనవచ్చు. సంచికకు రెండు ప్రశ్నల చొప్పున పద్యాలు చెప్పడానికి మహాసహస్రావధాని గరికపాటి నరసింహారావు గారు అంగీకరించారు. 'హాసం' పాఠకులకే పరిమితమైన ఈ అమూల్య అవకాశాన్ని రసజ్ఞులందరూ వినియోగించుకుంటారని ఆశిస్తున్నాం. పద్యాన్ని కోరే పాఠకులు తాము ఇవ్వాలనుకుంటున్న సమస్యను ఈక్రింది చిరునామాకు పంపాలి.

**పలకరిస్తే పద్యం**
**హాసం, హాస్య - సంగీత పత్రిక,**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**బి.యస్.పి.కాలనీ, మోతీనగర్,**
**హైదరాబాద్ -500 018**

అవధాని గారి పద్యాలకు ఎంపికైన సమస్యలను పంపే పాఠకులకు తగిన బహుమతి ఉంటుంది.



విలేఖరి : ఏమిటీ! మీ సినిమాలో హీరోయిన్‌గా ఓ మూగ అమ్మాయిని ఇంట్రడ్యూస్ చేస్తున్నారా ? ఎందుకని?
నిర్మాత : నోరుండి మాత్రం ఉద్ధరించేదేవుంది? ఎవరికైనా డబ్బింగ్ చెప్పించాల్సిందేగా.



కొడుకు : అమ్మా ! నాన్నగారికి యాక్సిడెంట్ అయ్యిందిటే !
తల్లి : ఏ హాస్పిటల్‌లో చేర్చారో కనుక్కో, ఈ సీరియల్ కాగానే వెళదాం....



"నేరస్థుల విషయంలో చట్టం తన పని తాను చేసుకుపోతుంది అని రాజకీయనాయకులు చెప్పే మాటలు నిజమేనా?"
"నిజమే. కాకపోతే, సామాన్యుల విషయంలో అదిచాలా త్వరగాను, ధనవంతుల విషయంలో చాలా నెమ్మదిగా పనిచేస్తుందంతే!"

**ఈ జోకులను పంపించిన వారు: యం. అంజిరెడ్డి, ఒంగోలు.**

**ఈ జోకును పంపించిన వారు: గొల్లపూడి శ్రీనివాస్, హైద్రాబాద్.**

"ఆలస్యాదమృతం విషం "
" అంటే"?
"ప్రోగ్రెస్ రిపోర్టు మీద సంతకం చేసేటప్పుడు ఆలస్యం చేయకూడదు అని అర్థం".
"నిదానం ప్రధానం "
"మళ్ళీ అదేమిటి?"
"నామీద కోపం తెచ్చుకుని చెయ్యి చేసుకునేముందు ఆలోచించు అనిఅర్థం".



"కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన... పనిచెయ్యి ఫలితం కోసం ఎదురుచూడకు' అని కృష్ణుడు ఏ ముహూర్తంలో అన్నాడో గానీ నాలాంటి వాళ్ళకు అది ఎంత మనశ్శాంతి నిస్తుందో చెప్పలేం.."
"నిజంగా...అదెలా.."
"పరీక్షలు రాశాను కదా... ఫలితాల కోసం అందరూ టెన్షన్‌తో బిక్కచచ్చి ఉన్నారుగానీ నేనెలా ఉన్నానో చూడు... ఎంత సంతోషంగా ఉన్నానో... ఎంత ఉల్లాసంగా ఉన్నానో..."



**ఈ జోకులను పంపించిన వారు: వి. శ్యామ్ సుందర్, విజయవాడ.**



పెళ్ళిళ్ళపేరయ్య :అబ్బాయి బుద్ధిమంతుడండీ. గుమస్తా పర్వతం చేస్తున్నాడు.
పిల్లతండ్రి : గుమస్తా పర్వతం ఏంటయ్యా?
పెళ్ళిళ్ళ పేరయ్య : మొన్నటిదాకా గుమస్తా గిరియే చేసేవాడండీ, ఈ మధ్యనే ప్రమోషన్ వచ్చిందట ! అందుకని".

**ఈ జోకును పంపించిన వారు: వి. మంజూరాణి, హైద్రాబాద్**



"పిల్లలూ ! భూగోళశాస్త్రం బాగా చదువుతున్నారు కదూ! ? మకర రేఖకు, కర్కాటకరేఖకు మధ్య గల రేఖను ఏమంటారు"?
"మర్కటరేఖ సార్".

**ఈ జోకును పంపించిన వారు: బి. చంద్రశేఖరయ్య,రామసముద్రం.**



"మా ఆయన గవర్నమెంటు ఆఫీసర్ అవడం కాదు కానీ ఛస్తున్నాననుకో"
"ఏమైంది?"
"దేన్నైనా సరే బల్లక్రింద నుంచి అందించాల్సి వస్తోంది."

**ఈ జోకును పంపించిన వారు: షేక్ అస్లాం షరీఫ్, శాంతినగర్.**

## హ్యూమర్ బాక్స్

"నా భార్య చనిపోయిన తర్వాత నాకు మిగిలింది ఏ కాంతమే"
"అయ్యెపాపం ఒక్కడివే ఎలా ఉండగలుగుతున్నావ్?"
"ఒక్కణ్ణే ఉంటున్నానని ఎవరన్నారు? ఏ. కాంతం అని కాలేజీలో చదువుతున్నప్పుడు మనం వెంటవడే వాళ్ళం గుర్తుందా... ఆమెను పెళ్ళిచేసుకున్నా..."





"మా ఆవిడ దేవత "
"అదృష్టవంతుడివోయ్, మా ఆవిడ ఇంకా బ్రతికే వుంది".

**ఈ జోకులను పంపించిన వారు: సి.హెచ్.వి. బృందావనరావు,విజయవాడ.**

"ఒక్కక్షణం మానాన్న కళ్ళల్లోకి మా అమ్మ సూటిగా చూసిందంటే మా నాన్న మా అమ్మ చెప్పినట్టల్లా చేస్తాడు"
"రియల్లీ! మీ అమ్మ అంత గొప్ప హిప్నాటిస్టా".
"కాదు. గొప్ప గయ్యాళి".



'ఏంటీ... ఈ రోజు నువ్విలా అప్పుల్లో కూరుకు పోవడానికి మీ తాత, మీ నాన్న కారకులా? అంటే వాళ్ళ కోసమే నువ్వు అప్పులు చేశానంటావా"
"అదేం కాదు. వాళ్ళే కనుక ఆస్తులు సంపాదించి వుంటే నాకిలా అప్పులు చేసుకోవాల్సిన గతి పట్టేది కాదు కదా".



**ఈ జోకులను పంపించిన వారు: 'మా' ఫిన్‌లె, హైద్రాబాద్.**

బాబాయి : గోపీ! నీవు రోజూ మీ క్లాసులో ఏ బెంచ్ మీద కూర్చుంటావ్
గోపి : ఫస్టు బెంచీ మీద బాబాయ్.
బాబాయి : వెరీగుడ్! మంచి పని చేస్తున్నావ్. ఇంతకూ ఫస్టు బెంచ్ మీద కూర్చోవాలనే ఆలోచన నీకెలా వచ్చింది?
గోపీ : మా టీచరు ఎప్పుడూ చివరి బెంచి వారినే ప్రశ్నలు అడుగుతుంటారు గనక.



డ్యూటీ పూర్తిచేసిన కొత్త ప్యూన్ "అయ్యా ఇక నాకు శెలవు ఇప్పిస్తారా?" అన్నాడు వెళ్ళబోతూ.
"ఇవ్వాళే డ్యూటీలో చేరావో లేదో అప్పడే శెలవా?" అంటూ కసురుకున్నాడు ఓనరుడు.



**ఈ జోకులను పంపించిన వారు: జి.భారతి, నెల్లూరు.**

పక్కింటావిడ సుశీలమ్మతో "మీ ఆయనకు మీ పెంపుడు కుక్క టామీ కరిచిందని చెప్పారు కదా, ఇప్పడెలా ఉంది?"
"టామీకి ఇంజెక్షన్లు వేయించాం. ఇపుడు బాగానే ఉంది".



**ఈ జోకులను పంపించిన వారు: రత్నాల ప్రకాశరావు,విశాఖపట్నం.**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన యం. అంజిరెడ్డి -ఒంగోలు, గొల్లపూడి శ్రీనివాస్ -హైద్రాబాద్, వి. శ్యామ్‌సుందర్ -హైద్రాబాద్, వి. మంజురాణి - హైద్రాబాద్, బి. చంద్రశేఖరయ్య- రామసముద్రం, రత్నాల ప్రకాశరావు- విశాఖపట్నం, షేక్ అస్లాం షరీఫ్ - శాంతినగర్, వి. భారతి- నెల్లూరు, 'మా' ఫిన్‌లె- హైద్రాబాద్, సి.వి.హెచ్. బృందావనరావు-విజయవాడ గార్లకు సోహాన్ మ్యూజిక్ వారు 'సామ్రాట్ రీమిక్స్ 'సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN MUSIC



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| తమిళం | | తెలుగు |
|---|---|---|
| చిత్రం | : కుళందైయుం దైవముం | లేతమనసులు |
| రచన | : వాలి | దాశరథి |
| సంగీతం | : విశ్వనాథన్ | విశ్వనాథన్ |
| గానం | : టి.ఎం.సౌందర్‌రాజన్ సుశీల | పి.బి.శ్రీనివాస్, సుశీల |

ఒకే కథతో వేర్వేరు భాషలలో చిత్రాలు నిర్మించి ఎక్కువ విజయాలు సాధించిన ఘనత ఎ.వి.ఎం. సంస్థవారిది. ఎ.వి. మెయ్యప్ప సెట్టియార్ నెలకొల్పిన ఎ.వి.ఎం సంస్థ - ఈనాటికీ చలన చిత్రాలనూ టెలివిజన్ ధారావాహికలనూ నిర్మిస్తూ తన విజయ పరంపర కొనసాగిస్తూ వస్తున్నది.

తమ నిర్మాణంలో విజయం సాధించిన తమిళ చిత్రాలను ఎ.వి.ఎం.వారు ఆ తర్వాత తెలుగులో నిర్మించిన సందర్భాలు ఎన్నో. అటువంటి వాటిలో లేతమనసులు (తమిళమూలం : కుళందైయుం దైవముం), రాము (తమిళమూలం : రాము), మూగనోము (తమిళమూలం: కళత్తూర్ కణ్ణమ్మా) మొదలైనవి ఉన్నాయి. 'కళత్తూర్ కణ్ణమ్మా' చిత్రం తెలుగులో అనువాద చిత్రంగానూ వెలువడింది. ఎ.వి.ఎం. వారి 'అవే కళ్లు' తెలుగు చిత్రం, అదే కథతో తమిళంలో నిర్మించిన 'అదే కణ్‌గళ్' చిత్రం ఒకేసారి రూపొందాయి.

నాయకుడో నాయికో ద్విపాత్రాభినయం చేసిన చలన చిత్రాలు విజయంవంతం కాని సందర్భాలు చాలా తక్కువ అని చెప్పాలి. 'లేతమనసులు' చిత్రంలో ప్రత్యేకతలు: నాయికా, నాయకుల కవల పిల్లలు - ఒక పోలికలో ఉండడం, ఇద్దరూ అమ్మాయిలే కావడం.

బేబీ పద్మిని ధరించిన ఆ ఇద్దరు పిల్లల పాత్రలు - ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించాయి. బాల వేషాలు ఎక్కువ వేయడం వల్లా, అప్పటికే 'పద్మిని' పేరిట ప్రసిద్ధురాలైన ఓ తార ఉండడం వల్లా తేడా తెలియడం కోసం బేబీ పద్మినిని తమిళ చిత్రరంగం వారు 'కుట్టి' (చిట్టి) పద్మిని అని పిలిచేవారు.

ఆ తర్వాత ఆమె పేరు కుట్టి పద్మినిగానే ప్రసిద్ధం. ఆ పేరుతో ఆమె రేడియో నాటకాల్లో కూడా వేషాలు వేశారు.

బేబీ పద్మిని ద్విపాత్రాభినయంతో వెలువడిన 'కుళందైయుం దైవముం' విజయవంతం కావడంతో - ఎ.వి.ఎం. సంస్థ ఆ చిత్రాన్ని తెలుగులో నిర్మించాలని నిర్ణయించింది. తమిళ చిత్రంలో నాయికా నాయకులు -జమున, జయశంకర్. జయశంకర్ అప్పటిదాకా వర్ధమాన కథానాయికలతో నటిస్తూ వచ్చారు. జమున తమిళ ప్రేక్షకులకు పరిచితులే అయినా 'కుళందైయుం దైవముం' విడుదలయ్యే నాటికి ఆమె తమిళ చిత్రాలలో కనిపించి కొన్నేళ్లయింది. అలా ఆ చిత్రం విడుదలకుముందే ఎంతో ఉత్సుకతను రేపింది.

విశ్వనాథన్ రామమూర్తి జంట విడి పోయాక - విశ్వనాథన్ సాధించిన సంగీత విజయాలలో 'కుళందైయుం దైవముం' కూడా ఒకటి. 'కుళందై' అంటే బిడ్డ. 'కుళందైయుం దైవముం' అంటే 'బిడ్డా -దైవమూ' అని అర్థం. 'కుళందైయుం దైవముం' చిత్రంలోని పాటలను కణ్ణదాసన్, వాలి రాశారు. ఆ ఇద్దరూ తమకు రెండు కళ్ల వంటివారు అనే వారు విశ్వనాథన్. పాటల రచనలో సాయపడినవారు పంజు అరుణాచలం.

'కుళందైయుం దైవముం'లోని అన్ని పాటలూ ఎంతో ప్రజాదరణ చూరగొన్నాయి. వాటిలో నాయికా, నాయకుల పరంగా వినిపించిన పాటలలో 'అన్బుళ్ళమాన్‌విళియే' (తెలుగులో - అందాల ఓ చిలకా) అనే పల్లవితో సాగే రెండు పాటలు ఉన్నాయి.

ఈ పాటలలో ఒకటి ఆనందగీతం. మరొకటి విషాదగీతం.

తమిళంలోని ఆ ఆనంద విషాదగీతాలను వాలి రాశారు. టి.ఎం.సౌందరరాజన్, సుశీల పాడారు. 'లేత మనసులు' తెలుగు చిత్రంలో జమున, హరనాథ్ నాయికా నాయకులు. తెలుగు చిత్రంలో కూడా నాయికా నాయకుల కవల పిల్లల పాత్రలను బేబీ పద్మినీయే పోషించారు.

తమిళ చిత్రానికి సంగీతం సమకూర్చిన విశ్వనాథన్ తెలుగు చిత్రానికీ సంగీత దర్శకత్వం వహించారు. ఎం.ఎస్.విశ్వనాథన్ అంటే - 'విశ్వనాథన్ రామమూర్తి' జంటలోని వారే అని పదిమందికీ తెలిసింది. (చాలా రోజులు ఆ జంట సంగీత దర్శకుల పేర్లను 'విశ్వనాథం రామమూర్తి' అనుకునే వాళ్లు కదామరి!)

'అందాల ఓ చిలకా' పల్లవితో మొదలయ్యే తెలుగు పాటలను దాశరథి రాశారు. పి.బి.శ్రీనివాస్, సుశీల గానం చేశారు.

ముందుగా ఆ తమిళ తెలుగు చిత్రాలలోని ఆనంద గీతాలను పరిశీలిద్దాం.

వాలి రాసిన ఆ ఆనంద తమిళ గీతం ఇది :

అ: అన్బుళ్ళ మాన్‌విళియే
ఆశైయిల్ ఓర్ కడిదం
నాన్ ఎళుదువ దెన్న వెండ్రాల్
ఉయిర్ కాదలిల్ ఓర్ కవిదై
ఆ: అన్బుళ్ళ మన్నవనే
ఆశైయిల్ ఓర్ కడిదం
అదై కైగళల్ ఎళుదవిల్లై
ఇరు కణ్‌గళిల్ ఎళుది వందేన్
అ: నలం నలందానా ముల్లై మలరే
సుగం సుగందానా ముత్తు చ్చుడరే
ఇళైయ కన్నియిన్ ఇడై మెలిందదో
ఎడుత్త ఎడుప్పిలే నడై తళర్న్దదో
వణ్ణ పూంగొడి వడివం కొండదో
వాడై కాట్రిలే వాడి నిండ్రదో ॥అన్బుళ్ళ మాన్‌విళియే॥
ఆ: నలం నలందానే నీ ఇరుందాల్
సుగం సుగం దానే నినై విరుందాల్
ఇడై మెలిందదు ఇయర్కై అల్లవా
నడై తళర్న్దదు నాణం అల్లవా
వణ్ణ పూంగొడి పెణ్‌మై అల్లవా
వాడ వైత్తదుం ఉన్‌మై అల్లవా ॥అన్బుళ్ళ మన్నవనే॥
ఆ: ఉనక్కోరు పాడం శొల్ల వందేన్
ఎనక్కోరు పాడం కేట్టుక్కొండేన్
అ: పరువం ఎన్బదే పాడం అల్లవా
పార్వై ఎన్బదే పళ్ళి అల్లవా
ఇ: ఒరువర్ శొల్లవుం ఒరువర్ కేట్కవుం
ఇరవుం వందదు నిలవుం వందదు
అ: అన్బుళ్ళమాన్ విళియే

ఆ: ఆశైయిల్ ఓర్ కడిదం
అ: అదై కైగళిల్ ఎళుద విల్లై
ఆ: ఇరు కణ్‌గళిల్ ఎళుది వందేన్








నాయిక, నాయకుడికి పాఠం చెప్పాలనుకొంది. చివరికి తానే పాఠం నేర్చుకొంటుంది. అంతే కాదు. ఇద్దరూ కలిసి ప్రణయపాఠాలు మొదలు పెడతారు.

'మాన్‌విళి' అంటే 'లేడికన్నులున్న స్త్రీ' అని అర్థం. ప్రబంధ కవుల భాషలో చెప్పాలంటే 'హరిణేక్షణ'. అన్బుళ్ళ మాన్‌విళియే' అంటే ప్రియమైన హరిణేక్షణా' అని అర్థం.

పాట సన్నివేశం - నాయకుడు ఒక కాగితం మీద తన పక్కనే కూచుని ఉన్న నాయికకు ఉత్తరం రాయడంతో మొదలవుతుంది. నాయకుడు కాగితం మీద కవిత రాస్తున్నానంటే -నాయిక తన కవిత కళ్లతో రాస్తున్నానంటుంది.

పాట చెప్పే భావాలు ఇవి:

అ: లేడి కన్నుల ప్రియురాలా
ఆశ(ప్రేమ)తో ఒక ఉత్తరం
నేను రాస్తున్న దేమిటంటే
ప్రాణ (సమాన)మైన ప్రేమతో ఒక కవిత
ఆ: ప్రియమైన రాజా (నాయకుడా)
ఆశ(ప్రేమ)తో ఒక ఉత్తరం
దాన్ని చేతులతో (చేత్తో) రాయ(డం) లేదు
రెండు కళ్లలో రాసుకు వచ్చాను (రాస్తున్నాను)
అ: (నేను) క్షేమం నీవు క్షేమమేనా మొల్ల (జాజి)పూవా
నేను సుఖం (గా ఉన్నాను) నీవు సుఖమేనా ముత్యాల దీపమా
లేత వయసు కన్నె నడుము ఎందుకు సన్నబడిందో
అడుగు పెట్టగానే నడక ఎందుకు తడబడిందో
రంగుల పూలతీగ ఆకారాన్ని ధరించిందా?
వడగాలికి వాడి నిలిచిందా? ॥లేడి కన్నులు॥
ఆ: క్షేమం క్షేమమే నీవుంటే
సుఖం సుఖమే (నీ) జ్ఞాపకముంటే
నడుము సన్నబడడం (ప్రకృతి) సహజమే కదా
నడక తడబడడానికి కారణం సిగ్గే కదా
రంగుల పూల తీగ స్త్రీత్వమే (కదా)
వాడిపోయేలా చేయడం నిజమే (కదా) ॥ప్రియమైన॥
ఆ: నీకొక పాఠం నేర్పాలని వచ్చాను
నాకొక (నేనొక) పాఠం నేర్చుకున్నాను
అ: పరువమన్నదే పాఠం కదా
చూపు (అన్నదే) పాఠశాల కదా
ఇ: ఒకరు చెప్పగా ఒకరు వినగా
రాత్రి వచ్చింది వెన్నెలా వచ్చింది
అ: లేడికన్నుల ప్రియురాలా
ఆ: ప్రేమతో ఒక ఉత్తరం
అ: అది చేత్తో రాయలేదు
ఆ: రెండు కన్నులలో రాసుకు వచ్చాను

"పక్కనే కూచున్న ప్రేయసికి ప్రణయ లేఖ రాయడానికి చేత్తో పని ఏముంది? కన్నులు చాలవా"? అన్నది నాయిక ప్రశ్న. 'ఎళుది వందేన్' అనే పద సంబంధానికి 'రాసుకొని వచ్చాను', 'రాస్తున్నాను' అని రెండు రకాలుగా అర్థాలు చెప్పుకోవచ్చు. రాయడానికి ఒక చేయి చాలుకాని, ఆ రాస్తున్న లేఖను పట్టుకోవడాని రెండో చేయి అవసరమన్న దృష్టితో 'చేతులతో రాయడం లేదు' అని రాసినట్టు కనిపిస్తుంది.

'నేను క్షేమం నీవు క్షేమమా?','నేను సుఖం నీవు సుఖమా?' అని ఉత్తరం మొదలు పెట్టడం చాలా మంది తమిళులు పాటించే సంప్రదాయం. పాత రోజుల్లో ఉత్తరాలు రాసే వాళ్లు చాలామంది పైన 'క్షేమం' అని రాసి ఆ ఉత్తరంలో అంతా క్షేమమైన విషయాలే ఉన్నాయని సూచించే సంప్రదాయమూ ఉండేది కదా! (ఉదా॥ ఉభయకుశలోపరి)

ఆ నాయిక హరిణేక్షణ. జాజి పువ్వు వంటి సుకుమారి. ముత్యాల జ్వాల. లేత వయసులో ఉన్నది. రంగుల పూల తీగ ఆకారం ధరించినట్టు ఉంది.

ఆమె క్షేమంగా ఉండాలంటే నాయకుడు ఆమెకు తోడుగా ఉండాలట. ఆమె జ్ఞాపకం అతనికి ఉంటే ఆమె సుఖంగా ఉంటుందట. లేత వయసులో నడుము సన్నబడం సహజమేనట. సిగ్గు వల్ల ఆమె నడక తడబడిందట. కాని పాఠం నేర్పుతానని వచ్చిన తాను పాఠం నేర్చుకోవలసి వచ్చే సరికి ఆమె వాడిపోయిందట! పాఠం ప్రస్తావన రాగానే ఇద్దరూ ప్రణయంలో పడ్డారు. ఒకరు చెబుతుండగా మరొకరు వినడంతో - కాలం ఎలా గడిచిందో తెలియక రాత్రి అయి ప్రణయానికి దోహదం చేసే వెన్నెల అంతటా పరచుకొందట!

విశ్వనాథన్ తమిళంలో వినిపించిన బాణికి తగ్గట్టు తెలుగు పాటను రాసిన వారు దాశరథి.

ఆ తెలుగు పాట :

అ: అందాల ఓ చిలుకా
అందుకో నా లేఖ
నా మదిలోని కలలన్నీ
ఇక చేరాలి నీ దాకా
ఆ: అందాల చెలికాడా
అందుకో నా లేఖ
నా కనులతో రాశాను
ఈ మదిలోన దాచాను
అ: మిసమిస లాడే వెందుకనీ
తళతళలాడే వేమిటనీ
కురులు మోముపై వాలెనేలనో
విరులు కురులలో నవ్వె నెందుకో
అడుగు తడబడె చిలకకేలనో
పెదవి వణికెలే చెలియ కెందుకో ॥అందాల॥

ఆ: మిసమిసలాడే వయసోయి
తళతళలాడే కనులోయి
కురులు మోముపై మరులు గొనెనులే
విరులు కురులలో సిరులు నింపెలే
అడుగు తడబడె సిగ్గు బరువుతో
పెదవి వణికెతే వలపు పిలుపుతో ॥అందాల॥
ఆ: నీవే పాఠం నేర్పితిని
నీవే మార్గం చూపితివి
అ: ప్రణయ పాఠము వయసు నేర్పులే
మధుర మార్గము మనసు చూపులే
ఆ: నీవు పాడగా నేను ఆడగా
ఇ: యుగము క్షణముగా గడిచిపోవుగా
అ: అందాల ఓ చిలకా
ఆ: అందుకో ఈ లేఖ
అ: నా మదిలోని కలలన్నీ
ఆ: ఇక చేరాలి నీ దాకా



తమిళగీతం సన్నివేశంలో నాయికా నాయకులు కొంత దూరంగా కూచుని ఉండగా పాట మొదలవుతుంది. తెలుగు చిత్రంలో నాయకుడు రాస్తున్నదేమో చూడాలని నాయిక ప్రయత్నిస్తుంటే- అతను దాన్ని ఆమెకు కనబడనీకుండా దాస్తూ ఈ పాట మొదలు పెడతాడు. తమిళ చిత్రంలోని పాటలు ఒక జడతో కనిపించిన జమున తెలుగు పాట సన్నివేశంలో రెండు జడలతో కనిపిస్తారు.

'లేఖ' అనే పదాన్ని సాగదీసి 'లేఖా' అని పాటంతా వినిపించారు.

తమిళగీతంలోని కన్నులు లేఖ రాసే ప్రస్తావన తెలుగులోనూ ఉంది. తమిళ గీతంలో నాయిక, నాయకుడి చెలిమి కలిమిని కోరుతున్నట్టు ఉన్న భావాలు తెలుగు పాటలో కనిపించవు. అడుగు తడబడే ప్రస్తావన రెండు పాటల్లోనూ ఉంది. పెదవి వణకడం - తెలుగు పాటకు ప్రత్యేకం.

తమిళగీతంలో నాయిక స్పష్టంగా తన లేఖ కళ్లతో రాసుకువచ్చాను అని చెబుతుండగా -తెలుగు పాటలో నాయిక ఆ లేఖను కనులతో రాసి మనసులో దాచానని చెబుతున్నది! దాశరథి ఈ పాటను స్వతంత్ర గీతంగా రూపొందించే ప్రయత్నంలో కృతకృత్యులయ్యారని చెప్పాలి.

తమిళగీతం కన్నా తెలుగు పాట బాగుందనిపించడానికి ఇద్దరు కారకులు. ఆ ఇద్దరూ - పి. సుశీల, పి.బి. శ్రీనివాస్.

**-పి.ఎస్.గోపాలకృష్ణ**

# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## హైదరాబాద్



'ప్రమిదలో కళికలా వెలుగునిస్తాం' పాటపాడి బహుమతి గెలుచుకున్న అంధబాలికలు


పల్లెజీవితానికీ, పట్నంజీవితానికీ తేడాలు చెప్పే మోహనకృష్ణ, సుబ్రహ్మణ్యం మిమిక్రీ జుగల్‌బందీ

ఆంధ్రబాలానందసంఘంలో సెప్టెంబరు 25 న రెండుగంటలపాటు సాగిన కార్యక్రమంలో 34 మంది హాస్యానికి, సంగీతానికి సంబంధించిన ఐటమ్స్‌తో సభను మెప్పించారు. వీరిలో ఔత్సాహికులతో బాటు, వృత్తికళాకారులూ ఉన్నారు. చిన్నపిల్లలతో బాటు వయోవృద్ధులూ ఉన్నారు. నలుగురు మిమిక్రీ చేశారు, పన్నెండుమంది జోక్స్ చెప్పారు. ధర్మాచార్యులు గల్పిక చదివి బహుమతి గెల్చుకున్నారు. ఐదుగురు భక్తిగీతాలు, ముగ్గురు లలితగీతాలు, ముగ్గురు ప్రబోధగీతాలు ఆలపించగా తక్కినవారు సినిమాపాటలు పాడారు. వాటిలో ఒకటి 'ఘల్లు, ఘల్లు' అనే కన్నడపాట! ఎలక్షన్ కమీషనర్ కాకి మాధవరావు 'తలుపు తీయనంతలో తత్తరమది యేలనోయి' (బాలసరస్వతి పాట) పాడగా, లక్ష్మణస్వామి 'చల్లగాలిలో యమునాతటిపై' (రాజేశ్వరరావు పాట) పాడారు. ఈ నెలలో పుట్టిన భానుమతి విశేషాలు సభ నిర్వహించిన స్టేట్ కన్వీనరు ఎస్.వి. రామారావు తెలుపగా బేబీ చైత్ర ఆమె పాడిన 'లోకమెరుగని బాలా' పాడి వినిపించారు.

హేమంత్‌కుమార్ వర్ధంతి సందర్భంగా'హాసం' మేనేజింగ్ ఎడిటర్ ఎమ్బీయస్ ప్రసాద్ ఆయన జీవితవిశేషాలను తెలిపి ఇదే నెలలో జన్మదినం జరుపుకున్న లతాతో ఆయన పాడించిన 'కహీదీప్ జలే' పాట వివరాలు చెప్పగా అంజనా ప్రియాంక ఆ పాట పాడి వినిపించారు. 'అలై పొంగెరా కన్నా' పాటతో మహిత, వ్యంగ్యకవితతో చిమ్మపూడి శ్రీరామమూర్తి సదస్యులను ఆకట్టుకున్నారు. వచ్చే కార్యక్రమం అక్టోబరు 30 సాయంత్రం బాలానందసంఘంలోనే జరుగుతుందని ప్రకటించారు.


భానుమతి జన్మదినం సందర్భంగా 'ప్రేమా, పిచ్చీ ఒకటే' పాడిన పి.కమల


ఎమ్బీ ప్రసాద్‌తో తన అనుభవాలు ముచ్చటిస్తున్న 'పెళ్లిచేసి చూడు' బాలనటుడు 'మాస్టర్' కుందు

## పలసా

సెప్టెంబరు 26 న జరిగిన సమావేశం ప్రారంభిస్తూ కన్వీనరు డా॥ రామినాయుడు ప్రతి కార్యక్రమంలోనూ కొత్త, కొత్త కళాకారులు పాల్గొని సభను రక్తి కట్టిస్తున్నందుకు సంతోషంగా ఉందని అన్నారు. ఆ వారంలో 80 సంవత్సరాలు పూర్తి చేసుకున్న అక్కినేని నాగేశ్వరరావు గారికి అభినందనలు తెలుపుతూ 'మిస్సమ్మ', 'తెనాలి రామకృష్ణ' 'చక్రపాణి' 'పెళ్లిసందడి' వంటి సినిమాలలో వారు నటించిన హాస్యపాత్రలను గుర్తు చేసుకోవడం జరిగింది. వాటితో పాటు 'జయభేరి' 'సంగీతసామ్రాట్' 'మేఘసందేశం' వంటి సంగీతభరిత చిత్రాలలో కథానాయకుడిగా నటించి ఆ యా సినిమాలలోని పాటలకు ప్రాణం పోశారని శ్లాఘించడం జరిగింది. ద్వారకానాథ్, బి.వి.రమణమూర్తి, ఆదినారాయణ, లాబాల ప్రకాష్, ఉమాపతి బెహర, సహాయ కన్వీనరు బూర్జికోటేశ్వరరావు, హెచ్.మురళి తదితరులు హాస్య, సంగీత అంశాలతో సభను మెప్పించగా వ్యాఖ్యాతగా శ్రీనివాస బాల్జీ, గుణనిర్ణేతలుగా చీకటి కామేశ్వరరావు, కె.విశ్వేశ్వరరావులు వ్యవహరించారు. కిమ్మోజి మోహనరావు, మల్లా గుణవంతరావులు బహుమతులు గెల్చుకున్నారు.

తదుపరి కార్యక్రమం అక్టోబరు నెలలో చివరి శనివారం (30-10-04) జరుగుతుంది.



కిమ్మోజికి బహుమతి ప్రదానం

### ఈ పక్షం సమావేశాలు

| | | | |
|---|---|---|---|
| రాజమండ్రి | 17 10 04 | 6.00p.m | విక్రమహాలు |
| వైజాగ్ | 17 10 04 | 6.00p.m | ప్రేమసమాజం |
| ఏలూరు | 17 10 04 | 6.35p.m | జిల్లా లైబ్రరీ |
| హైదరాబాద్ | 30 10 04 | 6.35p.m | బాలానందసంఘం |
| పలసా | 30 10 04 | 6.35p.m | డా॥రామినాయుడు క్లినిక్ |

'హాసం క్లబ్' ప్రారంభించదలచినవారు సంప్రదించవలసినది
శ్రీ ఎస్.వి.రామారావు, 040-24160279, 98491 39030

### పలసా 'హాసంక్లబ్'లో వినబడిన జోక్

నాలుగేళ్ల చిట్టి ఇంటికి వాళ్ల నాన్నగారి ఫ్రెండు ఓ పెద్దకుక్కను వెంటబెట్టుకు వచ్చారు. చిట్టిని ఇంప్రెస్ చేద్దామని, "పాపా, మా కుక్క పేరేమిటో తెలుసా? సీజర్, గిజర్ లాటి ఇంగ్లీషు పేరు కాదు. చక్కగా 'విక్రమాదిత్య!'" అన్నాడాయన.

"ఓహో" అని ఊరుకుంది చిట్టి.

చిట్టి ఆనందించినట్టు కనబడకపోవడంతో ఆయనకు అనుమానం వచ్చింది - "ఇంతకీ విక్రమాదిత్య అంటే ఎవరో నీకు తెలుసా?" అని అడిగాడు.

"తెలియకపోవడమేం? ఇప్పుడే చెప్పారుగా, కుక్క అని." అంది చిట్టి.

# తాతా థిత్తై తథిగిణతోం

సీరియల్ 22

| పాత్రలు | నటీనటుల సజేషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

- జీడిగుంట రామచంద్రమూర్తి



## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్విని తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. ఆమె ఇచ్చిన ధైర్యంతో చండశాసనుడైన తండ్రి వీరభద్రాన్ని ఎదిరిస్తాడు శ్రీరామ్. వీరభద్రం వల్ల గతంలో అవమానం పొందిన విష్ణుమూర్తి మేనల్లుడు గోపాలానికి కూతుర్ని ఇద్దామనుకున్నా అశ్విని ఆత్మహత్యాప్రయత్నంతో భయపడి శ్రీరామ్‌తోనే పెళ్లి జరిపిస్తాడు. వారి శోభనం జరగడానికి కొన్ని గంటల ముందు ఓ సాధువు ఎక్కడినుండో వచ్చి కోడలు గర్భం దాలిస్తే నీకు చావు తప్పదని వీరభద్రాన్ని హడలగొడతాడు. దాంతో కొత్తదంపతులు కలవకూడదని ఆంక్షలు విధిస్తాడు వీరభద్రం!

- ఇక చదవండి

"గుడ్‌మార్నింగ్ సార్!" అన్న పలకరింపు వినిపించి -కళ్లు తెరచి చూశాడు.

ఎదురుగా 'స్ప్రింగ్ డోర్' తెరుచుకుని లోపలకు వస్తున్న సర్కిల్ ఇన్‌స్పెక్టరు సదాశివం కనిపించాడు....

"రండి ఇన్‌స్పెక్టర్!" - సాదరంగా అతన్ని ఆహ్వానించాడు విష్ణుమూర్తి.

"చిన్న ఇన్ఫర్మేషన్ కోసం వచ్చాను సార్!" -అతని కెదురుగా వున్న కుర్చీలో కూర్చుని, తలమీది 'క్యాప్' తీసి టేబుల్ మీద పెడుతూ చెప్పాడు ఇన్‌స్పెక్టర్...

"చెప్పండి ..దేని గురించీ..?" అని అడుగుతూనే బజర్ నొక్కాడు విష్ణుమూర్తి మరుక్షణంలో, బోయ్ వచ్చి నిలబడ్డాడు...

"జ్యూస్ తీసుకురా!" వాడికి ఆర్డరేశాడు.. తర్వాత ఆసక్తిగా, కొంచెం ముందుకు వంగి - ఇన్‌స్పెక్టర్ వైపు చూశాడు.

"ఆ మధ్య, మీ అమ్మాయీ, అల్లుడూ షాపింగ్ నించివస్తూంటే కొంతమంది రౌడీలు దారికాసి దోచుకోబోయారు... గుర్తుంది కదా?"

"అవును !... దోపిడీ ఏం జరగలేదుగా?.. పైగా మా అల్లుడు వాళ్లకు తగిన బుద్ధి చెప్పాడు కదా !"

"కరక్టే... అపుడు వాళ్లల్లో ఒకడు మాకు దొరికిపోతే లాకప్‌లోవేశాం ! వాడిపేరు రజాక్.. 'రాజు' అనే మారుపేరు కూడా వుంది.. ! నాలుగు రోజుల తర్వాత హైద్రాబాద్ నుంచి ఓ పెద్దమనిషెవరో వచ్చి - జామీను మీద వాణ్ణి విడిపించుకు పోయాడు!"

"అయితే ?" - అర్థంకానట్టు చూస్తూ అడిగేడు విష్ణుమూర్తి.

"వాడు -అదే -ఆ రాజు, బాషా మనిషి!"

"బాషానా?..వాడెవడు?" అడిగేడు విష్ణుమూర్తి.

"ఓ పేరుమోసిన గూండా !.. వాడికి రాజకీయ నాయకుల అండదండలు పుష్కలంగా వున్నాయి.. ఆ పలుకుబడితో ఎన్నో రకాల అరాచకాలు చేస్తూంటాడు. వాడికి పెద్ద 'నెట్‌వర్క్' వుంది !.. వాడి ముఠా మనుషులు ప్రభుత్వభూముల్ని కబ్జా చేస్తుంటారు. నకిలీ పాస్‌పోర్టులూ, స్టాంపు కాగితాలూ, యూనివర్సిటీ సర్టిఫికెట్లూ తయారు చేస్తుంటారు.. అవసరమైతే దారిదోపిడీలూ మర్డర్లు కూడా చేస్తుంటాడు.." చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

అంతలో ఆఫీసు బోయ్ రెండు గ్లాసుల్తో పళ్ళరసం తెచ్చి వాళ్ళముందు పెట్టాడు.

"ఇంతకీ ఆ బాషా గురించి -నా కెందుకు చెప్తున్నారో, ఆ విషయాల్లో నేను మీకు ఎలాంటి ఇన్ఫర్మేషన్ ఇవ్వగలనో - అర్థం కావటంలేదు" అన్నాడు విష్ణుమూర్తి పళ్లరసం తాగుతూ.

"ఈ మధ్య హైద్రాబాద్‌లో ఓ బ్యాంకు దొంగతనం జరిగింది.. ఆ దొంగతనం చేసినవాళ్ళల్లో -అప్పట్లో మీ అల్లుడి మీద దాడి చేసిన 'రజాక్' కూడా వున్నట్టు పోలీసులకు సమాచారం అందింది!.."

"అయితే ..?"

"ఆ కేసు 'ఎంక్వయిరీ'లో కొన్ని వివరాలు కావాల్సి వచ్చాయి... ఎక్కడో హైదరాబాదులో వుండే ఆ రజాక్, ఈ ఊరు ఎందుకొచ్చాడో, మీ అల్లుడి మీద ఆరోజు ఎందుకు దాడి చేశాడో తెలుసుకోవాలి!... అతనికీ, మీ అల్లుడికి మధ్య పాత కక్షల్లాంటివి ఏవైనా.."

"మీరు చెప్పేది చాలా సిల్లీగావుంది!... అయినా అలాంటి గొడవల జోలికీ, రౌడీల జోలికీ వెళ్లేరకం కాదు మా అల్లుడు..!" ఇన్‌స్పెక్టర్ని పూర్తిగా చెప్పనివ్వకుండానే -అతనివైపు అసహనంగా చూస్తూ అన్నాడు విష్ణుమూర్తి.

"సారీ!.. నా ఉద్దేశ్యం అదికాదు... అసలు ఆ రోజున మీ అల్లుడిగారి మీద దాడిఎందుకు జరిగిందో - ఆ విషయానికి సంబంధించిన పూర్వాపరాలు తెల్సుకోవాలని వచ్చాను.... అంటే, అయ్‌మీన్.. కేవలం దొంగతనానికేనా - లేక వేరే ఏదైనా 'మోటివ్' వుందా - అనే విషయం ఎంక్వయిరీచేద్దామనీ..."

ఇన్‌స్పెక్టర్ చెప్పిందంతా విని -క్షణంసేపు ఆలోచించి -ఓ నిర్ణయానికి వచ్చినవాడిలా, బల్లమీదున్న 'సెల్‌ఫోన్' తీసి - గబగబా కొన్ని నెంబర్లు నొక్కేడు విష్ణుమూర్తి.

"హలో డాడీ !"- అవతల్నించి అశ్విని గొంతు వినిపించి...

"హాయ్ బేబీ... ఎలా వున్నావ్?" -అడిగేడు.

"ఓ.కె. !..మామూలే!"

"నీ చాదస్తం మావ ఏవంటున్నాడూ?"

"పాత పాటే పాడుతున్నాడు.. నేనూ శ్రీరామ్ పదినిమిషాలపాటైనా కలిసి కబుర్లు చెప్పుకునేందుకు ఛాన్సివ్వకుండా - మా వెనకాల 'బాడీ గార్డులా' తిరుగుతున్నాడు..." చిరుకోపం ప్రదర్శిస్తూ చెప్పింది అశ్విని....

"టేకిట్ ఈజీ మై బేబీ..! పెద్దాయన ...! నువ్వలా మాట్లాడకూడదు.. ఇంతకీ అల్లుడు ఇంట్లో వున్నాడా ?" అడిగేడు విష్ణుమూర్తి.

"ఉన్నారు డాడీ!"

"ఓ సారి ఫోనివ్వు -అతనికి!"

కొన్ని క్షణాల తర్వాత - అవతల్నించి శ్రీరామ్ గొంతు వినిపించింది -

"హలో అంకుల్...!"

"హలో శ్రీరామ్ !..ఇక్కడి ఇన్‌స్పెక్టర్‌గారికి - నీ నించి ఏదో ఇన్ఫర్మేషన్ కావాలట!"

"ఇన్ఫర్మేషన్ ?... దేని గురించీ?" అడిగాడు శ్రీరామ్.

"ఇదిగో !... ఆయన ఇక్కడే వున్నారు.. ఆయనతో మాట్లాడు!" -అంటూ తన చేతిలో వున్న 'సెల్‌ఫోన్' -ఇన్‌స్పెక్టర్‌కి ఇచ్చాడు.

"గుడ్‌మార్నింగ్ శ్రీరామ్ ! ...సారీ టూ బాదర్ యూ!" చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

"చెప్పండి సార్... !"

"మరేం సీరియస్ 'మ్యాటర్' కాదు.. నాలుగు నెలలక్రితం మీరూ, మీ మిసెస్సూ షాపింగ్‌కి వెళ్లి -కార్లో తిరిగి వస్తూంటే- కొంతమంది రౌడీలు మీ మీద 'ఎటాక్' జరిపారు .... గుర్తుందిగా?"

"యస్!....గుర్తుంది.. ఆ మర్నాడే మా డ్రైవర్ చేత మీరు రిపోర్టు రాయించుకున్నారుగా?"

"ఆఫ్‌కోర్స్.. అదేం ప్రాబ్లం కాదు.. అసలు, వాళ్లు దొంగతనానికి దారికాశారా, లేక మీ మీద పాత కక్షతో -"

"నో..నో ! పాతకక్షల్లాంటివి వుండే ఛాన్సేలేదు....అసలు వాళ్లెవరో నాకు తెలీదు.. కాలేజీలో కూడా నాకెవరూ శత్రువులు లేరు.. కానీ. అంతకు ముందు ఓసారెపుడో రోడ్డు మీద నాకో ఖాళీ పర్సు దొరికితే - ఆ పర్సు తాలూకు కుర్రాళ్లు నాతో గొడవ పడ్డారు.. బట్.. వాళ్లూ, వీళ్లూ ఒకరు కాదు !"

"ఐసీ!"

"ఆ! ..అన్నట్టు మరో ముఖ్యవిషయం!"

"ఏమిటీ?"

"వాళ్లు నలుగురూ మా మీద కొస్తుంటే... మా డ్రైవరు భయపడ్డాడు. వాళ్లెవరో రౌడీల్లాగా వున్నారనీ -వాళ్ళ జోలికి వెళ్ళటం మంచిది కాదనీ చెప్పాడు.. మేం షాపింగు చేసినవన్నీ వాళ్ళ ముఖాన కొట్టేసి ప్రాణాల్తో బయటపడదామని సలహా ఇచ్చాడు.. కానీ వాళ్ళల్లో ఒకడు తమకు



నగలు అవసరంలేదనీ నా ప్రాణాలు కావాలనీ చెప్పి - కత్తి చూపిస్తూ నా మీద కొచ్చాడు.. అయినా నేను వాళ్ళకి బాగానే బుద్ధి చెప్పేనుగా!"

"అదిరైటే ..కానీ... వాడు మీ ప్రాణాలు ఎందుకు తీయాలనుకున్నాడో?... ఆ విషయం తెలుసుకోవాలనీ..

"అది మీ బాధ్యత.. మీరు తెలుసుకుని నాకు చెప్పండి!" అన్నాడు శ్రీరామ్...

ఇన్‌స్పెక్టర్ వెంటనే మరేం మాట్లాడలేక పోయాడు.. ఇంతలో మళ్లీ శ్రీరామ్ ఏదో గుర్తుకొచ్చిన వాడిలా చెప్పాడు - "ఆ! అన్నట్టు వాళ్లు బాషా తాలూకు మనుషులనీ, పాతబస్తీలో పసిపాపలకు క్కూడా బాషా తెలుసుననీ చెప్పాడు!"

"ఓ.కే!.... థాంక్స్ ఫర్‌ది ఇన్ఫర్మేషన్ !" అంటూ సెల్‌ఫోన్ ఆఫ్ చేసి -దాన్ని తిరిగి విష్ణుమూర్తికి అందించాడు.

"ఎనీ థింగ్ సీరియస్?" -అడిగేడు విష్ణుమూర్తి వెంటనే.

"నో..నో ! భాషా గురించీ, అతని గురించీ సి.బి.ఐ. వాళ్లు ఎంక్వయిరీ చేస్తున్నారు. ఆ విషయంగా అతని ముఠాలోని మనుషుల గురించీ వాళ్ళ కార్యకలాపాల గురించీ కూడా ఆరా తీస్తున్నారు ! ఇదంతా మా డ్యూటిలో ఓ భాగం.. దట్సాల్... నథింగ్ సీరియస్... వస్తాను"! అంటూ శలవు తీసుకుని వెళ్లిపోయాడు ఇన్‌స్పెక్టర్ సదాశివం..

* * *

ఆ సాయంత్రం స్కూల్లో ఏదో సాంస్కృతిక కార్యక్రమాలు జరగటం వల్ల - రాత్రి బాగా పొద్దు పోయాక ఇంటికొచ్చాడు శ్రీరామ్.

పార్వతమ్మ భోజనం వడ్డించింది... ఈలోగా కాళ్లూ చేతులూ కడుక్కుని, బట్టలు మార్చుకుని వచ్చాడు శ్రీరామ్.

"అశ్విని భోంచేసిందా?" కంచం ముందు కూర్చుంటూ యధాలాపంగా అడిగేడు.

"లేదు .. ఆకలిగా లేదట... పడుకుంది" - చెప్పింది పార్వతమ్మ.

"నేను పిల్చుకొస్తానుండు!" అంటే లేచి, ఆతృతగా ఆమె గదిలోకి వెళ్లాడతను. మంచం మీద తెల్లని చీరలో 'మంచుశిల్పం' లా -కళ్ళకు మోచేయి అడ్డంగా పెట్టుకుని పడుకుని వుంది అశ్విని.

అశ్విని దగ్గరగా వెళ్లి పిలిచాడు.

ఆమెలో చలనం లేదు.. ఆమె ఒంటి సొంపులు అతణ్ని విచలితుణ్ణి చేస్తూంటే కొన్ని క్షణాల పాటు అలాగే చూస్తూ నిలబడి పోయాడు.. ఆ తర్వాత,ఎలాగో తనను తాను నిగ్రహించుకుని - దగ్గరగా వెళ్లి -ఆమె చేతిమీద తన చేయి వేసి మళ్లీ పిలిచాడు.

అశ్విని ఉలికిపాటుతో కళ్లు తెరిచి -చటుక్కున శ్రీరామ్ చేతిని తన చేతిలోకి తీసుకుంది.

"భోంచేద్దాం ..రా!" సుతారంగా చేయి విడిపించుకుంటూ అన్నాడు...

"కడుపాకలి తీరితే చాలదు మాస్టారూ!... మనసాకలి కూడా తీరాలి!" అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ చెప్పింది...

ఆ చూపుని తట్టుకోలేక తలదించుకున్నాడు.

"ఇందాక మా ఫ్రెండు మందాకిని ఫోన్ చేసింది!" వెంటనే చెప్పిందామె.

ప్రశ్నార్ధకంగా చూశాడు శ్రీరామ్.

"నీకు తెలీదేమో -అదీ నేనూ, కాలేజిలో ప్రాణస్నేహితులం!... మన పెళ్ళిజరిగిన మూడో రోజునే -దానికీ పెళ్ళయింది!... అందుకే నా పెళ్లికి అది రాలేకపోయింది. నేనూ దాని పెళ్లికి వెళ్లలేక పోయాను!"

"ఇంతకీ ఏమంటుంది తను ?... మనూరు వస్తానందా?"ఏదో అడిగాలి కనుక అడనట్టు అడిగేడు శ్రీరామ్.

"లేదు !.... నన్నే తన ఊరు రమ్మంది !"

"ఏమిటో విశేషం?"

"కొత్తగా పెళ్ళయిన ఆడపిల్లలకు కోరినన్ని విశేషాలుంటాయి!.. కానీ, నా జాతకమే ఇలా అఘోరించింది !" మూతి మూడు వంకర్లు తిప్పుతూ చెప్పింది.

ఏం మాట్లాడాలో తెలీక గతుక్కుమన్నాడు శ్రీరామ్.

"తనకి నెల తప్పిందట"

"వెరీ గుడ్!"

"గాడిద గుడ్డు !.. దానికి 'ప్రెగ్నెన్సీ' వస్తే-నువ్వు, 'వెరీగుడ్' అంటావేమిటి?.. ఒళ్లు మండిపోతోంది!" బుసకొడుతున్న పాములా చురుక్కున చూసిందామె.

శ్రీరామ్ షాకయ్యాడు.

"అందుకే నేనో ఓనిర్ణయాని కొచ్చాను!" వెంటనే చెప్పిందామె.

"ఏమిటదీ?"

"వచ్చే శనివారం నా పుట్టినరోజు ..పైగా మంచి రోజులు.."

"వండ్రవుల్!.. అడ్వాన్స్‌గా నీకు నా శుభాకాంక్షలు .. ఆ సందర్భంగా నీకేం కావాలో కోరుకో.. తెచ్చేస్తా!" అవెనను పూర్తిగా చెప్పనీయకుండా - ఉత్సాహంగా భుజాలు పట్టుకుని కుదిపేస్తూ అన్నాడు శ్రీరామ్.

"నువ్వేం తెచ్చివ్వనఖ్ఖర్లేదు!... నన్ను హనీమూన్‌కి తీసుకెళ్లు ...చాలు!"

"హనీమూన్‌కా"!.. ఆశ్చర్యంగా చూస్తూ అడిగేడు.

"హనీమూనంటే-కాశ్మీర్‌రో, కన్యాకుమారికో వద్దులే!.. పక్కనున్న బెజవాడకో - ఆ పైనున్న విశాఖపట్నానికో తీసుకెళ్లు.. అడ్జస్టయి పోతాను! డబ్బు కావాలంటే, మా నాన్న రాసిచ్చిన చెక్కులున్నాయి .. ఒకటి మార్చుకుందాం..!"

"చెక్కులు వున్నాయి సరే! కానీ మానాన్నతో చిక్కులున్నాయి కదా ?.. ఆయనగారు ఒప్పుకోవద్దూ?"

"నాన్నగారూ ! ..మేం హనీమూన్‌కి వెళ్లొస్తాం!.. ఆశీర్వదించి పంపించండి అని అడుగుతారా?"

"మరి ప్రయాణం ఎక్కడికిరా బడుద్ధాయ్?' అని ప్రశ్నిస్తే !.. ఏం చెప్పాలీ?"

"కహానీ !.. అదే.. స్టోరీ!... అంటే కథ. కథ చెప్పాలి!.. ప్రేమించి పెళ్లాడిన భార్యకోసం అవసరమైతే భర్త కథలు చెప్పాలి.. అది రూలు!.. షాజహాన్ చక్రవర్తి తన భార్యకోసం అందమైన తాజ్‌మహల్‌నే కట్టించాడు.. అలాంటిది ఆఫ్టాల్ -నువ్వో కథ చెప్పలేవా?..."

"అదే.. ఏం చెప్పాలీ... అని !" బుర్రగోక్కున్నాడు శ్రీరామ్

"శ్రీరామచంద్రప్రభూ!.. నేనో ప్లాన్ వేశాన్లే!.. అదంతా వివరంగా కాగితంమీద రాసిస్తా ! ఆ ప్రకారం చెయ్యి ..చాలు !"

"కానీ.. ఒకవేళ... మీ మందాకినికి తప్పినట్టే నీకూ నెల తప్పి, ప్రెగ్నెన్సీ వచ్చి ఆ స్వామిజీ చెప్పినట్టు మానాన్న.. " తటపటాయిస్తూ చెప్తున్న శ్రీరామ్‌ని వారించి - అతని పెదాల్ని తన మునివేళ్లతో సుతారంగా మూసింది..

"మీ నాన్నగారి ప్రాణాలకేం భయంలేదు. ఆ గ్యారంటీ నాదీ!.. మధ్యాన్నం రేడియోలో 'మహిళా మండలి' కార్యక్రమం విన్నాను. అందులో ఎవరో లేడీ డాక్టరు. తా.కు.ని. పద్ధతుల గురించి చెప్పింది..."

"తా.కు.ని వద్ధతులా?...అంటే ?" -అయోమయంగా చూస్తూ అడిగేడు శ్రీరామ్.



"తాత్కాలిక కుటుంబ నియంత్రణ పద్ధతులు! అవి పాటిస్తే నాకు నెలా తప్పదు, నువ్వు మాటా తప్పవ్..నేను రేప్పొద్దున్నే - ఎదో వంకతో ఆరోగ్యకేంద్రానికి వెళ్లి ఆడవాళ్లు వాడే 'పిల్స్' తెచ్చుకుంటాను.." బోలెడంత సిగ్గుపడిపోతూ చెప్పిందామె...

శ్రీరామ్ ఆమె వైపు చూస్తూ- అలాగే నిలబడి పోయాడు.

"ఇక ఇప్పుడు 'కడుపాకలి' తీర్చుకుందాం ...పద" అంటూ అతని చేయి పుచ్చుకుని వంటింటివైపు నడిచింది అశ్విని.

* * *

అశ్విని వేసిన పథకం ప్రకారం-

బుధవారం పొద్దున్నే -విష్ణుమూర్తి దగ్గర్నించి వీరభద్రానికి ఫోనొచ్చింది.

'అశ్వినిని ఓసారి పంపిస్తే పదిరోజులు తన దగ్గర వుంటుందనీ' ఎలాగో శ్రావణమాసం కనుక -పుట్టింట్లో నోము నోచుకున్నట్టవుతుందనీ చెప్పాడు విష్ణుమూర్తి .

కాదని ఖండించేందుకు కారణాలు కనిపించలేదు వీరభద్రానికి..

"అటులనే కొనిపొండు!" అన్నాడు.

ఆ సాయంత్రమే టౌన్నించి కారొచ్చింది.. అందులో అశ్విని పుట్టింటికి ప్రయాణమై వెళ్లింది...

రెండు రోజుల గడిచింతర్వాత - అంటే శుక్రవారం పొద్దున్న శ్రీరామ్ గదిలో సెల్‌ఫోన్ రింగైంది. దాని కోసమే ఆత్రంగా ఎదురు చూస్తున్న శ్రీరామ్ -వెంటనే దాన్ని తీసుకుని హాల్లోకి వచ్చాడు.... అక్కడ ఉయ్యాలబల్ల మీద కూర్చుని పేపరు చదువుకుంటున్న తండ్రికీ-వంకాయలు తరుగుతున్న తల్లికీ వినిపించేలా ఫోన్లో మాట్లాడుతున్నాడు-

'హలో..."

"......"

"ఓర్నీ ! నువ్వట్రా !..బావున్నావా?... ఏమిటీ విశేషాలు ?"

"......"

"వెరీగుడ్ ..! కంగ్రాట్స్ !... ఎప్పుడూ ?"

"......"

"నేనా ?... కష్టంరా!... మా స్కూల్ మేనేజ్‌మెంటంతా ఇప్పుడు మా నాన్నగారు నా చేతిలో పెట్టారు.. బిజీగా వుంటున్నాను... రాలేను..!"

".........."

"సరే ...సరే!...అంత ఒట్టు పెట్టద్దు ..ఎలాగో అలా వీలుచేసుకుని వస్తాన్లే... అయినా శని, ఆదివారాలే గా... ఫర్వాలేదు.."

"........"

"సరే అన్నాగ! వస్తాన్లే... వుంటాను.. బై!"- అంటూ ఫోన్ ఆఫ్ చేసి బల్లమీద పెట్టేశాడు శ్రీరామ్.

"ఎక్కణ్ణుంచిరా ఫోనూ !" వంకాయలు తరగటం పూర్తి చేసిన పార్వతమ్మ హాల్లోకి వస్తూ అడిగింది.

"విశాఖపట్నం నించి అమ్మా ! మా క్లాస్‌మేట్ సుబ్బారావ్ లేడూ ?..వాడు చేశాడు!" తండ్రికి -వినిపించేలా చెప్పాడు.

"తమరు చదువు వెలగబెట్టింది విశాఖపట్నము నందు కాదు కదా ?" -వీరభద్రం అడిగేడు వెంటనే.

"అదే... అంటే.. నేను చదివింది టౌన్లోనే అయినా - విశాఖపట్నం నించి వచ్చిన సుబ్బారావు - నాతోపాటు హాస్టల్లో వుండి చదివేడు.. అదన్నమాట!" సర్దిచెప్పాడు శ్రీరామ్.

"ఇంతకూ వారేమి శలవిచ్చితిరి?.. తమరేం అఘోరించితిరి?" -చేతిలో వున్న పేపర్ని మడిచి పెడుతూ అడిగేడు వీరభద్రం -కొంచెం విసుగ్గా.

"అదీ.... మీరూ విన్నారుగా!"

"అవతలివారి వాక్కులు- ఆ ఫోను నించి మాకు వినబడి చావవు కదా?"

"ఓ ! అవును కదా !. మరేం లేదు నాన్నగారూ!..ఎల్లుండి శనివారం, అతని పెళ్ళిట!.. నన్ను విశాఖపట్నం రమ్మన్నాడు. 'వీలు పడదేమో' అంటే - వల్లకాదంటూ 'ఒట్టు' పెట్టాడు.. వెళ్లక తప్పేలా లేదు!" పథకం ప్రకారం నటనకు ప్రాణం పోస్తూ చెప్పాడు శ్రీరామ్.

"అఘోరించారు !.. తమరా ఒట్టు తీసి గట్టునపెట్టి - ఓ 'గ్రీటింగు టెలిగ్రాం' కొట్టండి!... నరిపోతుంది!" జడ్జిమెంట్ ఇచ్చిన న్యాయమూర్తిలా చెప్పేసి -ఉయ్యాల బల్లదిగి గదిలోకి వెళ్లిపోయాడు వీరభద్రం.

శ్రీరామ్ దిక్కుతోచని వాడిలా నిలబడి పోయాడు...

అశ్విని వేసిన పథకం ప్రకారం -తను శుక్రవారం విశాఖపట్నం వెడుతున్నవాడిలాగా ఇంట్లో బయల్దేరి - రైలు ఎక్కేందుకు, ముందుగా టౌనుకెళ్లి -అక్కణ్ణుంచి అశ్వినిని వెంటబెట్టుకుని బెజవాడ వెళ్లాలి... ! బెజవాడలో, మంచి లాడ్జిలో దిగి ముందుగా కనకదుర్గమ్మను సందర్శించుకోవాలి..! ఆ తర్వాత పుట్టినరోజు కానుకగా అశ్వినీ దేవతను ప్రసన్నం చేసుకోవాలి..! తిరిగి ఆదివారం నాడు టౌన్లో , ఆమెను వాళ్లింటో ఒదిలిపెట్టి.. తను రాజుపాలెం చేరుకోవాలి!.. కానీ ఇప్పుడు కథ అడ్డం తిరిగేలా వుంది... వీల్లేదంటూ తన తండ్రి ఆర్డరు జారీ చేశాడు.

ఇప్పుడెలా !... 'ప్లాన్' విజయవంతం కాకపోతే అశ్వినికి కోపం వస్తుంది.. పుట్టినరోజు పూటా పుట్టెడు దుఃఖంలో మునిగిపోతుంది.. తన అసమర్థతను పదేపదే ఆడిపోసుకుంటుంది...!

అలా జరగటానికి వీల్లేదనుకున్నాడు శ్రీరామ్... ఎలాగైనా సరే , తండ్రికి నచ్చజెప్పి ఒప్పించాలని నిశ్చయించుకున్నాడు...

కుడిచేతి 'దండ' కున్న తాయెత్తును ఓసారి కళ్ళకు అద్దుకుని - తన తండ్రి గదిలోకి నడిచాడు.

అప్పటికే వీరభద్రం స్కూలు కెళ్లేందుకు 'రడీ' అవుతున్నాడు.

"నేను సుబ్బారావు పెళ్ళికి వెళ్లకపోతే మర్యాదగా వుండదు నాన్నగారూ! అందుకని... రేపొద్దున బయల్దేరి టౌను కెళ్లి -అక్కణ్ణుంచి ట్రైనులో విశాఖపట్నం వెడతాను... రాత్రికల్లా చేరిపోవచ్చు...ఎల్లుండి పెళ్ళిఅయిపోగానే ఆదివారానికల్లా తిరిగొచ్చేయచ్చు...! రెండ్రోజులే స్కూలు పోతుంది!" తల దువ్వుకుంటున్న తండ్రి వెనకాల జేరి -సవినయంగానే చెప్పాడు శ్రీరామ్..

అద్దం ముందు నిలబడి వున్న వీరభద్రం - అందులోంచి అతన్ని చూస్తూ కోపంగా అన్నాడు-

"స్కూలు ఎక్కడికీ పోదు... పోకూడదు!... తాతలకాలమునించీ వస్తున్నది!.. దాని మంచి చెడ్డలు చూడవలసిన భారము నీపై వున్నది!"

"అంటే .. నా ఉద్దేశ్యం నేను రెండు రోజుల పాటు స్కూలుకి రానంత మాత్రాన దాని నిర్వహణ విషయంలో ఎలాంటి లోపమూ ఉండదని!... అయినా మీకు గుర్తులేదను కుంటాను -నా పెళ్లికి సుబ్బారావు అంత దూరం నించి వాళ్లావిడతో సహావచ్చాడు.. న్యాయంగా నేనూ అశ్విని తోసహా వెళ్లాలి!.. కానీ తనను నేను ఎలాగా తీసుకెళ్ళలేను!... కనీసం నేనొక్కణ్ణైనా వెళ్ళకపోతే మర్యాదగా వుండదు".

ఆ మాటలు విన్న వీరభద్రం ఉలిక్కిపడి -శ్రీరామ్ వైపు తిరిగేడు -

**-(ఇంకావుంది)**



కూర్పు: తెలికిచెర్ల రామకృష్ణ- విజయనగరం, టి. నవీన్-హైదరాబాద్

# సరిగపదమని



## ఎస్.రాజేశ్వరరావు స్పెషల్ 29

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ● | 1 | ● | ● | 2 | | | | ● |
| 3 | | | ● | | ● | ● | ● | 4 |
| 5 | | ● | 6 | | ● | 7 | | |
| | ● | 8 | ● | ● | 9 | | ● | ● |
| ● | 10 | | | ● | | ● | 11 | |
| 12 | ● | | ● | 13 | | ● | | ● |
| 14 | | ● | 15 | ● | 16 | | ● | 17 |
| | ● | 18 | ● | 19 | ● | ● | ● | |
| 20 | | ● | 21 | | | ● | 22 | |

పంపినవారి పేరు :..............................................................

వయసు :........... వృత్తి :..............................................................

చిరునామా :..............................................................

..............................................................

..............................................ఫోన్ :..............................

**అడ్డం:**

2. "............ తవదీనా రాధా" అంటూ విప్రనారాయణలో భానుమతితో పాడించిన అష్టపది తొలిభాగం (4)
3. "అడుగు అడుగునా అప......లతో అలసిసొలసినా నా హృదయనికి" "డాక్టర్ చక్రవర్తి‌లోని 'ఎవరో జ్వాలను రగిలించారు'పాటలోని ఓ లైను (3)
5. "........ ........ ....... కొమ్ములు గజ్జెలు ఘణ ఘణ ఘణ ఘణ మెళ్ళో గంటలు" "మల్లీశ్వరి"లోని పరుగులు తీయ్యాలి పాటలోని ఓలైను (2)
6. "......పెంచే అందాలే అవి నన్నే చెందాలే" "బొబ్బిలియుద్ధం" చిత్రనిర్మాతకు ఘంటసాలతో పాడించిన పాట (2)
7. "అందెను నేడే అందని ..........." "ఆత్మగౌరవం"లోని పాట (3)
9. "........ బావకు పెళ్ళంట కోవెలతోట విడిదంటా" మల్లీశ్వరిలోని అల్లరి గీతం (2)
10. "ఈ ........ రాలలో ఏ కన్నులు దాగేనో" అక్కినేనిచే అభినయింప జేసిన పాట (2)
11. " ....... లేక వీణ పలుకలేనన్నది ......... రాక రాధ నిలువలేనన్నది డాక్టర్ చక్రవర్తిలోని పాట (2)
13. " ........చెంత విరహమునే తాళలేనుగా" "అప్పుచేసి పప్పుకూడు"లో "చేయి చేయి కలుపరావె" పాటలోనిలైను (2)
14. "........లైతే దొరవేరా రాతిరి నా రాజువురా" "బంగారు పంజరం"లో జానకితో పాడించిన పాట (2)
16. "......... కనిపించింది నన్ను మురిపించింది" "రాణి రత్నప్రభ"లో ఎన్.టి.ఆర్‌తో అభినయింపజేసిన పాట (2)
20. "......... మొసగే వనమాలి" "భక్తప్రహ్లాద"లో బాలమురళితో పాడించిన పాట (2)
21. "........వెన్నెల జగమే ఊయల" జమున కోసం జానకిచే పాడించిన పాట (2)
22. ".......కో శ్రీరంగ ......కోవయ్యా" విప్రనారాయణలో ఏయమ్‌రాజాతో పాడించిన పాట (2)

**నిలువు:**

1. '..........లూగినదోయి మనసే" "బొబ్బిలియుద్ధం"లో భానుమతితో పాడించినపాట (3)
2. ఈ పజిల్‌లోని పాటల స్వరకర్త ఇంటిపేరు (3)
3. "........ మారినది మధురముగా ఈవేళ" "దేశద్రోహులు"లో ఘంటసాలచే పాడించినపాట (3)
4. "చిన్నారి......... పెళ్ళి జరిగింది ఈ చిలకమ్మకు నాకు వరసకుదిరింది" "ఆత్మీయులు"లోని పాట (2)
7. "ఓ ......... వన్నె బుజ్జాయిల్లారా నోరులేని తువ్వాయిల్లారా" నమ్మినబంటులోని "చెంగుచెంగున గంతులు వేయండి పాటలోని లైను (2)
8. "......... రావేలా మెల్లగ రావేలా వినీల మేఘమాలా" "భలేరాముడు"లోని పాట (3)
9. "నీ చెలిమీ నేడె ........." "ఆరాధన"లో సావిత్రికి సుశీలచే పాడించినపాట (4)
11. "........ నావు నిదురరావు నిలిచిపోయె ఈ రేయి" పూలరంగడులోని పాట (2)
12. "హైలో హైలేసా హంసకదా ........" "భీష్మ"లో జమునారాణిచే పాడించిన పాట (4)
15. "......హృదయంలో నిదురించే చెలీ" శ్రీశ్రీ గీతానికి ఘంటసాలతో పాడించిన పాట (1)
17. ".......... వస్తావా అడిగింది ఇస్తావా" అల్లు కోసం బాలుతో పాడించిన పాట (2)
18. ".....కర కరుణాలవాల వేణుగోపాలా" ఇదికూడా "బొబ్బిలియుద్ధం"లో భానుమతితో పాడించిన పాటే (1)
19. "......... తీర్థంబు తెచ్చాను రామాహరీ" రేలంగికి ఘంటసాలతో పాడించిన పాట (2)

**పజిల్, కూపన్ 31-10-2004 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)



మూడవ బహుమతి (రెండు తప్పులతో)




కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



అక్టోబర్ 31 ఎస్.డి.బర్మన్ వర్ధంతిని పురస్కరించుకుని....

# "అస్సాం పూలు బొంబాయిలో వికసించవు"



అస్సామీ గాయకుడు, సంగీతదర్శకుడు భూపేన్ హాజారికా 'సచిన్ దేవ్ బర్మన్'కు ఎంతో ఆత్మీయుడు. బర్మన్ దంపతులపై అభిమానంతో, ప్రేమతో వారిని అస్సాంలో వారింటికి ఆహ్వానించాడు. బర్మన్ దంపతులు ఆ ఆహ్వానాన్ని మన్నించారు కూడా.

బర్మన్ దంపతుల మధ్య విహారయాత్రలు చేసేటంత నఖ్యత తక్కువే! ఒక గొప్ప సంగీతదర్శకుడి భార్య, మరొక గొప్ప సంగీతదర్శకుడి తల్లి అయిన మీరా బర్మన్ స్వయంగా చక్కటి సంగీతజ్ఞురాలు. దర్శకనిర్మాత విజయ్ ఆనంద్ 'తేరే మేరే సప్నే' కు సచిన్‌దేవ్ బర్మన్ సంగీతం ఇచ్చేరోజుల్లో ఆయనకు అసిస్టెంటుగా పనిచేసే ఆర్.డి.బర్మన్ ఎందువల్లో రావడం మానేశాడు. ఎస్.డి.బర్మన్ తన అర్థాంగి సహాయంతో పాటలను రికార్డ్ చేశారు. అన్నీ మణిపూసలే -

'మెరా అంతర్ ఎక్ మందిర్'
'జైసే రాధానే మాలా జపీ శ్యామ్‌కీ'
'జీవన్‌కీ బగియా మహకేగీ'
'హై..మైనే కసమ్ లీ'

ఇలా ఎన్నో ప్రేమగీతాలు తయారుచేసిన ఆ జంట మధ్య పొట్లాటలు ఎక్కువే అయినా కానీ గృహకలహాలు బర్మన్ పనితనాన్ని ఎన్నడూ ప్రభావితం చేయలేదు.

బర్మన్ దంపతులకు అస్సామ్ ప్రకృతి అందాలను చూపించాడు భూపేన్. అక్కడి పూలమొక్కలను చూచి పులకించిన మీరా అంది - 'ఇక్కడి పూలమొక్కలు బాంబేకు తీసుకెళ్లి పెంచుకుందామా?' అని.

దాదా పులకేసి తేరిపార చూసి - వేదాంతిలా జవాబిచ్చాడు - 'విదేశీ సంగీతం ట్యూన్‌లను వ్రేళ్లతో పెకలించి, మన సంగీతంలో ఇమడ్చబోయినా, భారతీయ సంగీతంలో పొసగి ఉండలేవు. ఈ పూలచెట్లూ అంతే.. అస్సాం పూలు బొంబాయిలో వికసించవు."

త్రిపుర రాజవంశీకుడైన బర్మన్‌కు తూర్పు ప్రాంతాల అందాలు తెలియనివి కావు. ఆయన తండ్రి 'నబదీప్ చంద్రదేవ్ బర్మన్' కు రాజరికపు మర్యాదలతో బాటు సంగీతమర్యాదలు కూడా తెలుసు. ఆయన సితార్‌మీద మంచి పట్టున్న సంగీతజ్ఞుడు.. ధృపద్ గాయకుడు.. కొడుకు శచీంద్రదేవ్‌కి సరిగమల తొలకరి జల్లుల పరిచయాలు చేసింది ఆయనే!

తండ్రి వద్ద శిష్యరికం చేసిన తర్వాత సచిన్‌దేవ్ బర్మన్ (శచీంద్రదేవ్), ఉస్తాద్ బాదల్‌ఖాన్, భీష్మదేవ్ చటోపాధ్యాయ్ దగ్గర శాస్త్రీయసంగీతం నేర్చుకున్నాడు. ఉస్తాద్ అఫ్తాబుద్దీన్ ఖాన్ దగ్గర శిష్యరికం చేశాక సచిన్ తన 24 వ యేట 1930లో కలకత్తాలో 'సుర్‌మందిర్' పేరుతో ఓ సంగీత పాఠశాల ప్రారంభించాడు.

శాస్త్రీయసంగీతంతో బాటు లలితసంగీతంలో కూడా సచిన్ ప్రావీణ్యం సంపాదించాడు. మన్నాడే బాబాయి అయిన కె.సి.డే దగ్గరా బాంగ్లా విప్లవకవి, కంపోజర్ అయిన 'కాజీ నజ్రుల్ ఇస్లాం' వద్ద కొన్ని మెళకువలు నేర్చుకున్నాడు. జానపదుల సంగీతాన్ని అధ్యయనం చేశాడు. అందుకే

ఈశాన్యప్రాంతపు కొండసీమల, అడవుల 'తాజాదనం'
సెలయేటి గలగలల 'స్వచ్ఛత'
ప్రకృతి అందాల 'మనోహర ఛాయలు' ఆయన్ను మేటి దేశీయ సంగీతదర్శకుడిగా నిలిపాయి. 'నుజాతా', 'దేవదాస్', 'బందినీ' వంటి వంగవాతావరణంలో తీసిన సినిమాలలో దేశీయసంగీతంపై ఆయన పట్టు ఎలాటిదో బాగా తెలుస్తుంది. 'జ్యూయల్‌థీఫ్'లో 'హోంఠోంపే ఐసే బాత్‌కో' పాటలో తూర్పు ప్రాంతాల్లో ఉపయోగించే వాయిద్యాలన్నీ వినబడతాయి.

భారతీయత ఉట్టి పడే ఆయన పాటలు ఎన్నో ఉన్నాయి -

'దుఖీ మన్ మేరే సున్ మేరా కహ్నా..' (ఫంటూష్)
'మొరా గోరా అంగ్ లైలే...మొహే శ్యామ్ రంగ్ దైదై...' (బందినీ)
'ఆజ్ సజన్ మోరే అంగ్ లగాలే' (ప్యాసా)
'చాంద్ ఫిర్ నిక్‌లా' (పేయింగ్ గెస్ట్)
'పియా తోసే నైనా లాగేరే' (గైడ్)
'పూఛో న కైసే మైనే రైన్ బితాయీ' (మేరీసూరత్ తేరీ ఆంఖే)
'తేరేనైనా తలాశ్ కర్' (తలాశ్)
'మేఘా ఛాయే ఆధీ రాత్' (శర్మీలీ)
'యేదిల్ దీవానా హై' (ఇశ్క్ పర్‌జోర్ నహీ)
'తేరే మేరే మిలన్ కీ ఏ రైనా' (అభిమాన్)
'చుప్‌కే చుప్‌కే' (చుప్‌కే చుప్‌కే)

... ఇలా ఎన్నో!

పాశ్చాత్యసంగీతం మన సినిమాల్లో ఇమడదు అని చెప్పిన బర్మన్ ఎన్నో గీతాల్లో పాశ్చాత్యపు సంగీతపు సౌరభాలను వెదజల్లలేదా?

'హాయ్, హాయ్ ఏ నిగాహే' (పేయింగ్ గెస్ట్)
'రాత్ అకేలీ హై బుఝ్‌గయే దియే..' (జ్యూయల్‌థీఫ్)
'హమ్‌థే వో థీ ఔర్ సమా రంగీ..' (చల్తీ కా నామ్ గాడీ)
'అరె యారోం మేరీ తుమ్‌భీ హో గజబ్' (తీన్‌దేవియా)
'సాలా మైతో సాబ్ బన్‌గయా..' (సగీనా)

.. ఇలా ఎన్నో చెప్పుకోవచ్చు

రూప్‌తేరా మస్తానా ('ఆరాధన')పాటలో భాటియాలీ స్టయిల్‌కి పాశ్చాత్యపు మెరుగులు అద్దిన సవ్యసాచి బర్మన్! చరణాల మధ్య ఆర్కెస్ట్రా విషయంలో కూడా ఎన్నో విదేశీ వాయిద్యాలను వినిపించి కొత్త పోకడలు పోయిన ప్రయోగశీలి.

మరి ఇలాటి బర్మన్ పాశ్చాత్యసంగీతం మనలో ఇమడదని ఎందుకన్నట్టు!?

ఏమో, భార్యమీద అలకతో ఆవిడ మాట సాగకూడదనే ఉద్దేశ్యంతో, దానికి అందమైన ముసుగు తొడిగి అలా అన్నాడేమో! రాజవంశీకుడు కదా! పాలిటిక్స్ తెలియకుండా ఉంటాయా!? ఏమో!

**- డా॥ జె.పి.వైద్య**



# ఆ పాట మధురం

రాజా

ఆచార్య ఆత్రేయ దర్శకత్వంలో అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణకుమారి హీరోహీరోయిన్లుగా 1961లో వచ్చిన

## వాగ్దానం

చిత్రంలో గల ఎనిమిది పాటలలో ప్రేక్షక శ్రోతల స్మృతి పథంలో ఈనాటికీ కదలాడుతున్న అయిదు పాటలలో రెండిటి గురించి గత సంచికలో చెప్పుకోగా మిగిలిన మూడింటి గురించి ఈ సంచికలో....

వన్నెచిన్నెలన్నీ వున్న చిన్నదానివే -
అన్నీ వున్నదానివే
ఎన్నివున్నా జోడులేక లేనిదానివే -
ఏమీలేనిదానివే - ఉత్త ఆడదానివే
తిరిగే చక్రాలున్నా - పైకెగిరే గుఱ్ఱాలున్నా ॥తిరిగే॥
కళ్ళెం పట్టీ... కళ్ళెంపట్టి కళ్ళనుకట్టి నడిపే
మొనగాడుండాలి ॥వన్నె॥
అందనిదైనాగానీ నరులందరు
కోరుదురందాన్ని ॥అందని॥
తూకం వేసీ... తూకంవేసి పాకం చూసీ,
డెందం ఒకరికె ఇవ్వాలి ॥వన్నె॥
అందం డెందం కలిపి -
ఆనందం అర్థం తెలిపే ॥అందం॥
అతగా డొకడు జతయైనపుడు,
అన్నీవున్నవనుకోవాలి ॥వన్నె॥








పెండ్యాల స్వరపరచిన ఈ పాటను ఘంటసాల గానం చేశారు. అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణకుమారి అభినయించారు. ఇది కథాగమనానికి, సన్నివేశానికి అనుగుణంగా రాయబడిన పాట. ఆస్తిపాస్తుల్ని నిర్వహించడానికి తగిన మానసిక పరిపక్వత రాని వయసులోనే ఆ బరువు బాధ్యతల్ని తనకు కన్నతండ్రి అప్పగించి కన్నుమూయగా, ఆయన పైగల గౌరవాభిమానాలతో వాటిని తలకెత్తుకొని ఎవరు శ్రేయోభిలాషులో ఎవరు కారో ఎవర్ని ఎంతవరకు నమ్మాలో తెలియక సతమతమయ్యే కథానాయకురాల్ని ఉద్దేశించి నాయకుడు నర్మగర్భంగా పాడే పాటకు ఆత్రేయ అందించిన సాహిత్యం యిది.

దర్శకుడు, సంభాషణల రచయిత తనే కాబట్టి కథకు, పాత్రల మనస్తత్వానికి తగ్గట్టు పాటను ఆత్రేయ రాసినా -నిజజీవితంలో కూడా చాలామంది తమకు తాము అన్వయించుకునేట్టు అమరింది ఈ పాట సాహిత్యం. 'డెందం(మనసు)' అనే ఒక్క పదాన్ని తప్పిస్తే తక్కిన సాహిత్యమంతా వాడుక భాషలో ఉన్నదే. (అందుకే విజయావారి నాగిరెడ్డి ఓసారి వేటూరితో అన్నారు - 'ఈ డెందం అనే మాటకి అర్థం ఎంతమందికి తెలుస్తుంది!?' అని.) ఈ పాటను ట్యూన్ పరంగా ఆలోచిస్తే పెండ్యాలను ప్రత్యేకంగా ప్రశంసించి తీరాలి. ఇది చాలా సులువుగా నోటికి పట్టుబడే ట్యూను. స్వతహాగా

సంగీతంలో మంచి ప్రవేశం ఉండి, అన్యులెవరూ తేరి చూడలేని విధంగా ప్రామాణిక గీతాలను స్వరపరచగలిగే ప్రావీణ్యం ఉండి కూడా ఇంత సులువైన ట్యూన్‌ను అందించడానికి చాలా సంస్కారం కావాలి. 'మన పాట జనంలోకి వెళ్ళాలి. వాళ్ళు హాయిగా పాడుకోగలగాలి. ఇక్కడ పాండిత్యాన్ని ప్రదర్శించడం కన్నా మనకున్న జ్ఞానాన్ని జనాకర్షణీయంగా అందించడమే నిజమైన ప్రతిభ. ఇది పాండిత్యాన్ని ప్రదర్శించుకునే సన్నివేశం కాదు' అని తెలుసుకోగలగటమే సినీ పరిశ్రమలో ఉండడానికి కావలసిన సంస్కారం. అదే సంస్కారం ఘంటసాల పాడే విధంలో కూడా మనం గమనించవచ్చు. ఇక్కడ ఈ సంస్కారం గురించి ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే ఇంత సులువైన పాటను అందించిన పెండ్యాల - ఘంటసాల కాంబినేషన్‌లోనే ప్రామాణిక గీతాలెన్నో వచ్చాయి. (రసికరాజ, శివశంకరి మొదలైనవి) అటువంటిదే మరో ప్రామాణిక గీతం... ఈ చిత్రంలోనే.... హరికథగా...

శ్రీనగజాతనయం సహృదయం ॥2॥
చింతయామి సదయం
త్రిజగన్మహోదయం శ్రీనగజాతనయం
శ్రీరామ భక్తులారా! ఇది సీతాకళ్యాణ సత్కథ.
నలభైరోజుల నుంచి చెప్పిన కథ చెప్పిన చోట చెప్పకుండా
చెప్పుకొస్తున్నాను. అంచేత కించిత్తు గాత్ర సౌలభ్యానికి
అభ్యంతరం ఏర్పడినట్లు తోస్తూంది.
నాయనా! కాస్త పాలూ, మిరియాలు ఏవన్నా...!?
చిత్తం... సిద్ధం...
భక్తులారా... ! సీతామహాదేవి స్వయంవరానికి ముల్లోకాల
నుంచి విచ్చేసిన వీరాధివీరుల్లో అందర్నీ ఆకర్షించిన ఒకే ఒక
దివ్య సుందరమూర్తి... ఆహా... అతడెవరయ్యా అంటే...
రఘురాముడు రమణీయ వినీల ఘనశ్యాముడు
రమణీయ... వినీల... ఘనశ్యాముడు
వాడు నెలరేడు సరిజోడు మొనగాడు
వాని కనులు మగమీల నేలురా
వాని నగవు రతనాల జాలురా ॥వాని॥
వాని జూచి మగవారలైన మైమరచి
మరుల్కొనెదరు, మరో మరుడు, మనోహరుడు
రఘు రాముడు!





సనిదని సగరిగరి రిగరి
సగరి రిగరి సగగరిసనిదని
సగగరి పనిదని
రిసనిద రిసనిద నిదపమగిరి
రఘు రాముడు !
సనిస సనిస రిగరి సరిసనిస
పదనిస
సనిగరి సనిస సనిరిసనిదని
నిదసని దపమ గామాదా
నిని నిని నిని నిని
పస పస పస పస
సప సపా సపా
తద్ధిత్తరి కిటతక
రఘు రాముడు రమణీయ వినీల
ఘనశ్యాముడూ..
శభాష్ శభాష్
ఆ ప్రకారంబుగా విజయం చేస్తున్న శ్రీరామచంద్రమూర్తిని
అంతఃపుర గవాక్షం నుండి సీతాదేవి ఓరకంట చూచినదై,
చెంగటనున్న చెలికత్తెతో-
ఎంత సొగసుగాడే
ఎంత సొగసుగాడే
మనసింతలోనే దోచినాడే
ఎంత సొగసుగాడే
మోము కలువరేడే... ॥మోము॥
నా నోము ఫలమువీడే
శ్యామలాభిరాముని చూడగ
నా మది వివశమాయె నేడే ॥ఎంత॥
ఇక్కడి సీతాదేవి ఇలా పరవశయై ఉండగా అక్కడ స్వయంవర
సభామంటపంలో జనక మహీపతి
సభాసదులను జూచి-
అనియెనిట్లు
ఓ యనఘులారా నా యనుగు పుత్రి సీత
వినయాదిక సద్గుణవ్రాత
ముఖ విజిత లలిత జలజాత
ముక్కంటి వింటి నెక్కిడ జాలిన
యొక్కటి జోదును నేడు
మక్కువ మీరగ వరించి
మల్లెలమాల వైచి పెండ్లాడూ...
అని ఈ ప్రకారం జనక మహారాజు ప్రకటించగానే
సభలోని వారందరూ ఎక్కడివారక్కడ చల్లబడిపోయారట. మహా
వీరుడైన రావణాసురుడు కూడా 'హా... ఇది నా ఆరాధ్య దైవమగు
పరమేశ్వరుని చాపము. దీనిని స్పృశించుటయే మహా పాపము 'అని
అనుకొనినవాడై వెనుదిరిగిపోయాడట.
తదనంతరంబున-
ఇనకుల తిలకుడు నిలకడ గల క్రొక్కారుమెరుపువలె నిల్చి
తన గురువగు విశ్వామిత్రుని ఆశీర్వాదము తలదాల్చి
సదమల మదగజ గమనము తోడ స్వయంవర వేదిక చెంత
మదన విరోధి శరాసనమును తన కరమును బూనిన యంత
ఫెళ్ళుమనె విల్లు - ఘంటలు ఘల్లుమనే -
గుభిల్లుమనె గుండె నృపులకు
ఝల్లుమనియె జానకి దేహము
ఒక నిమేషమ్మునందె
నయము జయమును భయము విస్మయము గదురా..
శ్రీమద్రమారమణ గోవిందో హా(రి)
భక్తులందరూ చాలా నిద్రావస్థలో ఉన్నట్టుగా ఉంది
మరొక్కసారి జై శ్రీమద్రమారమణ గోవిందో హా(రి)
భక్తులారా ! ఆ విధంగా శ్రీరామచంద్రమూర్తి
శివధనుర్భంగము గావించినాడు. అంతట-
భూతల నాథుడు -రాముడు
ప్రీతుండై పెండ్లియాడె
పృథుగుణమణి సంఘాతన్
భాగ్యోపేతన్ సీతన్
భూతల నాథుడు - రాముడు
ప్రీతుండై పెండ్లియాడె-
శ్రీమద్రమారమణ గోవిందో హా(రి)









ఆనాటి జనజీవితంలో ఒక భాగమైపోయిన హరికథలు, బుర్రకథలు తెలుగు సినిమాల్లో అడపాదడపా దర్శనమిస్తూనే ఉండేవి. కథాప్రాధాన్యత గల సినిమా పాటలపై హరికథల ప్రభావం బాగా కనబడేది. అయితే హరికథలు చెప్పే ప్రముఖులతో ఆదిభట్ల నారాయణదాసు బాణీలో కంటే పెద్దింటి భాగవతార్ బాణీలోనే సినిమా హరికథలు తయారయేవి. విజయావారి 'షావుకారు ' చిత్రంలో సముద్రాల రచించిన 'శ్రీలు చెలంగే' అనే హరికథనే తొలి తెలుగు సినీ హరికథగా చెప్పుకుంటారు. ఆ తరువాత "బంగారుపాప, కలెక్టరు జానకి, ఓ సీతకథ, అందాలరాముడు,

ఇంటింటిరామాయణం, స్వాతిముత్యం" వంటి చిత్రాలలో హరికథా గీతాలు వచ్చినా 'వాగ్దానం'లోని హరికథకు దక్కిన గౌరవమర్యాదలే వేరు.

ఈ హరికథను రచించినది శ్రీశ్రీ. పాడినది ఘంటసాల. తెరపై అభినయించినది రేలంగి. పక్క వాద్యగాళ్ళుగా ఫిడేలుతో సూర్యకాంతం, మద్దెలతో పద్మనాభం, ప్రేక్షకులలో ముఖ్యులుగా గుమ్మడి ఆ హరికథ సమయంలోనే సమాంతరంగా జరిగే ఓ సన్నివేశంలో కృష్ణకుమారి, చలం, అక్కినేని కనిపిస్తారు. శ్రీశ్రీ అనగానే కేవలం విప్లవ సాహిత్యం మాత్రమే అని అనుకునే కొందరు సినీ ప్రేక్షకుల చేత ఆనాటి నుండి ఈనాటి వరకు ముక్కున వేలేయించిన హరికథ ఇది. సాహిత్యపరంగా శ్రీశ్రీకున్న పాండిత్యాన్ని, ప్రకర్షను ఆకర్షణీయంగా చూసిన ప్రక్రియ ఇది. పాడగలిగిన, పాడదలిచిన వారి వాక్శుద్ధిని అద్భుతమైన పరీక్షకు గురి చేయగల ఈ రచన సినీ సాహిత్య చరిత్రలో ప్రామాణికమైన విలువల ప్రస్తావన వచ్చినప్పుడల్లా ప్రథమ పంక్తిలో నిలిచి తీరుతుంది. అయితే ఈ రచనలో రెండు ఖండికల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. 'ఫెళ్ళుమని విల్లు' దగ్గరనుంచి 'విస్మయము గదురా' వరకు గల సాహిత్యం కరుణశ్రీ వ్రాసిన హృదయశ్రీ అనే కావ్యంలో గల 'ధనుర్భంగము'అనే ఖండిక నుంచి యథాతథంగా వాడుకోవటం జరిగింది. అలాగే చివర్న వచ్చే 'భూతలనాథుడు రాముడు' నుంచి 'భాగ్యోపేతన్ సీతన్' వరకు గల కంద పద్యం పోతన భాగవత పద్యాల నుండి తీసుకున్నది. అలాగే వినాయకస్తుతితో మొదలయ్యే 'శ్రీనగజా తనయం'అనే శ్లోకం అనాదిగా ఉన్నదే.

ఇక ఈ హరికథకు పెండ్యాల సంగీతం సమకూర్చారని అనటం కంటే ప్రాణప్రతిష్ట చేశారని అంటే సముచితంగా ఉంటుంది. 'శ్రీనగజాతనయం' నుంచి 'త్రిజగన్మహోదయం' వరకు కానడ రాగాన్ని ; 'రఘురాముడు' దగ్గర్నుంచి స్వరాలతో సహా తర్వాత వచ్చే 'రమణీయవినీల ఘనశ్యాముడు' వరకూ శంకరాభరణ రాగాన్ని ; 'ఎంత సొగసుగాడే' దగ్గర్నుంచి 'నామది వివశమాయె నేడే' వరకు మోహనరాగాన్ని; 'అనియెనిట్లు ఓ యనఘులారా' దగ్గర్నుంచి 'మల్లెల మాలవైచి పెండ్లాడు 'దాకా ధన్యాసి రాగాన్ని ; 'ఇనకుల తిలకుడు' దగ్గర్నుంచి 'గదురా' దాకా కేదార గౌళరాగాన్ని ; చివర్నగల 'భూతలనాథుడు' అనే పద్యానికి శంకరాభరణ రాగాన్ని ఉపయోగించారు. కేదారగౌళ రాగంలో పెండ్యాల శైలిని పట్టుకోవాలంటే ఈ హరికథలో 'ఫెళ్ళుమనె విల్లు' దగ్గర్నుంచి 'గదురా' వరకు ఆలపించుకుంటూ 'మహాకవి కాళిదాసు' చిత్రంలోని 'శ్యామలాదండకం'లో 'చతుర్భుజే' అనే శ్లోకాన్ని గుర్తుకు తెచ్చుకోండి రెండూ ఒక్కలాగే ఉన్నాయనిపిస్తుంది.

అలా పెండ్యాల ప్రాణపతిష్ట చేసిన ఈ హరికథను అణువణువూ సజీవ చైతన్యంతో తొణికిసలాడేలా పాడి శాశ్వతత్వాన్ని ప్రసాదించారు ఘంటసాల. ఓ వైపు ఉదాత్తంగా రాగాలాపన చేస్తూనే మరొక వైపు స-రసస్ఫోరకంగా జనరంజకంగా ఘంటసాల 'పాడిన తీరుకి తెలుగువారు ఈ గాయకుడికి ఎంతగా ఋణపడిపోయారో కదానని అనిపిస్తుంది.

శ్రీశ్రీ- పెండ్యాల- ఘంటసాల - ఈ ముగ్గురి ప్రతిభను తారస్థాయిలో వాడుకున్న ఆత్రేయ -ఇందరి కృషి ఫలితమైన ఈ హరికథ - తెలుగువారి హృదయాల్లో తెలుగుతనం, తదనుగుణమైన అభిరుచి, ఆ అభిరుచి మీద గౌరవం - ఇవన్నీ చావనంతవరకు బ్రతికే ఉంటుంది.

**బంగరు నావ - బ్రతుకు**

**బంగరు నావ - బంగరు నావా బ్రతుకు బంగరు నావా దాన్ని**
**నడిపించు నలుగురికి మేలైన త్రోవ**
**బంగరు నావా బ్రతుకు బంగరు నావా**
**బ్రతుకు బంగరు నావా బ్రతుకు బంగరు నావా**
**అనుమానం చీకటులు ఆవరించినా ॥అనుమానం॥**
**అపనిందల తుఫానులు అడ్డగించినా**
**కదలిపోవు కాలచక్ర మాగిపోవునా**
**నావ నడిపించు నలుగురికి మేలైన త్రోవ ॥బంగరు॥**
**అనురాగం వెన్నెలలు అంతరించినా ॥అనురాగం॥**
**ఆశలన్ని త్రాచులై కాటువేసినా**
**జీవితము జీవించి ప్రేమించుటకే**
**నావ నడిపించు నలుగురికి మేలైన త్రోవ ॥బంగరు॥**
**కనులున్నది కన్నీటికి కొలనులౌటకా ॥కను॥**
**వలపన్నది విఫలమై విలపించుటకా?**
**దొరకబోని వరము బ్రతుకు మరణించుటకా**
**నావ నడిపించు నలుగురికి మేలైన త్రోవ ॥బంగరు॥**






ఆత్రేయ రాసిన ఈ పాటను సుశీల ఆలపించగా గిరిజ, అక్కినేని నాగేశ్వరరావు, కృష్ణకుమారి అభినయించారు. అటు గిరిజకి ఇటు కృష్ణకుమారికి ఏకకాలంలో పాడి, ఒప్పించిన సుశీలను ఇక్కడ ప్రత్యేకంగా ప్రశంసించి తీరాలి. ఇవాళ వ్యక్తిత్వ వికాసాల కోసం కౌన్సిలింగులకు వెళ్తున్న వారు ఇలాంటి పాటల సాహిత్యంపై ఓసారి దృష్టిని సారిస్తే - మన తెలుగు సినీ కవులు ఇటువంటి ట్రీట్‌మెంట్‌ని ఎప్పుడో చేశారని గుర్తించడానికి ఆస్కారం ఉంటుంది. ఆత్మహత్యని హత్యని చాలా చిన్న విషయాలుగా అన్ని సమస్యలకూ అదే పరిష్కారంగా భావించే నేటి యువత కచ్చితంగా ఒంటపట్టించుకోదగ్గ సాహిత్యం ఈ పాటలో ఉంది. ఇక సంగీత పరంగా ఈ పాటలో పెండ్యాల చేసిన ప్రయోగం సామాన్యమైనది కాదు. పల్లవిలో చారుకేశి రాగం స్కేల్‌ని తీసుకున్నారు. పల్లవి రిపీట్ అయినప్పుడు చివర్న 'బ్రతుకు బంగరు నావా బ్రతుకు బంగరు నావా' అంటూ బరువుగా వచ్చే వాక్యానికి చక్రవాక రాగాన్ని మిక్స్ చేశారు. 'అనుమానం చీకటులు ఆవరించినా, అపనిందల తుఫానులు అడ్డగించినా, కదలిపోవు కాలచక్రమాగిపోవునా' దగ్గర హరికాంభోజి రాగ స్వరాలను తీసుకుని అందులో 'గ' అనే స్వరాన్ని మినహాయించడంతో కొత్త రంగు వచ్చేసింది. కావాలంటే ఈ మూడులైన్లూ పదేపదే పాడుకుని చూడండి. మాస్టర్ వేణు స్వరపరిచే శైలి గుర్తొస్తుంది. జానపద బాణీలను తీసుకోవడం, అందుకు ఆధారమైన హరికాంభోజి లాంటి రాగాలలో కొన్ని స్వరాలను మినహాయించటం, ఆయా రాగంలోని ఆరోహణ క్రమంలో చివరకి వచ్చే స్వరాలతో మొదలు పెట్టడం ఇవన్నీ వేణుగారి పద్ధతులు. ఈ పాటలోని 'అనుమానం చీకటులు ఆవరించినా' అనే వాక్యాన్ని 'ధైవతం' ('ద'అనే స్వరం) నుంచి మొదలు పెట్టారు. అందుకే ఈ ఒక్క చరణం వేణుగారి శైలిలో ఉన్నట్టనిపిస్తుంది. మిగిలిన రెండు చరణాలకూ, వాటి ముందు వచ్చే ఇంటర్ల్యూడ్‌లకూ చక్రవాక రాగాన్ని స్పష్టంగానే వాడుకున్నారు. ఇన్ని ప్రయోగాలు చేసినా సామాన్యుడికి పాటను అందించటంలో తీరాలకు అందని దూరాలకు వెళ్ళిపోకుండా హాయిగా అందించారు పెండ్యాల. అందుకు కారణం - పాండిత్య ప్రదర్శన కన్నా ప్రతిభను ప్రజలకు ఎలా అందించాలన్న జ్ఞానం గల సంస్కారం ఉండడం. అందుకే అన్నారు పింగళి - 'పాండిత్యం కన్నా జ్ఞానం ప్రధానం... వెయ్యి వాడికి రెండు వీరతాళ్ళు' అని!

ఇలా చెప్పుకుంటూ పోతే ఆనాటి పాటలలో ఎంత సమాచారం ఉందో అని అనిపించదూ?

### రచన: వేటూరి సుందరరామమూర్తి
### గానం: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, సుశీల

శో: ఓంకార పంజరశుకీం
ఉపనిష దుద్యానకేళి కలకంఠీం
ఆగమ విపిన మయూరీం
ఆర్యాం అంతర్విభావయే గౌరీం
అ: అఖిలాండేశ్వరి చాముండేశ్వరి
పాలయమాం గౌరీ-
అ: పరిపాలయమాం గౌరీ ఇ: ॥ అఖిలాండేశ్వరి॥
ఆ: శుభగాత్రీ గిరిరాజపుత్రీ
అ: అభినేత్రి శర్వార్ధగాత్రీ
ఆ: శుభగాత్రీ గిరిరాజపుత్రీ
ఇ: అభినేత్రి శర్వార్ధగాత్రీ
ఆ: సర్వార్థ సంధాత్రి జగదేక జనయిత్రి
ఇ: చంద్ర ప్రభా ధవళకీర్తీ
అ: సర్వార్థ సంధాత్రి జగదేక జనయిత్రి
ఇ: చంద్ర ప్రభా ధవళకీర్తీ
ఆ: చతుర్బాహు సంరక్షిత శిక్షిత చతుర్దశ శాంతర భువపాలినీ
అ: కుంకుమరాగ శోభినీ
ఆ: కుసుమబాణ సంశోభినీ
ఇ: మౌనసుహాసిని గానవినోదిని
భగవతీ పార్వతీ - దేవీ
ఆ: శ్రీహరి ప్రణయాంబురాశీ
అ: శ్రీపాద విచలిత క్షీరాంబురాశీ
ఆ: శ్రీహరి ప్రణయాంబురాశీ ఆ: ॥అఖిలాండేశ్వరి॥
అ: శ్రీపాద విచలిత క్షీరాంబురాశీ
ఆ: శ్రీ పీఠ సంవర్ధినీ డోలాసురమర్ధినీ
అ: శ్రీ పీఠ సంవర్ధినీ డోలాసురమర్ధినీ
ఆ: ధనలక్ష్మీ- ధాన్యలక్ష్మీ
ధైర్యలక్ష్మీ - విజయలక్ష్మీ
అ: ధనలక్ష్మీ- ధాన్యలక్ష్మీ
ధైర్యలక్ష్మీ - విజయలక్ష్మీ
ఆ: ఆదిలక్ష్మీ - విద్యాలక్ష్మీ
గజలక్ష్మీ- సంతానలక్ష్మీ
ఇ: సకలభోగ సౌభాగ్యలక్ష్మీ
శ్రీ మహలక్ష్మీదేవీ ॥అఖిలాండేశ్వరి॥
ఆ: ఇందువదనే కుందరదనే వీణాపుస్తకధారిణే
అ: ఇందువదనే కుందరదనే వీణాపుస్తకధారిణే
ఆ: శుకశౌనకాది వ్యాస వాల్మీకి మునిజన పూజిత శుభచరణే
అ: శుకశౌనకాది వ్యాస వాల్మీకి మునిజన పూజిత శుభచరణే
ఆ: సరస సాహిత్య సరస సంగీత - స్తన యుగళే ॥2॥
వరదే అక్షర రూపిణే
ఇ: శారదే -దేవీ ॥అఖిలాండేశ్వరి ॥
ఆ: వింధ్యాటవీ వాసినే యోగ సంధ్యా సముద్భాసినే
అ: సింహాసన స్థాయినే దుష్కహర రంహక్రియా శాలినే
ఆ: విష్ణుప్రియే సర్వలోక ప్రియే
అ: సర్వనామ ప్రియే ధర్మసమరప్రియే
ఆ: హే బ్రహ్మచారిణే
అ: దుష్కర్మవారిణే
ఆ: హే విలంబిత కేశపాసినే
ఇ: మహిష మర్ధన శీల మహిత గర్జనలోల
భయదనర్తన కేళికే - కాళికే
దుర్గమాగమ దుర్గవారిణే దుర్గే - దేవీ

### గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, బృందం

ఓం జాతవేదసే సునవామసోమమరాతీయతో నిదహాతి
వేదః ॥
సనః పర్షదతిదుర్గాణి విశ్వానావేవ సింధుం దురి తాత్యగ్నిః ।
తామగ్నివర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం కర్మఫలేషు
జుష్టామ్ ।
దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే సుతరసి తరసే నమః ।
అగ్నే త్వం పారయానవ్యో అస్మాన్ త్స్వస్తి భిరతి దుర్గాణి విశ్వా
పూశ్చ పృథ్వీ బహులాన ఉర్వీ భవతోకాయ తనయాయ
శంయోః ।
విశ్వానినో దుర్గహా జాతవేద స్సింధుంనవానా దురితాతి
పర్షీమ్ ।
అగ్నే అత్రివర్మనసాగణానోస్మాకం బోధ్యవితా తనూనామ్ ॥
స్పృతనా జితగ్ం సహమాన ముగ్ర మగ్నింహువేమ
పరమాథ్సధస్తాత్ ॥
సనః పర్ష దతిదుర్గాణి విశ్వాక్షామద్దేవో అతి దురితాత్యగ్నిః ॥
ప్రత్నోషికమీడ్యో అధ్వరేషు సనాచ్చహోతా నవ్యశ్చ సత్సి ॥
స్వాం చాగ్నే తనువం విప్రయ స్వాస్మభ్యంచ సౌభగమా
యజ్ఞస్వ। గోభిజుష్ట మయుజో నిషిక్తం తవేంద్రవిష్ణో
రనుసంచరేమ ।
నాకస్యపృష్ఠ మభిసంవసానో వైష్ణవీం లోక
ఇహమాదయంతామ్।
కాత్యాయనాయ విద్మహే కన్య కుమారి ధీమహి ।
తన్నోదుర్గిః ప్రచోదయాత్ ॥

### రచన: వేటూరి సుందరరామమూర్తి
### గానం: ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల

ప: ప్రేమపల్లియ ఎద ఝల్లున పొంగిన రవళి
నవరసమురళి ఆ నందనమురళి
ఇదేనా..ఇదేనా ఆ మురళి - మోహనమురళి...
ఇదేనా ఆ మురళి..... ॥ప్రేమపల్లియ॥
చ: కాళింది మడుగున - కాళీయుని పడగల
ఆబాలగోపాల మాబాల గోపాలుని ॥కాళింది॥
అచ్చెరువున అచ్చెరువున విచ్చిన కన్నులజూడ
అచ్చెరువున అచ్చెరువున విచ్చిన కన్నులజూడ
తాండవమాడిన సరళి గుండెలనూదిన మురళి
ఇదేనా.... ఇదేనా ఆ మురళి
అనగలరాగమై - తొలుత వీనులలలరించి
అనలేని రాగమై - మరలవినిపించి - మరులేకురిపించి
జీవనరాగమై - బృందావన గీతమై... ఆ..
జీవనరాగమై - బృందావన గీతమై...
కన్నెల కన్నుల కలువల వెన్నెలదోచిన మురళి ఇదేనా
ఇదేనా ఆ మురళి మువ్వల మురళి
వేణుగాన లోలుని మురిపించిన రవళి
నటనల సరళి ఆ నందనమురళి, ఇదేనా ఆ మురళి
మువ్వల మురళి ఇదేనా ఆ మురళి
మధురానగరిలో యమునా లహరిలో
ఆ రాధ ఆరాధనాగీతి పలికించి ॥మధురా॥
సంగీత నాట్యాల సంగమ సుఖవేణువై
సంగీత నాట్యాల సంగమ సుఖవేణువై
రాసలీలకే ఊపిరిపోసిన అందెల రవళి
ఇదేనా.... ఇదేనా..... ఆ మురళి ॥ప్రేమపల్లియ॥

రచన: వేటూరి సుందరరామమూర్తి గానం: ఎస్. జానకి

ప: నెమలికి నేర్పిన నడకలివి
మురళికి అందని పలుకులివి
శృంగార సంగీత నృత్యాభినయవేళ
చూడాలి నా నాట్యలీల ॥నెమలికి॥
చ: కలహంసలకిచ్చిన పదగతులు
ఎలకోయిల మెచ్చిన స్వరజతులు ॥కలహంస॥
ఎన్నెన్నో వన్నెల వెన్నెలలు
ఏవేవో కన్నుల కిన్నెరలు ॥ఎన్నెన్నో॥
కలిసి మెలిసి కళలు విరిసి మెరిసిన
కాళిదాసు కమనీయ కల్పనానల్ప
శిల్పమణి మేఖలను, శకుంతలను ॥నెమలికి॥
చ: చిరునవ్వులు అభినవ మల్లికలు
సిరిమువ్వలు అభినయ దీపికలు ॥చిరునవ్వులు॥
నీలాల కన్నుల్లో తారకలు
తారాడే చూపుల్లో చంద్రికలు ॥నీలాల॥
పురులు విరిసి మరులు కురిసి మురిసిన
రవి వర్మ చిత్రలేఖనా లేఖ్య
సరస సౌందర్య రేఖను, శశిరేఖను ॥నెమలికి॥

రచన: త్యాగరాజ స్వామి గానం: జానకి

మరుగేలరా ఓ రాఘవా
మరుగేలరా ఓ రాఘవా
మరుగేలరా ఓ రాఘవా
మరుగేలరా ఓ రాఘవా
మరుగేల చరాచర రూపపరాత్పర
సూర్య సుధాకరలోచన
మరుగేల చరాచర రూపపరాత్పర
సూర్య సుధాకరలోచన ॥మరు॥
అన్ని నీవనుచు అంతరంగమున
అన్ని నీవనుచు అంతరంగమున
తిన్నగా వెదకి తెలిసి కొంటినయ్య ॥అన్ని॥
నిన్నెగాని మదిఎన్నజాలనొరుల
నిన్నెగాని మదిఎన్నజాలనొరుల
నన్ను బ్రోవవయ్య త్యాగరాజనుత ॥మరుగేలరా॥

రచన: ఆదిశంకరులు గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం

అయిగిరి నందిని నందితమోదిని విశ్వవినోదిని నందినుతే
గిరివర వింధ్య శిరోధి నివాసిని విష్ణువిలాసిని జిష్ణునుతే
భగవతి హే శితికంఠకుటుంబిని భూరికుటుంబిని భూరికృతే
జయజయహే మహిషాసుర మర్దని రమ్యకపర్దిని శైలసుతే
అయి జగదంబ కదంబవన ప్రియవాసవిలాసిని వాసరతే
శిఖిరిశిరోమణి తుంగ హిమాలయ శృంగ నిజాలయ మధ్యగతే
మధుమధురే మధుకేతవ భంజని కైటభ భంజని వాసరతే
జయజయహే మహిషాసురమర్దని రమ్యకపర్ధిని శైలసుతే
ఝుణఝుణ ఝుణఝుణ హింకృత
నూపుర శింజిత మోహిత భూతపతే
నటిత నటార్ధ నటీనటనాయక నాటిత నాటక నాట్యరతే
వదన కపాలిని ఫాలవిలోచని పద్మవిలాసిని విశ్వధురే
జయ జయహే మహిషాసుర మర్దని రమ్యకపర్దిని శైలసుతే
కలమురళీరవ వాజితకూజిత కోకిల మంజుల మంజురతే
మిళితమిళింద మనోహర గుంఫిత రంజితశైలని కుంజగతే
మృగగణ భూత మహాశబరీగణ రింఖణ సంభృత కేళిభృతే
జయజయహే మహిషాసుర మర్దని రమ్యకపర్దిని శైలసుతే

రచన : వేటూరి సుందరరామమూర్తి
గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఎస్.జానకి

ప: గోవుల్లు తెల్లన
గోపయ్య నల్లన
గోధూళి ఎర్రన ఎందువలన... ॥గోవుల్లు॥
చ: తెల్లావు కదుపుల్లో కర్రావులుండవా
కర్రావు కడుపున ఎర్రావు పుట్టదా
గోపయ్య ఆడున్న గోపెమ్మ ఈడున్న
గోధూళి కుంకుమై గోపెమ్మ కంటదా
ఆ పొద్దు పొడిచేనా ఈ పొద్దు గడిచేనా
ఎందువలనా అంటే అందువలనా
ఎందువలన అంటే - దైవ ఘటన ॥గోవు॥
చ: పిల్లన గ్రోవికి నిలువెల్ల గాయాలు
అల్లన మోవికి తాకితే గేయాలు
ఆ మురళి మూగైనా - ఆ పెదవి మోడైనా
ఆ గుండెగొంతులో - ఈ పాట నిండదా
ఈ కడిమి పూసేనా - ఆ కలిమి చూసేనా
ఎందువలన అంటే - అందువలన
ఎందువలన అంటే - దైవ ఘటన ॥గోవు॥

గానం: ఎస్.జానకి

నృత్యస్థ పాదారవింద
విశ్వవందిత ముకుంద
భామనే సత్యభామనే
వయ్యారి ముద్దుల సత్యభామనే
భామనే పదియారు వేల
కోమలులందరిలోన
లలనా చెలియా మగువా సఖియా
రామరో గోపాల దేవుని ప్రేమను దోచినదాన సత్య॥
ఇంతినే చామంతినే
మరుదంతినే విరిబంతినే
జాణతనమున సతులలో
నెరజాణనై వెలిగేదాటిదాన ॥భామనే॥

రచన : వేటూరి సుందరరామమూర్తి
గానం: ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, ఎస్.జానకి

ప: ఏ కులము నీదంటే
గోకులము నవ్వింది
మాధవుడు యాదవుడు
మా కులమే లెమ్మంది ॥ఏ కులము॥
అ: ఏడు వర్ణాలు కలిసి ఇంద్రధనసౌతాది
ఆ: అన్ని వర్ణాలకు ఒకటే ఇహము పరముంటాది
అ: ఏడు వర్ణాలు కలిసి ఇంద్రధనసౌతాది
ఆ: అన్ని వర్ణాలకు ఒకటే ఇహము పరముంటాది ॥ఏ కులము॥
అ: ఆది నుంచి ఆకాశం మూగది
ఆ: అనాదిగా తల్లి ధరణి మూగది
అ: ఆది నుంచి ఆకాశం మూగది
ఆ: అనాదిగా తల్లి ధరణి మూగది
అ: నడుమ వచ్చి ఉరుముతాయి మబ్బులు
నడుమ వచ్చి ఉరుముతాయి మబ్బులు
ఆ: ఈ నడమంత్రపు మనుషులకే
మాటలు ఇన్ని మాటలు ॥ఏ కులము॥

# కథా సంగ్రహం

యాజులు సనాతన బ్రాహ్మణకుటుంబానికి చెందిన వ్యక్తి. అమ్మవారి గుడిలో పూజారి. ఆచార వ్యవహారాలు పట్ల పట్టింపు ఎక్కువ. అందుకే కూతురు జానకమ్మ ఓ నాట్యాచారుణ్ణి పెళ్లి చేసుకుందని చెప్పి ఇంటి నుండి వెళ్లగొడతాడు. ఊరిలో అందరకీ ఆయనంటే భక్తితో కూడిన భయం. ఆ ఊరి పెద్ద రాజు గారికి మాత్రం ఈయన మంచి స్నేహితుడు. ఊరి ప్రజల వైద్యావసరాలు తీరుస్తూ... అందరికీ ఆప్తుడిగా వ్యవహరించే రాజు అన్నా యాజులుకు మంచి నమ్మకం.

దసరా ఉత్సవాలు నిర్వహిస్తూ జానకమ్మ కూతురు హేమ నృత్య ప్రదర్శనను ఏర్పాటు చేస్తాడు రాజు. ఆమె నృత్య ప్రదర్శన తిలకించిన తరువాత యాజులు కూడా తన మనవరాలిపై మక్కువ పెంచుకుంటాడు.

హేమ తన నాట్యబృందంలో సభ్యుడైన హరిని ప్రేమిస్తుంది. అతను కూడా ఆమెను గాఢంగా ప్రేమిస్తాడు. ప్రేమికుల మధ్య రహస్యాలు ఉండకూడదని తాను నిమ్నకులం వాడినన్న నిజం చెప్తాడు హరి. తనను పెళ్లి చేసుకోవటానికి పెద్దవారు ఒప్పుకోరు కాబట్టి హేమ ఎవరి సొంతం కాకూడదన్న విచిత్రమైన కోరిక కోరతాడు హరి. తాను ఆజన్మాంతం బ్రహ్మచారిగానే ఉండిపోతానంటూ... ఆమె నిర్ణయం కోసం ఎదురు చూస్తానంటాడు. అదే సమయంలో రాజు సలహామేరకు హేమను తన మనవడు (కొడుకు కొడుకు) గౌరీకి ఇచ్చి వివాహం చేయ నిశ్చయిస్తాడు యాజులు. ఎవరినుండీ అభ్యంతరాలు లేకపోవటంతో వివాహం జరిగిపోతుంది. గౌరీకి తాను నిత్యం కొలిచే అమ్మవారి ప్రతిరూపం భార్యలో కనిపిస్తుంది.

తాను ప్రేమించినప్పటికీ ఒకరికి భార్య అయిన స్త్రీని ఆశించటం తప్పుగా భావించిన హరి, తాను ఆమెను అంతగా ఆరాధించటానికి కారణమైన మువ్వలను తీసుకుని ఊరు వదిలివెళ్లిపోతాడు. భర్తకు చేరువకాలేక, ప్రియుడ్ని మరచిపోలేక సతమతమవుతూ హేమ అందరి చేతా అవమానాలను ఎదుర్కొంటూ ఉంటుంది. తన నుండి ఎందుకు దూరంగా వెళ్లిపోతున్నారని భర్త గౌరీను నిలదీస్తుంది హేమ. సమాధానం చెప్పకుండా వెళ్లిపోయిన గౌరీ, దేవాలయంలో పూలు అమ్మకునే మహిళ చెప్పిన మాటలతో హేమను అమ్మవారి సన్నిధికి తీసుకువచ్చి 'పరస్త్రీని తల్లితో సమానంగా చూసే తనకు భార్యలో అమ్మవారు కనిపిస్తున్నారంటే దానికి కారణం నీలో వేరే వ్యక్తి గురించి ఆలోచనలున్నాయని, దేవి ముందు ప్రమాణం చేసి ఆమె మనసులో ఉన్న వ్యక్తి గురించి చెప్పమంటాడు.

తన మనసులో ఉన్న వ్యక్తి గురించి తెలుపటంతో అతన్ని తీసుకురావటానికి వెళ్లిపోతాడు గౌరీ. ఇదే వియం తాత యాజులుకు కూడా హేమ తెలుపటం, యాజులు స్నేహితుడు రాజు ఆదిశంకరాచార్యుల ఉదంతం గుర్తుచేసి కులాలు మనం సృష్టించుకున్నవేనని, శంకరునిపై భారం వేసి సరైన నిర్ణయం తీసుకొమ్మని చెప్తాడు.

ఊరి ప్రజలు, కొడుకు, కోడలు అడ్డుచెప్పినప్పటికీ తన మనవరాలిని ఆమె కోరిన వ్యక్తితోనే కాపురానికి పంపిస్తాడు యాజులు.

## తారాగణం

జె.వి. సోమయాజులు, అల్లురామలింగయ్య, రమణమూర్తి
సాక్షి రంగారావు, ఝూన్సీ, జానకి, ఫణి
మరియు
నూతన నటులు రవికాంత్, గిరీష్, సబితప్రమీలరాణి

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : కె. విశ్వనాథ్ |
| మాటలు | : జంధ్యాల |
| పాటలు | : వేటూరి సుందరరామమూర్తి |
| నేపథ్యం | : ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, పి. సుశీల, ఎస్. జానకి |
| సంగీతం | : కె.వి. మహదేవన్ |
| సహాయకుడు | : పుహళేంది |
| ఛాయాగ్రహణం | : కస్తూరి |
| కళ | : తోట |
| ఎడిటింగ్ | : జి.జి.కృష్ణారావు |
| అసోసియేట్ డైరెక్టర్ | : నండూరి విజయ్ |
| రికార్డింగ్ రీ-రికార్డింగ్ | : ఏ.ఆర్.స్వామినాధన్, విజయా గార్డెన్స్ |
| స్టిల్స్ | : సత్యనారాయణ |
| నృత్యాలు | : శేషు |
| మేకప్ | : సత్యం |
| కాస్ట్యూమ్ | : సూర్యారావు |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : జి.పృధ్వీరాజ్ |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : జగ్గారావు, రాజగోపాల్ |
| ఔట్ డోర్ యూనిట్ | : శారదా ఎంటర్ ప్రైజెస్ |
| పబ్లిసిటి డిజైన్ | : పాణి |
| పబ్లిసిటి | : లక్ష్మీ పబ్లిసిటి, విజయవాడ |
| ప్రెస్ రిలేషన్స్ | : కృష్ణమోహన్ |
| సహాయదర్శకులు | : ఆదుర్తి భాస్కర్, శివకుమార్ రెడ్డి, సాంబశివరావు. |
| నిర్వహణ | : బి.అంజిరెడ్డి |
| నిర్మాత | : భీమవరపు బుచ్చిరెడ్డి |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : కె.విశ్వనాథ్ |


కె.విశ్వనాథ్


కె.వి.మహదేవన్


వేటూరి


ఎస్.పి.బాలు


పి.సుశీల


ఎస్.జానకి




తారకరత్న, కళ్యాణ్‌రామ్, రామకృష్ణ, హరికృష్ణ, మోక్షజ్ఞ, బాలకృష్ణ, చైతన్యకృష్ణ, జూనియర్ ఎన్టీఆర్

# విజయేంద్రవర్మ ఆడియో రిలీజ్ ఫంక్షన్‌లో కనువిందు చేసిన నందమూరి కుటుంబం



తారకరత్న,
కళ్యాణ్‌రామ్,
హరికృష్ణ,
మోక్షజ్ఞ,
చైతన్యకృష్ణ,
బాలకృష్ణ,
జూనియర్ ఎన్టీఆర్

